# కృష్ణశాస్త్రి కవితాత్మ

ఆవంత్స సోమసుందర్



201

యం. శేషాచలం & కంపెనీ
మచిలీపట్నం - సికింద్రాబాద్

KRISHNA SASTRI KAVITATMA

AVANTSA SOMASUNDAR

*First Edition :*

AUGUST

PRASAD PROCESS,
Machilipatnam

*Publishers :*

M. SESHACHALAM & Co.,
Machilipatnam - Secunderabad.

*Distributors*

ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237, Rastrapathi Road, Secunderabad-3

**Price : Rs. 10-00**



201

రాజా లక్ష్మి ఫౌండేషనువారు

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి సంస్మరణార్థం

ఏర్పరచిన పోటీలో బహుమతి నొందిన పుస్తకం

# సమర్పణ

మా గురుదేవుల
చిరాకుల్నీ పరాకుల్నీ భరించి
ఆపరేషను అనంతరం మూగవోయిన
ఆయన అవసరాలన్నీ గ్రహించి సేవించి
ఆయన కవితా హృదయాన్ని ప్రేమతో సాకి
సహ ధర్మచారిణిగా
మా త్రీభవించిన సహానంగా
విలసిల్లిన సాధ్వీమతల్లి
మాతృశ్రీ రాజహంసగార్కి

—సోమసుందర్

# మొదటి ప్రకరణము

## తూర్పు బల బల తెల్లవారెను

19వ శతాబ్దపు ద్వితీయార్థం భారతదేశ చరిత్రలో సర్వతోముఖ జాగృతికి తొలి జేగంటలు మోగించింది. 1848లో అవతరించిన మన కందుకూరి వీరేశలింగం భారతజాతి ఎత్తిన నవీన యుగోదయ పతాకలలో ఒకరుగా పరిణామం చెందిన ద్వితీయార్థంలోనే; సిపాయిల తిరుగుబాటు, ఝాన్సీలక్ష్మి, తాంతియాతోపే వంటి స్వాతంత్ర్యవీరుల ఉజ్జ్వల చరిత్రతో ఈ ద్వితీయార్థం కాంతివంతమైంది. రాజారామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, వివేకానంద, రామకృష్ణపరమహంసలు, దయానంద సరస్వతి, బాలగంగాధర తిలక్, రవీంద్రనాథ్ టాగూరు, గురజాడ అప్పారావు, సుబ్రహ్మణ్యభారతి మున్నగువారి జననం భారతజాతి పునరుజ్జీవన కాంతికి మరింత ప్రచండతనీ ప్రజ్వలతనీ కలిగించింది

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ ఏలుబడి సజావుగా సాగడంకోసమే భారత జాతిపై మోపిన ఆంగ్ల విద్యావిధానం 19వ శతాబ్దపు ద్వితీయార్థం నాటికి జాతి జాగృతికి దోహదం చేసింది. ఆంగ్లభాషద్వారా ప్రపంచగమనాన్ని తెలుసుకోగలిగింది తద్వారా స్వాతంత్రేచ్ఛా చైతన్యంతోపాటు, సాంఘిక సాహిత్యపరంగా మన జాతి ఎలాంటి అధ్వాన్న స్థితిలో ఉన్నదీ మన మేధావివర్గం గ్రహించగలిగింది. ఈ బాహ్య వ్యక్తికతా చైతన్యం అంతఃస్ఫూర్తికి దోహదం చేసి, ఆంగ్ల భాషాద్వారంనుంచి సకలదేశాల స్థితిగతుల్నీ, చారిత్రక పరిణామాలనూ గ్రహించి మన మేధావివర్గం స్వజాతి సముద్ధరణకోసం నడుములు బిగించింది. ఈ చైతన్యమే జాతీయ పునరుజ్జీవనానికి ఆవిష్కారకమైంది.

19వ శతాబ్ది పూర్వార్థంవరకూ గతానుగతికత్వం మన సాహిత్యాన్ని విడువలేదు. ఆనుపూర్వికత సర్వజనామోదకర సంప్రదాయంగా శిరోధార్యమైంది. సాహితీ సంవిధానాలనూ తీరుతెన్నులనూ వర్తమాన అవసరాలకన్న సంప్రదాయ

భారమే తీర్చిదిద్దేది. ప్రప్రథమ స్వాతంత్ర్య పోరాటం బ్రిటిష్ ప్రభువుల నిరంకుశత్వానికి పీగి, అపజయం పొందినప్పటికీ భారతీయుల హృదయంలో నవీన చైతన్యాన్ని ప్రోదిచేయడంలో సర్వంకష విజయాన్నే సాధించింది. స్వేచ్ఛాపిపాసతో పాటు సాంఘిక పునర్నిర్మాణానికి సైతం పూనుకోక తప్పదన్న వాస్తవం అవగతం కానారంభించింది నవీనయోచనా మార్గాల ఆవిష్కరణ సర్వమేధా రంగాలలోనూ మానవ ప్రభావ పరిధిని విస్తరించనారంభించింది. ముఖ్యంగా మనోజన్యాలయిన కల్పనాకళలపై ఈ ప్రభావం మరింత విస్పష్టంకాజొచ్చింది.

లలితకళలకు వ్యక్తికిష్టమైన ప్రతిభ ముఖ్యం. ప్రతిభ నవనవోన్మేషశాలి. కనక, తరంనుంచి తరానికీ, వ్యక్తినుంచి వ్యక్తికీ నవ్యతా ముద్రకోసం అన్వేషించడమే ప్రాణభూతం నవ్యతకోసం అన్వేషించడం జీవలక్షణమే కాని అన్యం కాదు ఈ చైతన్యం సర్వత్రా మేధావివర్గంలోనూ, సృజనాత్మక రచయితలలోనూ గాఢంగా పాదుకొంది ఇదే చైతన్యం: ప్రధమశః వీరేశలింగం సాహిత్య సృజనకు దోహదం చేసింది. తెలుగు భాషలో లేని అసంఖ్యాక సాహితీప్రక్రియలను ఆయన ప్రారంభించి, సాహిత్యాన్ని-సామాజికుల జీవనవిధానాలను సంస్కరించడానికీ, తీర్చిదిద్దడానికీ ప్రబల ఆయుధంగా మొదటిసారిగా గుర్తించారు. సాహిత్యంద్వారా హృదయాన్ని పరివర్తనం చేయగలిగే ఉత్తమోపదేశాన్ని అందించడమే ప్రధాన ధ్యేయంగా ఆయన విశ్వసించారు. శుష్కప్రచారంద్వారా కలిగే ఫలితం తాత్కాలికమేనన్న స్పృహకూడా వారికి లేకపోలేదు. ఈ సర్వ కారణాలవల్లనూ ఆయన సాంఘికంగానే గాక, సాహిత్యపరంగా కూడ యుగపురుషుడయ్యాడు

లలితకళలనూ సాహిత్యాన్నీ అనుభవించేవారు సహృదయులూ రసికులూను. ప్రతిభ కేవలం వ్యక్తిపరమే అయినా, సామాజికుల అభిరుచి ప్రభావం కళాకారునిపై ప్రసరించదనుకోవడం సత్యసమ్మతం కాదు ప్రతిభావంతుడూ సామాజికుడే కావడంవల్ల—ప్రతిభావంతుడు కూడ సమాజంతో అవినాభావ సంబంధాన్ని భజిస్తూనే అభివృద్ధి చెందుతాడు. ఎంత గొప్ప ప్రతిభావంతుడైనా ఒంటిస్తంభపు దంతాలమేడలో కూర్చుని తపస్సుచేస్తే ప్రతిభను ఆవిష్కరించుకోలేడు. కళాకారుడు దృష్ట ద్రష్ట అంటేనే ఋషి అనిఅర్థంలేదు కనుకనే కళాకారుడు, రచయితా లోకవృత్తాన్ని దర్శించి అవగాహన చేసుకోక తప్పదు. లోకంలో ఉన్నవీ, కావలసినవీ గ్రహించకపోతే వెనుకమాపుతో మళ్ళిపోతాడు. ఈ చైతన్యం వీరేశలింగం తన సాహిత్య జీవితంపై ఆవిష్కరించుకొన్నాడు.

19వ శతాబ్దపు ఉత్తరార్థంలో కన్నులెత్తిన భారతీయ మేధావులందరిపైనా యూరోపియన్ చరిత్రలో సాగిన పారిశ్రామిక విప్లవం ప్రభావం కలిగించింది. వాల్టేర్ రూసోలు ఋషిసత్తములై యూరోపియన్ జాతులలో నెలకొల్పిన స్వేచ్ఛ సమానత్వం, సహోదరత్వ సదాశయాలు భారతీయ మేధావుల హృదయాలను

పులకింపచేశాయి. పారిశ్రామిక విప్లవానికి హార్దిక ప్రతిబింబంగా ప్రస్ఫుటమైన రొమాంటిక్ రివైవల్ ఉద్యమస్ఫూర్తి మన రచయితలను కవులనూ కదిలించ నారంభించింది. దీనితోపాటు సంప్రదాయాలను ప్రశ్నించే స్వేచ్ఛ, గతానుగతికత్వాన్ని అడ్డుకోగల మానసిక దారుఢ్యమూ, హేతువాద దర్శనమూ మనమేధావులకు త్రిగుణాలుగా దోహదం చేశాయి.

నిత్యజీవితంలో వైజ్ఞానిక శాస్త్రం ప్రాధాన్యత వహించనారంభించింది. మూఢవిశ్వాసాల స్థానే సమాజంలో హేతువాద దృష్టి పెంపొందుతూ వచ్చింది. శాస్త్రీయ సిద్ధాంతాలకూ మూఢవిశ్వాసాలకూ మధ్య పెచ్చరిల్లిన ఘర్షణా స్వరూపాన్ని వీరేశలింగం జీవితమంతటా దర్శించగలం. కేవలం సాక్షీభూతులుగా ఉండిపోదలచిన నిర్లిప్తులలో సైతం ఈ సంఘర్షణ నూతనాభిరుచులకూ, చైతన్యానికీ భూమికలను సంసిద్ధం చేసింది. ఈ సమాయత్త భూమిక వ్యక్తి ప్రతిభాప్రోక్తమైన సృజనాత్మక శక్తులకు ప్రేరణ కలిగించింది. 19వ శతాబ్దపు చిట్టచివరి దశాబ్దం వచ్చేసరికి ఈ ప్రేరణ ప్రబలమై కల్లోలంగా రూపొందింది. కళాత్మక హృదయం ప్రయోగశాలగా మారిపోయింది. సంప్రదాయక కళామార్గాలకు స్వస్తి చెప్పింది. నూత్న స్వరూప స్వభావాలను సంతరించుకుంది. అపూర్వ సంవిధానాలను అన్వేషించి స్వాధీనపరచుకొంది. ఈ ప్రయోగాల ఆవిష్కరణ తరువష్ప న్యాయంగా సహజంగా జరిగింది.

ఈ నవ్యత్వానికంతటికీ ప్రబల ప్రతినిధిగా గురజాడ అప్పారావుగారు దర్శనమిస్తారు. సాహిత్యాన్ని సంఘ సంస్కరణకోసం ప్రబల ఆయుధంగా రూపొందించాలని ఎంత తహతహలాడినా వీరేశలింగం పూర్తిగా సంప్రదాయ శృంఖలాలను భేదించలేకపోయాడు. సంఘ సంస్కరణోద్యమపు తొందరలకిచ్చిన ప్రాముఖ్యత సాహిత్యంలో కళాసంపదను వెలార్చడానికి యివ్వలేకపోయాడు. ఆంగ్లభాషా పరిభావంతో తెలుగులోలేని సకల ప్రక్రియా విశేషాలనూ నెలకొల్పాలన్న ఆరాటమే తప్ప కళామయ స్వరూపాలుగా తీర్చిదిద్దాలన్న ధ్యాన విరతీ, సావకాశమూ ఆయనకు లేకపోయాయి. ప్రహసనాలలో నీచపాత్రలకు గ్రామ్యం ప్రయోగింపవచ్చు ననేటంత వరకే ఎదిగివచ్చిన ఆయన హృదయం సంఘంలోని మధ్యతరగతి పాత్రలు సైతం నిజ జీవితంలో ప్రయోగించని కృతక గ్రాంథిక స్వరూపాన్నే నిక్షిప్తం చేశారు. దీనివల్ల వారి రచనలకు సామాజిక వాస్తవికతా ప్రతిబింబాలుగా గౌరవం కలగకపోగా, సజీవ కళామయ సాహిత్యంగానైనా పూజ్యత లభించలేదు.

వీరేశలింగంగారి ప్రహసనాలు ఏఏ రీతులుగా అపజయం పాల్పడ్డాయో సంపూర్ణంగా గ్రహించిన గురజాడ అప్పారావు ఆ అపజయాలను సోపానాలుగా నిర్మించుకొని, నూత్న శిఖరాలకెగబ్రాకడానికి ప్రయత్నించారు. సంవిధానంతోనూ

అభివ్యక్తిలోనూ నూత్న పథాలను నిశితంగా అన్వేషించారు. సాంప్రదాయికంగా స్థిరపడివున్న సకల అభివ్యక్తి రీతులూ విస్పష్టంగా సమాలోచించబడ్డాయి. వినూత్న మార్గాలను ఆవిష్కరించుకొందుకు ఆయనలో ఆసక్తి మెండైవుంది. ప్రజలదైన నిత్య వ్యావహారిక భాషలో నిత్యం కొత్తరేకులు విప్పారుచుంటున్న సజీవ భాషను హృదయపూర్వకంగా పరిగ్రహించాలన్న స్థిరసంకల్పం ఆయనలో పెంపొంది వుంది. ఆ దశాబ్దంలో సామాజిక హృదయంలో జరుగుతున్న అన్వేషణ గురజాడ వ్యక్తి ప్రతిభద్వారా ఆవిష్కృతమైంది. అనాటికే ప్రజా హృదయ రంగస్థలిలో పాతపద్ధతుల పట్ల విముఖత ఏర్పడి వుంది మౌనంగానైనా తూష్ణీ భావం పెరిగింది అభిరుచులలో మార్పు దందడించ నారంభించింది. రసికతా, కళాస్రష్ట అనేవి రెండు పరస్పర విరుద్ధశక్తులు కావు కనక, ముందుచూపు గల మేధావులందరికీ రచయిత ప్రతినిధిగా నిలవడం తప్పనిసరి విశాల సామాజిక హృదయమూ ఆనందగజపతి మహారాజావంటి రసికావతంసుని ప్రేరణా కళా కారునిగా గురజాడ నూత్న మార్గాన్వేషణకు ప్రేరకులుగా నిలచాయి 1897 నవంబరులో కన్యాశుల్కం ప్రథమ స్వరూపం పూర్తిగా రూపు దిద్దుకొని ఆవిష్కృతమైంది. సరిగ్గా అదే నెలలోనే ఇరవయో శతాబ్దికే కలికితురాయిగా రూపొందగల ఒక శిశువు అవతరించాడు. ఆ శిశువే దేవులపల్లి వెంకట కృష్ణ శాస్త్రిగా నామకరణం చేయబడ్డాడు. తదుపరి కాలంలో తెలుగు కవిత్వాన్నే తన (కృష్ణ) పక్షంగా మలచుకొన్న కృష్ణశాస్త్రిగా ప్రకాశించాడు।

## శ్రీ కృష్ణ సాక్షాత్కారం

శ్రీకృష్ణ శాస్త్రి తొలికవితా సంపుటి కృష్ణపక్షం 1925లో వెలువడింది. కాని అప్పటికి ఐదారేళ్ళుగా కవిగా, అత్యంత విశిష్ట నవకవిగా కృష్ణశాస్త్రి కీర్తి సర్వత్రా వ్యాపించే వుంది కాకినాడలో బి ఎ చదువుతున్ననాటికే ఆయన మంచి కవిగా యౌవనారంభం నుంచి పేరు తెచ్చుకున్నారు. విజయనగరంలో బి. ఎ చదువుతున్న కాలానికి ఆయన హృదయం కృష్ణిద్ర ప్రయోగశాలగా మారి పోయింది. అపూర్వమూ ఓజస్వంతమూ అగు కవిత్వాన్ని వెలయించే ప్రయత్నం సాగిస్తూనే ఉన్నారు. బి. ఎ. పూర్తి అయ్యేనాటికి సంఘ్యాత్మక బ్రాహ్మ సమాజ ప్రార్థనా గీతాలలో విశిష్ట మార్దవత ప్రదర్శిస్తున్న కృష్ణశాస్త్రి గురుదేవుల దృష్టిలో కవిగా ప్రకాశించారు. రఘుపతివారు కృష్ణశాస్త్రి కవిత్వం గురించి తనతో ముచ్చటించిన అంశాలు స్వామి శివశంకరులు ఒక వ్యాసంలో వివరించారు ఏదో ప్రస్తావన వశంగా—"శాస్త్రి అంత గొప్ప కవిత్వం రాస్తున్నాడా? ఐతే గ్రంథం ప్రచురించకూడదా" అని బ్రహ్మర్షి స్వామి శివశంకరులనడిగారు. దానిపై అతని దగ్గర డబ్బులేదట అని వీరి జవాబు అచ్చుకు యిచ్చి ఆ బిల్లులు

నాకు పంపమని బ్రహ్మర్షి కోరారు. చివరికి కృష్ణశాస్త్రి స్వయంగానే ప్రచురించారు. అప్పటికే ఆయన పాటలు బ్రహ్మభక్తులలో గొప్ప ప్రతిష్ఠ పొంది ఉన్నాయి. వేంకట పార్వతీశ్వర కవుల అత్యంత మనోహర కావ్యం 'ఏకాంత సేవ'కు కృష్ణశాస్త్రి తెలుగు పీఠికరాయడానికి ఒప్పిక వేయబడటానికి కారణం కేవలం గురుపుత్రులన్న గౌరవంతోనే కాదు. అప్పటికే కొత్త కవిత్వాన్ని వెలయిస్తూ, దానికి తాత్త్విక భూమికలను స్థాపిస్తూ దాదాపు నవ్యకవితా ప్రవక్తగా స్థిరపడుతూండటమే ప్రధాన కారణం

అలా ప్రారంభమైన కృష్ణ కోకిలాసంకగానం ఇంతింతై వటు డింతయై ఆంధ్ర రసహృదయాంబోవీధి ఆక్రమించిన కృష్ణశాస్త్రి మూడవ దశాబ్ది పూర్తి కాకముందే 'ప్రవాసము' 'ఊర్వశి' ప్రచురించారు. కృష్ణ పక్షంపై వాదోపవాదాలు తర్జన భర్జనలు చెలరేగాయి తర్వాత కాలంలో 'కార్తీకి, మహతి, కన్నీరు' వంటి లఘు గ్రంథాలూ ప్రచురితమయ్యాయి అంతే తప్ప బృహద్గ్రంథ సంచయం అముద్రితంగానే ఉండిపోయింది రేడియో కోసం అత్యంత మనోహర నాటికలెన్నో రాశారు, ప్రసంగాలెన్నో చేశారు, అవన్నీ ఎన్నో గ్రంథాలుగా రావలసింది. 1960లలో కావలి విశ్వోదయ సంస్థవారు పూనుకొని కృష్ణశాస్త్రి, వచన రచనలు మూడు సంపుటాలుగా ప్రచురించేవరకు కృష్ణ పక్షం-ప్రవాసం-ఊర్వశి కావ్యాలు ఒకే సంపుటిగా రాజమండ్రిలోని రౌతు చంద్రయ్య కంపెనీ అనేక ముద్రణలు వేసుకొని అమ్ముకుంటున్నదే తప్ప కొత్త పుస్తకం రానేలేదు. విశ్వోదయ సంస్థ అప్పుడు బ్రతికివుంటే "బహుకాల దర్శనం" "పుష్పలావికలు" అనే మూడు వచన రచనలను రేడియోలకోసం చేసిన ప్రసంగాలను ప్రచురించి ఎంతో మేలు చేసింది. ఈ సంపుటాలవల్ల అశేషాంధ్ర ప్రజానీకానికి కవిగానేకాక, వచన రచయితగా కూడా కృష్ణశాస్త్రి ఎంత విశిష్టులో తెలియడానికి అవకాశమేర్పడినది. అంతేకాక కథానికకు ప్రాణతుల్యమైన సంఘటన నిర్మాణము, పాత్రల శీల పరిశీలనమూ మున్నగు సాంకేతిక విషయాలపట్ల సైతం కృష్ణశాస్త్రి, ఎంత నిపుణులో బహుజనులకు అవగతమైంది. ఆయన గొంతు శ్రోతలలో ఆధునిక కవితాగానం సజీవ స్రవంతిగా మారిపోయింది. ఆయన మహోపన్యాసాలలో తెలుగు కవిత్వం నవ్యచైతన్యాన్ని సంతరించుకుంది. ఐతే ఆ శక్తులే సరిపోతాయా? కవి తన కవితా గ్రంథ పరంపరను ప్రదర్శించవలసిన అవసరమూ ఉంది. గుణంతో పాటు ద్రవ్యాత్మకాభివృద్ధిని ప్రదర్శించాలి. 1963లో తెలుగు కవిత్వ చరిత్రలో ఒక దురదృష్ట సంఘటన జరిగింది. అది కృష్ణశాస్త్రి గొంతులో కేన్సర్ రావడం— దానికి బొంబాయిలో ఆపరేషన్ చేసి స్వర పేటికను తొలగించడమూ. అపురూపమైన అదృష్టమేమంటే కృష్ణశాస్త్రి మరో 18 సంవత్సరాల ఆయుః ప్రమాణంతో రస స్రవంతికల నోలలాడించడమే. ఇది యెంతో అరుదుగా లభించే సన్నివేశం. 1975లో కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవం వైభవంగా జరిగింది. వారి సాహిత్యంలో

మరో 6 గ్రంథాలు ప్రచురితమయ్యాయి. అది శ్రీ పి. రమణయ్యరాజా ఉత్సాహపూరిత కృషి ఫలితమే. కృష్ణశాస్త్రి సన్మాన సంఘం ఏర్పాటై ఆరు స్వర్ణోత్సవ సంపుటాలతో వెలువడ్డాయి. అవి. కృష్ణ పక్షము, ప్రవాసము-ఊర్వశితో సహా) పల్లకి, శర్మిష్ఠ, ధనుర్దాసు, తిరుప్పావై, మేఘమాల అనేవి. అంటే కృష్ణశాస్త్రి గ్రంథాలు 12 వరకూ పరిశీలనార్హమై ఉన్నాయన్నది ఒక అదృష్టమే. ఈ స్వర్ణోత్సవం నిజంగా పరిశీలిస్తే కృష్ణశాస్త్రికి వ్యక్తిగతంగా జరుపబడిన వైభవం కాదు యావదాంధ్రజాతికీ లభించిన ఒక హార్దిక తేజోరేఖకు జరుపబడిన ఉత్సవం. ఒక లలిత భావరస మయూఖకు జరుపబడిన సంభావనోత్సవం ఆ ఉత్సవమే కృష్ణశాస్త్రి కవిత్వాన్ని అజరామరంగా విస్తృత పరిచింది.

శ్రీ కృష్ణశాస్త్రి కవితా విశ్వరూప సాక్షాత్కారాన్ని స్థూలంగా అభివర్ణించా లంటే నిజంగా పైన తెల్పిన విషయం సరిపోదు. ఆయన కవిత్వ వైశిష్ట్యాన్ని వివరించడానికే ఈ గ్రంథమంతా కేంద్రీకృతమైనపుడు యిక్కడ ఆ మాత్రం రేఖాచిత్రంతో సంతృప్తి పడకనూ తప్పదు. "నేను సోమరిని, బద్ధకస్థుణ్ణి" అని పదే పదే ఆయన చెప్పుకోవడం, నిజానికి సహస్ర మాస జీవిగా మన మధ్య ఉన్న ఆ అయస్కాంత గిరీంద్రం నిత్యమూ నిర్నిద్రంగా కవితా భావుకత్వంలోనే కాలం గడిపేవారని, సాహిత్య గోష్ఠి నిమగ్నులేనని సన్నిహితులందరికీ తెలుసు. కనక కృష్ణశాస్త్రి సాహిత్యం అంటే ఆయన జీవితంలో ప్రతి గంటా, మన పరిగణనలోనికి తీసుకోవలసిన అవసరం ఉంటుంది. అంత నిర్మాణయుత జీవితం వారిది.

## "జీవితం స్థాణువు కాదు"

"జీవితం కుర్చీలాగో, గుమ్మడికాయలాగో, స్థాణువులా పడివుండదు." అన్నవాడు కృష్ణశాస్త్రి. మానసికంగా కూడ స్థాణుసదృశ్యమైతే జడమయమై పోతుంది. కళాకారుడు కేవల సంప్రదాయవాదే అయితే నూత్న మార్గాన్వేషణకై విముఖుడై పోతాడు. నడవగా నడవగా పాత గిల్లిన తుప్పు ధూళి, బిళ్ళపోయిన, పనికిరాని పాతదారులు పట్టుకొని గుడ్డిగా నడిచిపోతాడు. అలాంటి వానిని సామాజిక హృదయం ఏదో ఒకనాడు నిర్మోహమాటంగా తిరస్కరిస్తుంది. లేదా కళల పట్లనే ఉదాసీన వైఖరి అవలంబిస్తుంది.

సరిగ్గా ఈ పరిస్థితి గత శతాబ్ది చివరికి తెలుగుసాహిత్యచరిత్రకు పట్టింది. తంజావూరు నాయక ప్రభువుల కాలం తర్వాత రాయబడిన ప్రబంధాలెన్నో, కుక్కచావు చచ్చాయి. దాక్షిణాత్య సాహిత్యంలోనే శృంగారానికి విపరీత ప్రాధా

న్యం లభించింది. వీర పురుషావతారంగా ప్రతి శృంగారనాయకుడూ చిత్రింప బడుతూ ప్రజా జీవనస్ఫురణం దూరమైంది. ప్రజాసాహిత్య స్వరూపాలైన యక్ష గానాది గేయ ఫణితులాదరింపబడ్డాయన్న ఒక్కకితాబుతోనే ఆనాటి సాహిత్యం ఆరోగ్యంగా బ్రతకడానికి అవకాశం లేదు. అందువల్లనే వీరేశలింగంగారు తన కవుల చరిత్రలో ఆ దశను అంధయుగంగా పేర్కొనవలసివచ్చింది.

ఈ వాస్తవిక జ్ఞానంతో ప్రతిభావంతులైన కవులు సాంప్రదాయిక పద్ధతు లను నిష్కర్షగా తిరస్కరించ పూనుకుంటున్నారు నూతన సంవిధాన పద్ధతులను విశితంగా పరిశీలనం చేసుకొంటున్నారు. అన్వేషణా వైవిధ్యంతో కొత్త విర్దేశా లను (AIMS) స్వాధీనం చేసుకోబోతున్నారు.

సంగ్రా ఈ దశలోనే విశాల మానవజీవిత జటిలమైన సమస్యల బాహు ళ్యాన్ని అవగతం చేసుకుంటున్నారు కవులు. ఈ నవీన మార్గానికి వీరేశలింగమే మార్గోపదేష్ట మేధావులంగీకరించారు. సామాజిక సమస్యలను ప్రతిస్పందించ డమే కాక పరిష్కార మార్గాలను ప్రేరేపించడం కూడా తమ పూచీయేనని కళా కారులు విశ్వసించుకుంటున్నారు. ఐతే సమస్యలనేవి రెండు రకాలు. భౌతిక జీవన స్థాయిని కళవరపరచేవి కొన్ని; ఇవి స్థూలదృష్టికి పైకే ఆనిగడవు. మాన సిక అంతస్థలాన్ని కళవరపరచేవి రెండవరకపు సమస్యలు ఇవి బాహ్య దృష్టికి కనిపించవు. కళాకారుని నిశితదృష్టికి మాత్రమే దర్శనమిస్తాయి వీటినే మనం వాస్తవ సమస్యలనీ, ఆంతరిక సమస్యలనీ, విభాగించుకోవచ్చు బాహ్యసమస్యల పరిష్కారమార్గాన్ని ఉపదేశించే కళలు ఉపయోగాత్మక కళలని పిలుస్తాయి. వీరేశలింగం గారి ప్రహసనాలు ఋట్టివే ఉత్తమోపదేశాన్ని ధ్వనింపచేసే కళలు సజీవమైనవి. గురజాడ కన్యాశుల్కం యిలాంటిదే. కేవలం మనోగత సమస్య లలో కూడ మళ్ళీ రెండు రకాలున్నాయి. ఒకటి వ్యక్తి నిష్ఠాలైనవి రెండు సార్వ జనీనమైనవి వ్యక్తి నిష్ఠాలైన మనోగత సమస్యల విచికిత్సకు ప్రాధాన్యమిచ్చే కళలను విరంజన కళలు (PURE ARTS) అంటున్నారు.

కన్యాశుల్కం ఆవిర్భావంగాని, కృష్ణశాస్త్రి అవతరణం గాని ఒక సుదీర్ఘ కాలావధికి భరత వాక్యంగా తనరారింది. ఇరవయ్యో శతాబ్దికి. అమేయ పురోగ మనానికి స్వాగత పత్రమైంది. ఇరవయ్యో శతాబ్ది ప్రథమ పాదంనుంచీ తెలుగు కవిత్వంలో అంకురించిన ప్రబలమైన మార్పులకు కూకటి వేళ్లు కన్యాశుల్కం నాటి పరిస్థితులలోనే దాచ్చుకుని ఉన్నాయి. ఈ మార్పులు వస్తుగతమైనవీ రీతిగత మైనవీ కూడా। అవి అతి వేగంగానే గుర్తింపబడుతూవచ్చాయి, అన్నంత మాత్రంలో సంప్రదాయమార్గమే పరమ పదమని విశ్వసించిన వారులేనే లేరని అర్థంకాదు గతానుగతిక రీతులనారాధించేవారిపై జాతి పురోగతి ఆధారపడదనేః విగతజీవుల పురాణగత పాత్రలకు మళ్ళీ మళ్ళీ ప్రాణ ప్రతిష్ఠచేసేవారి ప్రధానం

సమాజ జీవనంలో అంతర్లీనం కానేరదు. సనాతన పథాల ద్వారా సాధించవలసిన ఘనతర శోభలెన్నో కలవని, వారెంత గాఢంగా విశ్వసించి తంటాలు పడినా కాలం వారి పట్టునుంచి విడిపించుకొని ముందుకు పోతుంది. ఐనా కాలం కలిగించే మార్పును అంత తేలికగా వారు గుర్తించలేరు.

ఆరంభంనుంచీ ఈ శతాబ్దంలో వీచిన ప్రతివాతూల తరంగాలలోనూ భావ విప్లవం గుస్తరిస్తూనేవుంది. దాని ప్రభావం కవిత్వాన హృదయ జన్యాలైన కళలపై బలంగా తాలూనుతూనేవుం. ఈ యుగీన కవితా కంఠానికి అపూర్వ చైతన్యాన్ని ప్రసాదించింది దానితో అనుపూర్విక అభివ్యక్తి సాధనాలను విసర్జించక తప్పలేదు. ఈ విసర్జన ఒక్క మన తెలుగు సాహిత్యానికి మాత్రమే నైసర్గికమైంది కాదు. ఈ యుగధర్మమే యిదని భారతీయ సాహిత్యమంతా ధ్రువ పరుస్తూనేవుంది. ఎవం విధంగా సాధించబడిన నూత్న సంవిధానాలు సామాజిక హృదయంలో నూత్న ఓజస్సును ప్రోదిచేశాయి. ఖివ్యక్తి సాధనాలలో సంతరించిన నూత్న తేజం జన బాహుళ్యాన్ని ఆకర్షించింది. జన బాహుళ్యం నుండి కొత్త కవులావిర్భవించారు. శక్తివంతంగా కొత్తనీరు ఎక్కిరానారంభించిం జనహృదయం యుగపై లక్షణ్యంతో సంసిద్ధమై ఉండడమే ప్రధాన కారణం.

ఈ శతాబ్ద ఆరంభంలో యించుమించు ఒకేదశాంతరంలో, ఒకప్రదేశంలో భోగరాజు నారాయణమూర్తిగారు, గురజాడ అప్పారావుగారూ కవితా కంఠాల నెత్తాయి. ఈ యిరువురి కవులలోనూ, మొదటి వారిలో సంప్రదాయ భీరుత్వమూ, రెండవ వారిలో నూతనోత్తేజపు ప్రయోగ శాలిత్వమూ పదనువారాయి. ఆ వైరుధ్యమే వారి వారి ప్రాధాన్యతను విస్పష్టరేఖలు తీర్చింది.

భాషాపరంగా విప్లవానికీ, సంవిధాన స్వరూపంలో విప్లవానికీ తూరుపు దిశలో వెలిసిన మహాపురుషులు గిడుగు రామమూర్తిగా, గురజాడ అప్పారావుగా లక్ష్య లక్షణ సమన్వయ స్ఫూర్తిగా దర్శనమిచ్చింది.

19వ శతాబ్ది నుంచి చైతన్య విస్ఫూర్తి రూపు తొడిగిన 20వ శతాబ్దికి మార్పుపొందుతున్న తొలి కాలంలో "కన్యాశుల్కం" బాల్యం నుంచీ ప్రౌఢత్వాన్ని సముపార్జించుకొన్నది. కృష్ణశాస్త్రి, బాబయ్యగారి భుజమెక్కి చంద్రపాలెం నుంచి పిఠాపురం సంస్థాన సభకు వస్తున్న కాలి దారిలో అమరకోశాన్నీ, శబ్దమంజరిని, బాలరామాయణాన్నీ చిరుతకూకటి తొక్కుపలుకులతో కంఠస్థం చేస్తున్నారు. ఈ తొలి దశాబ్దమే ఆంధ్రసాహిత్యంలో ఆగామి వర్షాలలో బహుముఖ పరిణామక్రమాన్ని స్థాపించుకుందుకు అయత్నమవుతోంది. తెలుగు కవిత్వంలో ఈ మార్పు ప్రథమశః రూపురేఖలు వెలార్చుకుంది; 1902 నుంచి ఖండ కావ్యాల లఘు పరిమితిలో బాహ్య వాస్తవికతకు ప్రతిబింబ ప్రాయంగా ఇతివృత్తం

స్వీకృతమైంది. శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు తమ కావ్య కుసుమావళి రచన ప్రారంభించారు. ఆంధ్ర సాహితీ రంగంలో అంతవరకూ మార్గదేశీ రీతుల మధ్య వైరుధ్యం అఖాతంలా నోరు తెరచుకునే వుంది. ఆ అగడ్తను పూడ్చడానికే తనది ప్రజల ఉద్యమ మన్న చైతన్యంగల మనిషి కోసం సాహిత్యం ఎదురు చూస్తున్నది దానికై స్థిరీభూతంగా వున్న సనాతన మార్గాలను సడలించవలసి వుంది ఈ పనికోసమే పుట్టిన గురజాడ అప్పారావు జాతీయ పునరుజ్జీవన మహోద్యమానికి సాహిత్యపరంగా తొలి సోపానం సమర్పించారు మార్పుపొందుతున్న జీవితానికి కళలు దర్పణం పట్టాలనీ నూతన యుగానికి పనికిరాకుండా పోయిన పాత ఆచారాలను తొలగించివేయాలనీ, ఈ పనికే తాను అవతరించాననీ గురజాడకు సంపూర్ణ చైతన్యముంది. ఈ కారణజన్ముడు 19వ శతాబ్ది చివరి దశాబ్ది నుంచి, ఆ మరణాంతం 1915 నవీన ఉదాహరణ ప్రాయాలగు కావ్యరూపాలను సృజిస్తూనే ఉన్నారు

ఎక్కడో సకృత్తుగా నవయుగీన కంఠాన్ని పీలగా గురజాడ వంటి ఒకరో యిద్దరో వినిపిస్తున్నా ప్రబలంగా సంప్రదాయ జాడ్యమే రాజ్యమేలుతోంది. శ్రీనాథుని కాలం నుంచి శేషం వెంకట కవి వరకూ మూసకట్టుగా ప్రబంధ స్వరూపమే ప్రధాన కావ్యాభివ్యక్తి స్వరూపమై ఏలుబడి చేస్తోంది. ఫ్యూడల్ సమాజ కావ్య కళా ప్రతిబింబంగా ఉద్భవించిన ప్రబంధం చరమ స్వరూపంగా భావింపబడింది. మరీ అనుకరణ ప్రాయాలైన ప్రబంధాలను కాలం గాలికి ఎగర గొట్టి వేస్తుంటేకాని, 'నా విష్ణుః పృథ్వీపతిః' అని విశ్వసించిన లోకం ప్రబంధాన్ని సైతం కిమ్మనకుండా సమాదరించడంలో అబ్బురమేమీలేదు

సుమారు నాలుగు వందల ఏళ్ళలో పొడసూపని పరిణామం—పందొమ్మిదవ శతాబ్ది చివరి దశాబ్దంలో ప్రసవించనారంభించింది. ఈ మార్పు ఇరవయ్యవ శతాబ్ది ప్రథమ దశాబ్దంలో మరింత స్పష్టరూపం పొందింది. ఈ మార్పును సాధించిన యుగపురుషుడు గురజాడ క్రాంత దర్శియే! ఇదే దశలో తిరుపతి వెంకట కవులు తమ శేముషీవైభవంతో ఆంధ్రదేశం నాల్గు చెరగులా అష్టావధాన శతావధాన ప్రదర్శనలతో ఊరూరా ఆశుకవిత్వానికీ తద్వారా సాహిత్యానికీ కవిత్వానికీ విశేష ఆదరణను సముపార్జించారు. సామాన్యుల సంభాషణా స్థాయికి సమాంతరంగా పద్యం విలసిల్లేటట్లు రూపొందించి శ్రోతలకు సద్యః పరనిర్వృతిగా పద్యాలను కంఠస్థం చేయగలిగారు. దానితో జంట కవుల యుగం అశేష విస్ఫూర్తిని పొందింది సాహిత్య రసికత ఎరుగని పల్లె జమీందారీ సంస్థానాలలో సైతం కవితా శారద ఘంటానాదాలను మ్రోగించింది. కవిత్వానికి విశాల భూమికను వీరే సంతరించారు. వీరు కల్గించిన చైతన్యం తదుపరి కాలాలలో సాహితీపరులను ఇవి ఆలోచింపచేసింది

కవితా నిర్మాణంలో అత్యంత ఆధునికతను వెలార్చడమేగాక, త్రిగుణాత్మక నవీన మార్గాను సంధాతగా గురజాడ కవిశేఖరుడు ప్రధమ దర్శనమిచ్చారు. కందుకూరి సాధించిన సాంఘిక పునరుజ్జీవనానికి ఆలోచనాపరంగానూ, కవితా నిర్మాణపరంగానూ ఆధునిక యోవనాధారనందించి సర్వతోముఖం చేశారు.

బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ పరిపాలనా సౌలభ్యం కోసమే ఈ దేశంలో నెలకొల్పిన ఆంగ్ల భాషా విద్యావిధానమూ, యిక్కడి ముడి సరుకును తమ దేశానికి తరలించుకుపోవడానికి వీలుకలిగేటట్లు బేళ్ళ నిర్మాణానికే నియుక్తములైన ఫ్యాక్టరీల నిర్మాణమూ, ఆ సేతుహిమాచల పర్యంతం తమ సైనికశక్తి పాలనావ్యవస్థనూ సులభోపేతం చేయడానికే రైలు దారి నిర్మాణమూ నెలకొల్పి ఈ దేశంలో పారిశ్రామిక విప్లవాన్ని నిశ్శబ్దంగా రూపొందించగలిగారు. దానితో భారతీయమైన వర్ణాశ్రమ ధర్మం ప్రశ్నించబడక తప్పలేదు. గ్రామీణ వ్యవస్థలో కులధర్మాలు పెంపొందించినట్లుకాక నవీన నాగరిక జీవితంలో వర్ణవ్యవస్థ అవసరమూ ప్రభావమూ విస్మరింపబడుతూ వచ్చింది. దీనికి సహాయంగా రాజా రామమోహనరాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్ ప్రభృతులు ప్రచలితంచేసిన నవీన మానవోద్యమం.... బ్రహ్మసమాజంగా సర్వత్రా వరుచుకొంటున్నది.

## నవీన యుగవాణి

ఈ సమస్త చైతన్యానికి ప్రతినిధిగా గురజాడ 1910లో, ముత్యాలసరాలనే తొలి రచన వెలువర్చారు. ఈ కవిత నవీన యుగారంభ కవితా హృదయానికి ఒక మాగ్నాకార్టావంటిది. సమస్త సంస్కరణ దృష్టికీ యిది ప్రాతినిధ్యం వహించింది తెలుగు భాషలో శిథిలమైన పదాలను ఒదిలి, తేటయైన మాటలు కూర్చుకొని ముత్యాలసరాలు కూర్చడానికి పూనుకొంది అంతవరకూ జాతి శాబ్దిక డాంబికత్వాల కొయ్యబొమ్మలనే మెచ్చుకుంటూంది ఇప్పుడు కోమలమైన సొరును కవిత్వంలో ప్రతిపాదించాలి దానికి కారణం మరేమీ లేదు తూర్పు బలబల తెల్లవారింది. తోకచుక్క వేగచుక్కలా సౌరకుటుంబ నభ్యుడిగా వేంచేసింది. ఆకాశంలో చీకటి కదలబారింది. మేలుకొలుపుల కోడి కూసింది. ఉండుండి ఆకులనాడిస్తూ కొత్తగాలి అంతటా ప్రసరిస్తోంది. పట్టణాలలో పదినాళ్ళన్నా సంఘ సంస్కరణ ప్రవీణుల ప్రభావం సోకుతోంది. దేశం నలుమూలలా తోకచుక్క అరిష్టదాయకమనీ, ప్రళయమేదో ముంచుకొస్తున్నదనీ భీతావహపు గగ్గోలు ప్రారంభమైంది. దానిని మహాకవి చైతన్యవిస్ఫూర్తి స్పర్శించకుండా విడువలేదు ధూమకేతువు నామసామ్యమున్నదేగాని కేతువు కాదు. పైగా వేల్పులలనలు తమకేలి వెలితొగను భూవాసులకు అరుదుగా ప్రదర్శించే దృశ్యం! యథార్థ దీని స్వరూపమేదో తెలియని అజ్ఞానులు మూఢవిశ్వాసాలంట కదుతున్నారు. చన్నకాలపు చిన్నబుద్ధులు బెదరి కీడుగా ఎంచుతున్నారు. దానికి

తోడు కవులు తమ కల్పనా చాతుర్యాన్ని ప్రదర్శించటం కోసం చేసిన వర్ణనలన్నీ మూఢాత్ములు వాస్తవాలుగా భ్రమించి భయపడటం అలవరచుకున్నారు. వెర్రి పురాణ గాథలు విజ్ఞానశాస్త్రం వికసించిన ఈ రోజుల్లో నమ్మవచ్చునా? భౌతిక నేత్రం గూడా చూడజాలని వస్తుతత్వాన్ని పాశ్చాత్యులు పరిశోధించి కాంచనేర్పరులయ్యారు. వారి విద్యలకరచి తానూ తనవంటి మేధావులూ సత్య సందర్శనం చేసుకోగలిగారు. ధూమకేతువు భూమికి దూరబంధువే తప్ప శత్రువు కాడు. డబ్బయి ఎనభయి ఏళ్ళ కొకసారి చూడవస్తుంటాడు. తెగుళ్ళూ అరిష్టాలు వంటి వాటికీ తోకచుక్క ఇరవు కాదు. పైగా తానా దానిని సంఘ సంస్కరణ పతాకగా భావిస్తున్నానంటూ జయభేరి మోగిస్తాడు గురజాడ! మంత్రాలు మహిమలు జాతికి బంధించిన గొలుసులయ్యాయి అవన్నీ జారిపోవాలి. జాతి పునః సంపన్మయం కావాలి దానికి ఏది దారి? ఎల్ల లోకములూ ఒక్క యిల్లుగా మానవ సమాజం సమైక్యం కావాలి. సరిహద్దులు లేని ప్రేమబంధం మానవజాతి మనుగడకు దోహదం చేయాలి. విశ్వమానవ కుటుంబ భావన కానాడే ఆ మహాకవి బీజావాపన చేశారు. ఆ దారి తొక్కిననాడు వైజ్ఞానిక యుగంలో నిరుపయోగంగా మిగిలిన మతాలన్నీ మాసిపోయి జ్ఞానమొకటే నిలిచి వెలగాలి. అపుడు అవనిలో అమృత సుఖాలు విలసిల్లతాయి. దీనికి మొదలిమెట్టుగా బరంపురంలో దక్షిణాపథానికే మొట్టమొదటిదైన నానాజాతి సహపంక్తి విందు నేర్పరచారు. పురుషులు విజ్ఞానార్జనతో సాహసోపేతంగా సంస్కరణ భావాలకు ముందంజ వేస్తున్నా సమాజంలో సగభాగమైన స్త్రీలు మాత్రం సంప్రదాయమౌఢ్యంలో ఊగిపోతున్నారు. దానికి ప్రతినిధిగా కవిపత్ని మాటలను రికార్డుచేశారు మహాకవి: మీ పోకిళ్ళన్నీ విని కనుల నిద్దర లేకుండా హడలిపోతున్నాను. తోటికోడళ్ళు దెప్పుతున్నారు ఆడపడుచులు వెక్కిరింపు నవ్వులు జరుపుతున్నారు. అత్తగారా నువ్వు మావాడికి తోడుదొంగవే అంటూ సాధిస్తున్నారు. కలికాలపు మహిమ అని మామగారు కుందుతున్నారు. మీరు చదివిన చదువుల కిదేనా ఫలితం? ఇలా జరుగుతుందని తెలిస్తే పెద్దలీ యింగిలీషు చదువులు చెప్పించి ఉందురా? కోట నేలగలరనుకొని ఈ కోటివిద్యలూ మీకు నేర్పించారు! కాని పొట్టకూటికి నేర్చిన విద్యలు పుట్టకిట్లు కదల్చి వేస్తున్నాయి! చేసుకున్న భార్యను నేనెలా పోయినా ఫరవాలేదు. మీరు సంపాదించిపెట్టి పొయ్యక పోయినా కనిపెంచిన తలిదండ్రుల గౌరవాలనైనా కాపాడనవసరం లేదా మీకు? కలసి మెలసి కూడు కుడిచినంత మాత్రంలో ఐకమత్యం వచ్చేస్తుందా? మాల మాదిగలలో కన్నెనెవతెనైనా మరులుకొనలేకపోతిరా? అని విపరీత కోప ప్రదర్శనం చేసిందా జీవితేశ్వరి!

ఐనా తూర్పు భళ్ళున తెల్లవారక మానలేదు. తోకచుక్క మూఢవిశ్వాసపరులు భావించినట్లుగా ఏ అరిష్టమూ కలిగించకుండానే అదృశ్యమైంది! ఈ మహా

కావ్యాన్ని ముగిస్తూ జాతి హృదయంపై ఒక్క ప్రశ్నను అధిష్ఠింప చేసి సమాప్తం చేశారు. "లోకమందలి మంచిచెడ్డలు లోకులెరుగుదురా?" సహధర్మచారుణుల వంటి లోకులంతా మంచిచెడ్డల విచక్షణ చేయగలిగితే తెలతెలవారిన తూర్పు మహోదయం కాగలదని సూచన.

ఇరవయ్యవ శతాబ్ద ప్రారంభమైన తొలినాళ్ళలోనే వెంకట పార్వతీశ్వర కవులు వంగభాషా సాహిత్యాల ప్రభావంతో ఒకజీవిత సంఘటను యితివృత్తంగ స్వీకరించి లఘుకవితల ఖండ కావ్యాలు వెలార్చుతున్నారు. 1906లో రవీంద్రుని శాంతినికేతన్ విద్యార్థిగా ఉన్న శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు నవీన మానవతా ధర్మాలను నెలకొల్పుతూ, అమలిన శృంగారానికి ఆద్యపీఠి నెలకొల్పుతూ వస్తుపరమైన భావ కవితా శ్రేణికీ తద్వారా కాల్పనిక యుగానికీ అంకురార్పణ చేస్తున్నారు. ఫ్యూడల్ సామాజిక నీతులపైనా, భావనా వ్యవస్థపైనా ప్రబలమైన తిరుగుబాటుగా వచ్చినదే కాల్పనిక వాదం. Romantic revival ఈ చరిత్రక ప్రాధాన్యతను అప్పట్లో అనుయాయుల కన్న తద్వ్యతిరేకులే చక్కగా గ్రహించారు. భావ కవిత్వం కాళ్ళూనుకోగలిగితే తమ భూస్వామ్య వ్యవస్థాజన్యమైన సకల వైదిక సంప్రదాయాలూ మంటకలసిపోతవని గగ్గోలు ప్రారంభించారు. ఈ ఈ యుగవాణిని అరికట్టడానికి ప్రతీప చర్యలు ప్రారంభించారు. ఛాందసులూ తిరోగమన వాదులూ ఏకమై నూత్న కవితా ధారను గేలిచేయ నారంభించారు. నిందించి, ఆపవాదుల బంగరాళ్ళు దొర్లించారు. దీనికి ప్రధమకారణాలు రెండు. కాల్పనిక వాదులూ సంస్కరణ ప్రియులూ స్థిరపడిన కవితా రీతులను Established Styles తృణీకరించారు. ముత్యాలసరాలవే జానపదరీతులందలి గేయ స్వరూపాలను ఆరాధించారు. ప్రాచీన అలంకారికులు చెప్పిన కావ్య లక్షణాలకు భిన్నంగా లఘు కవితలనూ, ముక్తకాలవంటివాటినీ ఖండ కావ్యాలంటున్నారు కులాది సంప్రదాయాలకు బద్ధమైన వివాహవ్యవస్థను, దాని పావిత్ర్యాన్నీ తృణీకరిస్తున్నారు. రెండోది—వ్యక్తి స్వేచ్ఛకు మొదటిసారిగా శిష్టసాహిత్యంలో పాతివిధ్యం కల్పిస్తున్నారు. ప్రయోగశీలతయే నవనవోన్మేషశాలియగు ప్రతిభా లక్షణమని చాటుతున్నారు మతాచార్యుల ఆధికారిక సమాజ వ్యవస్థకు భిన్నంగా ఈ స్వేచ్ఛావాదం ఘోరవిప్లవంగా వారికి కనిపించనారంభించింది. ఈ రెండు కారణాలనూ అనుయాయులకన్న ముందే వ్యతిరేకులు గ్రహించి ప్రతీప చర్యనారంభించారు. తెలుగు కవిత్వంలో కాల్పనిక వాదానికి ఆవిష్కరణ రూపాలుగా వస్త్వాశ్రియకవితారీతులు ఆత్మాశ్రయ కవితారీతులు, తదుపరి కాలంలో రెండు పాయలుగా చీలిపడ్డాయి. వెంకట పార్వతీశ్వర కవులూ, రాయప్రోలు వారూ ప్రాచీన ఛందస్స్వరూపాలలో నూతన రూపాలు గ్రహించి వస్త్వాశ్రిత కవితలు రచించారు. యుగపురుషుడు గురజాడ ప్రథమంగా ప్రజలభాషైన

అనూన గేయ సంపదనుండి మేల్బంతులనెంచి ముత్యాలసరాలు రూపొందించారు. వీరి ఉదాహరణ ప్రాయమైన కవితలలోనే వస్త్వాశ్రయ, ఆత్మాశ్రయ కవిత్వరీతులకు స్థానం కల్పించారు. వీరి మరణం తర్వాత రెండోపాయ అగు ఆత్మాశ్రయ కవితారీతికి బసవరాజు అప్పారావు, కృష్ణశాస్త్రి, నండూరి, ప్రధాన చోదకులయ్యారు. అప్పటికే వేంకట పార్వతీశ్వరుల "ఏకాంత సేవ" రూపొందింది.

## ఛాందసుల ప్రతిచర్య

సనాతనుల ప్రతిఘటన వల్లనూ, ఛాందసుల కుహనా విమర్శల ప్రతిచర్య వల్లనూ, ఈ నూత్న ప్రయోగాలకు సామాజికుల ఆమోదం విస్తృతంగా లభించడంలో కాలయాపన జరిగింది. పైగా అష్టావధానాది కాలమేజా వాణీ మోజు ఒకప్రక్కనింకా ప్రజల ఆకర్షణ కలిగిస్తోంది. ఈ కాలయాపనకు కారణం లేకపోలేదు, ఆంగ్లప్రభుత్వం తన సామ్రాజ్యాన్ని నిల్పుకుందుకు ఉపయోగపడే సంస్థానాధీశుల జమీందారుల ఫ్యూడల్ వ్యవస్థావిధానాన్ని మార్పుకపోగా రక్షించ దానికే పూనుకుంది. ఆంగ్ల విద్యాసంస్కారంవల్లనూ పారిశ్రామిక విప్లవ చైతన్య ప్రాదుర్భావంవల్లనూ క్రాంత దర్శనం కలిగి ప్రయోగవాదులైన కవులకూ ఫ్యూడల్ భావచేతనలో స్థిరపడిన సనాతనులకూ సంఘర్షణతీవ్రమై సాహిత్యపరంగా అభివ్యక్తమైంది. ఈ సంఘర్షణ—చర్య ప్రతిచర్యల మాధ్యమికంగా సాగిన సాహిత్య సమరమే.

సనాతనుల పక్షాన జయంతి రామయ్య పంతులు, కొక్కొండ వెంకటరత్నం, అక్కిరాజు ఉమాకాంతం, కాశీభట్ల సోదరులూ, అనంతపంతులవంటివారు ధృఢవాణి ప్రసరించారు. ఈ సంఘర్షణ ప్రజాహృదయాన్ని ఆకర్షించింది. నూత్న ప్రయోగాల పట్ల వ్యతిరేఖ వైఖరిగా సామాజికామోదం పొంది సంఘటితం కాలేకపోయింది. ఈ ప్రతీపచర్యలవల్ల అభివృద్ధికి విలంబమే జరిగింది తప్ప విరోధం ఏర్పడలేదు. పరిణామం మందకొడిగా సాగవలసివచ్చింది. అంతే!

తెలుగు కవిత్వంలో పొరవిప్పుకుంటున్న ఈ నూత్న ప్రయోగాలు సహజంగా ఆంగ్ల విద్యా భూషణులను ముందుగా ఆకర్షించాయి. తద్వారా యీ దేశపు మట్టిలోనికి లోతుగా వేళ్ళను పారించనారంభించాయి. బహుముఖమైన ఈ నూతనాభిరుచికి ఆకర్షితులైవున్న పాశ్చాత్య సాహితీ ప్రియులు మెచ్చడంలోగాని, సనాతన విష్టాగరిష్ఠులు విరసించడంలోగాని అసహజతలేదు.

1902 నుంచీ భావ కవిత పెంపొందుతున్నా 1910 తర్వాతనే మరింత ప్రాంజీకృతమైంది. 1915 నుంచి ప్రధానంగా భావకవులు మొక్కవోని ధైర్యంతో పురోగమించనారంభించారు. తాము నెలకొల్పవలసిన నవ్యపథాల పట్ల సంపూర్ణ

చైతన్యంతో ప్రయోగశాలురవుతున్నారు. కల్పించవలసిన నూతనాభిరుచులపట్ల సిద్ధాంతావగాహన పెంపొందించుకుంటున్నారు.

గురజాడ అప్పారావు కీర్తిశేషులయ్యేనాటికి కృష్ణశాస్త్రి నూనూగు మీసాల నూత్న యౌవనుడు. కాకినాడ కాలేజీలో రఘుపతి వేంకటరత్నంనాయుడుగారి అంతేవాసిత్వంతో బసవరాజు అప్పారావు, గుడిపాటి వెంకటచలం ప్రభృతుల సచ్ఛాత్రంతో కొత్తదారులు వెతుక్కుంటున్నాడు.

ఈచిరంతనాన్వేషణలో సంప్రదాయాంధ తమస్సులు విడిపోనారంభించాయి తూరుపులో ఉదయించిన వేగుచుక్క దారిచూపుతోంది. ఆ వేగుచుక్క గురజాడ. అప్పటికే గురజాడకు మానసపుత్రుడుగా బసవరాజు నవ వసంతాగమన రేఖల పసిగట్టి గొంతు సవరించుకుంటున్నాడు వీరి సాహచర్యం అనివార్య నూత్న కాంతుల కారకమైంది. అందుకే ఆ వైతాళికుని మహాకవిగా కీర్తిస్తూ—"గుత్తునా యని జాతి ముత్యాల్ గుచ్చినాడే మేలిసరములః ఇత్తునాయని తెలుగు తల్లికి యిచ్చినాడే భక్తితో" అని అంజలి ఘటించాడు. నవ వసంతావిర్భావంలో గొంతెత్తిన పికనాదంగా పోల్చుకున్నాడు. ఆ క్రమగీతినెవ్వరూ ఆపజాలరనీ, అది అనంత ప్రతిధ్వను లీనగలదనీ విశ్వసించారు. ఆ గానం జాతికి గురుతరమైన అడుగు జాడలను సంతరించింది. పొడుపునులపై రంగవల్లికల తీర్చింది. మింటినడుమ ప్రచండ తేజంగా భాసించింది. సంజమబ్బుల కెంపుల విగ విగలను జాతికందించింది.

కాని ఆ మహనీయుని అకాల ఆకస్మిక మరణం మింటినడుమ ప్రచండ తేజమే అస్తమించినట్లయింది. ఆయన తేజోరస్మిబరవుతున్నంత పేహూ అంధ మౌఢ్యంతో తడుముల్లాడిన జాతి చీకట్లు క్రమ్మిన వేళ దేనికోసమో వెదుకుతున్నది. "కారు చీకటి గ్రమ్మినపుడె చదల మబ్బులు కప్పినపుడె, మిణుగురైనను మెరయనప్పుడె వెదకు" కొను జాతిని ఈ నవ్య కవి కుమారకుడు అధిక్షేపించాడు.

ఆ మహాకవి వినిపించిన లోక మోహన మధురగానా స్వాదమోదాలకు చుక్కలు సైతం సొక్కిపోవడం ఈ కవి కుమారుడు పోల్చుకున్నాడు. నిజమే. ఆ కంఠం వినిపించిన జీవన సహజమైన గానం "యుగ యుగంబులనుండి మ్రోగెడు విశ్వగాన వియత్తరంగిణీభంగములమహొంగే శక్తియుతాలు ఆయన గీత శీకరాలు౹

ఈ నవ చైతన్యంతో తన పథమేదో నిర్ధరితమైంది. ఇక కవితా రథం పురోగమించడ మొక్కటే కావలసినది. తూర్పు బల బల తెల్లవారి వుంది. ఇక ఆగామి కవితాలోకమంతా కృష్ణ కవితా పక్షమై. తనరారేందుకా యువ కంఠం ఆయత్తమవుతున్నది౹

# రెండో ప్రకరణం

## దేవులపల్లివారి కలికి పాటల కోయిల కాలము

తరుణ శృంగార మధుర మాధవుడవీవు
కలికి పాటల కోయిల కాలము మాది,
తావకీన సభావన తరువితాన
శాఖికల నిత్యనూతన స్వాదుగాన
జీవసారము కురియించి చివురులెత్త
పాడుకొన్నారు మాకుల స్వాము లెల్ల

అంటూ కృష్ణశాస్త్రి తన తొలి కవితా సంపుటి కృష్ణపక్షం శ్రీరావు వేంకట కుమార మహీపతి సూర్యారావుగారికి అంకితమిస్తూ గానంచేశారు. తమ కుల స్వాములంతా పీఠికాపురాస్థాన సభావనంలో పాడుకున్నారు. ఇది శతాబ్దాల చారిత్రక సత్యమే తప్ప కవితావేశవ్యంజనం కాదు.

1608లో పీఠికాపురం సంస్థానం ఏర్పడింది. రావు తెనుంగురాయనింగారు సంస్థాపకుడు. గోల్కొండ నవాబు ఆజ్ఞానుసారం సంస్థానం ఏర్పాటు చేస్తున్న సమయంలోనే తమకు సన్నిహిత వర్గాన్ని తోడ్తెచ్చారు. అలా వచ్చిన వారిలో దేవులపల్లి వంశకర్త ఒకరు. వీరు తెలంగాణా నుంచి వచ్చారు. శ్రీ దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రులుగారు రచించిన మహేంద్రవిజయం అవతారికలో కవి వంశావతార వర్ణనంచేశారు. వారి వంశ పురుషులు కృష్ణా గౌతమీ మధ్య భాగమునందుగల దాగిరిపల్లి అనే గ్రామాన్ని ఫాసుకా అగ్రహారంగా యివ్వడం వల్ల అక్కడ వుండేవారని రాశారు (41వ పద్యం). పిఠాపురాస్థాన విద్వాంసులుగా విచ్చేసిన తదుపరి క్రమానుగతంగా వీరి వంశీకులు ఆస్థాన విద్వత్కవులుగా విశేష గౌరవ సత్కారాలందుతూ వంశాభివృద్ధి కావించుకున్నారు

చైతన్యంతో ప్రయోగశాలురవుతున్నారు. కల్పించవలసిన నూతనాభిరుచులపట్ల సిద్ధాంతావగాహన పెంపొందించుకుంటున్నారు.

గురజాడ అప్పారావు కీర్తిశేషులయ్యేనాటికి కృష్ణశాస్త్రి నూనూగు మీసాల నూత్న యౌవనుడు. కాకినాడ కాలేజీలో రఘుపతి వేంకటరత్నంనాయుడుగారి అంతేవాసిత్వంతో బసవరాజు అప్పారావు, గుడిపాటి వెంకటచలం ప్రభృతుల సచ్ఛాత్రంతో కొత్తదారులు వెతుక్కుంటున్నాడు.

ఈచిరంతనాన్వేషణలో సంప్రదాయాంధ తమస్సులు విడిపోనారంభించాయి. తూరుపులో ఉదయించిన వేగుచుక్క దారిచూపుతోంది. ఆ వేగుచుక్కే గురజాడ. అప్పటికే గురజాడకు మానసపుత్రుడుగా బసవరాజు నవ వసంతాగమన రేఖల పసిగట్టి గొంతు సవరించుకుంటున్నాడు వీరి సాహచర్యం అనివార్య నూత్న కాంతుల కారకమైంది. అందుకే ఆ వైతాళికుని మహాకవిగా కీర్తిస్తూ—"గుత్తునా యని జాతి ముత్యాల్ గుచ్చినాడే మేలిసరములః ఇత్తునాయని తెలుగు తల్లికి యిచ్చినాడే భక్తితో" అని అంజలి ఘటించాడు. నవ వసంతావిర్భావంలో గొంతెత్తిన పికనాదంగా పోల్చుకున్నాడు. ఆ కమ్రగీతినెవ్వరూ ఆపజాలరనీ, అది అనంత ప్రతిధ్వను లీనగలదనీ విశ్వసించారు. ఆ గానం జాతికి గురుతరమైన అడుగు జాడలను సంతరించింది. పొడుపునులపై రంగవల్లికల తీర్చింది. మింటినడుమ ప్రచండ తేజంగా భాసించింది. సంజమబ్బుల కెంపుల నిగ నిగలను జాతికందించింది.

కాని ఆ మహనీయుని అకాల ఆకస్మిక మరణం మింటినడుమ ప్రచండ తేజమే అస్తమించినట్లయింది. ఆయన తేజోరశ్మిబరవుతున్నంత సేపూ అంధ మౌఢ్యంతో తడుముల్లాడిన జాతి చీకట్లు క్రమ్మిన వేళ దేనికోసమో వెదుకుతున్నది. "కారు చీకటి గ్రమ్మినపుడె చదల మబ్బులు కప్పినపుడె, మిణుగురైనను మెరయనప్పుడె వెదకు" కొను జాతిని ఈ నవ్య కవి కుమారకుడు అధిక్షేపించాడు.

ఆ మహాకవి వినిపించిన లోక మోహన మధురగానా స్వాదమోదాలకు చుక్కలు సైతం సొక్కిపోవడం ఈ కవి కుమారుడు పోల్చుకున్నాడు. నిజమే. ఆ కంఠం వినిపించిన జీవన సహజమైన గానం "యుగ యుగంబులనుండి మ్రోగెడు విశ్వగాన వియత్తరంగిణీభంగములనుప్పొంగే శక్తియుతాలు ఆయన గీత శీకరాలు॥

ఈ నవ చైతన్యంతో తన పథమేదో నిర్ధరితమైంది. ఇక కవితా రథం పురోగమించడమొక్కటే కావలసినది. తూర్పు బల బల తెల్లవారి వుంది. ఇక ఆగామి కవితాలోకమంతా కృష్ణ కవితా పక్షమై తనరారేందుకా యువ కంఠం ఆయత్తమవుతున్నది॥

# రెండో ప్రకరణం

## దేవులపల్లివారి కలికి పాటల కోయిల కాలవుం

తరుణ శృంగార మధుర మాధవుడవీవు
కలికి పాటల కోయిల కాలము మాది,
తావకీన సభావన తరువితాన
శాఖికల నిత్యనూతన స్వాదుగాన
జీవసారము కురియించి చివురులెత్త
పాడుకొన్నారు మాకుల స్వాము లెల్ల.

అంటూ కృష్ణశాస్త్రి తన తొలి కవితా సంపుటి కృష్ణపక్షం శ్రీరావు వేంకట కుమార మహీపతి సూర్యారావుగారికి అంకితమిస్తూ గానంచేశారు. తమ కుల స్వాములంతా పీఠికాపురాస్థాన సభావనంలో పాడుకున్నారు. ఇది శతాబ్దాల చారిత్రక సత్యమే తప్ప కవితావేశవ్యంజనం కాదు.

1698లో పీఠికాపురం సంస్థానం ఏర్పడింది. రావు తెనుంగురాయనింగారు సంస్థాపకుడు. గోల్కొండ నవాబు ఆజ్ఞానుసారం సంస్థానం ఏర్పాటు చేస్తున్న సమయంలోనే తమకు సన్నిహిత వర్గాన్ని తోడ్తెచ్చారు. అలా వచ్చిన వారిలో దేవులపల్లి వంశకర్త ఒకరు వీరు తెలంగాణా నుంచి వచ్చారు. శ్రీ దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రులుగారు రచించిన మహేంద్రవిజయం అవతారికలో కవి వంశావతార వర్ణనంచేశారు. వారి వంశ పురుషులు కృష్ణా గౌతమీ మధ్య భాగమునందుగల దాగిరిపల్లి అనే గ్రామాన్ని ఫాసులా అగ్రహారంగా యివ్వడం వల్ల అక్కడ వుండేవారని రాశారు (41వ పద్యం). పిఠాపురాస్థాన విద్వాంసులుగా విచ్చేసిన తదుపరి క్రమానుగతంగా వీరి వంశీకులు ఆస్థాన విద్వత్కవులుగా విశేష గౌరవ సత్కారాలందుతూ వంశాభివృద్ధి కావించుకున్నారు.

17వ శతాబ్దారంభంలో సంస్థాన ప్రభువులైనవారు రావు మాధవరాయణిం గారు. వీరి ఆస్థానంలోనే వక్కలంక వీరభద్రకవి, కవిసార్వభౌమ కూచిమంచి తిమ్మకవిగార్లుండేవారు. వీరి తర్వాత ప్రఖ్యాత ప్రభువు రావు వేంకట కుమార మహీపతి రాయణింగారు. వీరి కాలం 1786-1793 వీరి ఆస్థానంలో దేవులపల్లి బాపయ్య కవి మహావిద్వాంసుడు వీరికే బ్రహ్మయ్యశాస్త్రి అనే నామాంతరముండేది. వీరు సంస్కృతంలో తారావళి అనే కావ్యం రచించి ప్రభువుకు అంకితమిచ్చారు. ఫకురుద్దీన్‌పాలెం అగ్రహారంగా బహూమతి పొందారు. ఆ కావ్యం చిన్నదే ఐనా నక్షత్రనామాయుతంగా రామాయణార్థబోధకంగా సాగింది సుప్రసిద్ధ విమర్శకులు పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి పీఠికాపుర సంస్థానాధిపతుల సాహిత్య సేవ అనే వ్యాసంలో వివరించారు వీరితర్వాత ప్రఖ్యాతి పొందిన ప్రభువు వీరాద్రి రాయణింగారు, వీరి ఆస్థాన విద్వత్కవులు దేవులపల్లి రామశాస్త్రి యావదాంధ్ర లోనూ మహావిఖ్యాతులు తమ ప్రభువు అనుమతిపై విజయనగరం సందర్శించి శ్రీపూసపాటి విజయరామ గజపతి మహారాజుగారిచే అగ్రహారం పారితోషికంగా పొందారు. ఆ సన్నివేశాన్ని మహేంద్ర విజయంలో శ్రీ సుబ్బరాయశాస్త్రి గారు ఇలా వక్కాణిస్తున్నారు. "అతనికి పూసపాటి కులజాగ్రణియుం కవితా ప్రసజ్ఞుడున్ ప్రతత యశుండునౌ విజయరాయనృపాల వరుండు గౌరవాంచితమతి రాజధాని దరిసీమ నొసంగెను సర్వ సస్య శాశ్వత ఫలసారమౌ నెలగవాడ సమాఖ్య మహాగ్రహారమున్ (155 పద్యం)"

ఈ వీరాద్రి రాయణంగారి మహామంత్రి అవసరాల పద్మరాజుగారు విద్వత్కవులు. ఆయన సంస్కృతంలో రచించిన భాగవత చంపూ కావ్యానికి బంధరంజని అనే వ్యాఖ్యానం శ్రీరామశాస్త్రి సంతరించారు రాజావారి ఆజ్ఞానుసారం మాధవ విలాసం అనే బాణం శృంగార రస ప్రధానంగా విరచించారు

వీరి తర్వాతి పేరొందినవారు సీతారామశాస్త్రిగారు కవిసార్వభౌమ కూచిమంచి తిమ్మకవి ప్రపౌత్రుడగు తిమ్మకవి సుజన మనః కుముద చంద్రిక అనే చంపూ కావ్యం రచించి తన గురువగు దేవులపల్లి సీతారామశాస్త్రిని ప్రస్తుతించారు. నాలుగు శాస్త్రాలను వారి వద్ద నుంచి తాను నేర్చుకున్నట్లు చెప్పుకున్నాడు.

విజయనగర ప్రభువుచే సత్కరింపబడిన రామశాస్త్రిగారి మనుమడు రామశాస్త్రి సంస్కృతంలో రామ చంద్రోదయ చంపును, సాహితీ దర్పణం అనే అలంకార శాస్త్రాన్ని, బాల భాగవతమునకు వ్యాఖ్యానాన్నీ, అనేక నాటకాలనూ రచించాడు సాహితీ చక్రవర్తి అనే బిరుదు పొందాడు. యీ రామశాస్త్రిగారి తమ్ముని కుమారుడు కృష్ణశాస్త్రి రసగుణా దర్శమునకు వ్యాఖ్యానమూ, తర్కసారమనే న్యాయశాస్త్రమూ, సాహితీ సారమనే అలంకార శాస్త్రమూ రచించి మహాప్రఖ్యాతుడయ్యాడు.

ఇలా దేవులపల్లివారి వంశంలో ప్రతి తరంలోనూ ఎందరో పండితులు, కవులు ప్రవర్తిల్లుతూనే ఉన్నారు వీరి వంశంలో రామశాస్త్రి, కృష్ణశాస్త్రి అనే పేర్లు అనేకులకున్నాయి. పైన తెల్పిన కృష్ణశాస్త్రి మొదటివారు. భావకవి చక్రవర్తిగా మహా విఖ్యాతులైన కృష్ణశాస్త్రి వరుసగా వచ్చిన ముగ్గురిలో మూడవ వారు. వీరి జనకులు తమ్మన్న శాస్త్రి అనే నామాంతర విఖ్యాతులైన వేంకట కృష్ణశాస్త్రి రెండవవారు. వారి తండ్రిగారునూ సీతారామశాస్త్రిగారి పుత్రులున్నూ అగు కృష్ణశాస్త్రి మొదటివారు కృష్ణశాస్త్రి తన కృష్ణపక్షాన్ని అంకితమిస్తూ గానం చేసిన గీతంలో కలికి పాటల కోయిల కాలము మాది అనే వాక్యానికి వ్యాఖ్యానంగా నాలుగువందల సంవత్సరాల విద్వత్కవి చరిత్ర భాగమంతా నిలుస్తుంది 16వ శతాబ్దానిగా పీఠికాపుర సంస్థాన చరిత్రనూ, ఆస్థానసాహితీ వైభవాన్నీ దేవులపల్లివారి వంశ చరిత్రలో విడదీసి చెప్పడం సాధ్యంకాదు. దేవులపల్లి వారి విద్వత్కవి వంశం, స్వాదుగాన జీవసారం కురిపించారు, లోకం చివురు కట్టేటట్లు పాడుకున్నారు.

## మా బాబయ్యగారు — మా నాన్నగారు

ఈ శీర్షికతో కృష్ణశాస్త్రి, ఏడు గీతమాలికలను విరచించారు. ఆ గీత మాలికలలో తమ బాబయ్యగారికి, నాన్నగారికి నివాళు లర్పించారు. స్వచ్ఛ కవితా చంద్రికలను ప్రస్తుతించారు. వారి జీవిత చరిత్ర వైభవాన్ని స్పర్శించారు. అది కేవలం సంక్షేపంగా కీర్తించిన కవితా నివాళి తనక తన్మాత్రంగానే అవకాశం లభించింది వారికి. ఆ మహాకవుల జీవిత చరిత్రనూ, కవితా వైభవాన్ని పరామర్శించుకుంటే తప్ప—ఈ కృష్ణశాస్త్రి, ఎలాంటి పాదులోని మొలకో అవగాహన చేసుకోలేము.

శ్రీ దేవులపల్లి సోదరకవులు నన్నయ్య, తిక్కన్నలవంటివారుగా సమకాలికుల స్తుతులందుకున్నారు. వీరి తాతగారగు సీతారామ శాస్త్రిగారే వీరిరువురికి అక్షరాభ్యాసమొనర్చి, కాళిదాసత్రయం పాఠం చెప్పారు. తదుపరి తండ్రిగారే కావ్యాన్వయాన్నీ, నైషధాన్నీ బోధించారు. చంపూకావ్యాలు, అలంకార శాస్త్రం, నాటకాలు, సిద్ధాంత కౌముది మున్నగు సకల విద్యలు పాఠంచేశారు

సుబ్బరాయశాస్త్రి, జనన మందినది 1853 సం. రం.లో జనవరి 21వ తేదీని తమ్మనశాస్త్రిగారి జననం తేది లభించకపోయినా అన్నగారికన్న వీరు రెండున్నర సంవత్సరాలు చిన్నవారనీ, దాదాపు కవలలవలె ఉండేవారనీ పెద్దలు చెప్పగా విన్నది. కూచిమంచి తిమ్మకవి కులకర్ణిగా తన కడపటిదినాలు గడపిన రావువారి చంద్రమపాలెం వీరి నివాసస్థలం. వీరి తండ్రి వేంకట కృష్ణశాస్త్రి, తల్లి వెంక

మాంబగారు జనమంచి వారి ఆడపడుచు దేవులపల్లి సోదరకవులు గంగాధర రామారాయని ఆస్థాన విద్వత్కవులుగా సన్నిహిత శ్రేణిలోనివారై వుంటూ చివరి వారైన మహీపతి సూర్యారావు గారికి బాల్యగురువులై సంస్కృతాంధ్ర సాహిత్యాలు బోధించారు. సుబ్బారాయ శాస్త్రీగారు రావువంశ ముక్తావళి అనే గ్రంథం సంస్కృతంలో రచించి ప్రభువుకు అంకితమీయగా దీనికి పారితోషికంగా ఏమియ్యగలనో సింహాసనం తప్ప అని ప్రకటించారు. సుబ్బరాయ శాస్త్రిగారిని సింహాసన స్థితులొనర్చి వారు స్వయంగా వింజామర వీచారు ఈ మహాభారం వహించ సమర్థులు తమరేకాని మాబోంట్లుకాదని వారిసింహాసనం తిరిగి వారికే సమర్పించారు. అంత విఖ్యాతులైన కవీశ్వరులు వీరు.

సుబ్బారాయశాస్త్రి అశుధారా పటిమ ప్రబంధశైలినే వరించేది. వీరికి ఆంధ్ర లక్షణోపదేశకులు కూచిమంచి వేంకటరాయ కవిగారనే ఆలంకారికులు. తమ ప్రపితామహులగు తిమ్మకవి కావ్యాలకు అనర్గళ వ్యాఖ్యానం చేసేవారు. వీరుకూడా గంగాధర రామారావుగారి ఆస్థాన విద్వత్కవులే లాక్షణిక చక్రవర్తి అనే బిరుదాంకితులు. వీరొకసారి ప్రసంగవశాత్తు కూచిమంచి తిమ్మకవి సార్వభౌముని ఈ క్రింది పద్యం చదివి

సదమా పొక్కిలి జాంబూ
నదమా మైచాయ కోకనదమా పదమా
పదమా జడ ఇందుము వియత్
పదమా నూగారు గూఢ పధమా చెలికిన్

ఇలాంటి అద్భుతావహ శ్లేషలతో యిప్పటివారెవరైనా రాయగలరా అవి అడిగారట "ఆ ఎందుకు రాయలేరు. నేనే చెబుతాను అవధరించండి అంటూ సుబ్బరాయశాస్త్రి, ఆశువుగా

రసమా తనురుచి జితసా
రసమా వదనంబు వసధరసమా హితసా
రసమా నమాకచము సా
రసమా నడమడుపు లమృత రసమా చెలికిన్

అవి చెప్పగా ఎంత రసమయంగా చెప్పావయ్యా అని కౌగిలించు కున్నారట. 'అక్షర లక్షలీయదగు పద్యం చెప్పావు' అంటూ స్తుతించారట దేవుల పల్లి వారింట పుట్టిన వీకిట్టి ప్రజ్ఞా పాటవాలు అబ్బడం ఆశ్చర్యం లేదనుకో అంటూ ఆశీర్వదించారట. తదనంతరం శ్రీరామ పంచాశతి అనే స్తుతి కావ్యం

అశువుగా చెప్పారు. శ్రీకృష్ణ కర్ణామృతం వంటి ఏబది శ్లోకాలు గల స్తుతి కావ్య మది.

సుబ్బరాయశాస్త్రిగారి పాండితీ, ధారణా అందరికీ ఆశ్చర్యం కలిగించేవి. ఏ కావ్యం నుండి ఏ సందర్భంలోనిదైనా శ్లోకం కావలిస్తే వెంటనే గణగణచదువ గలిగేవారట వేలకొలది శ్లోకాలు వీరికి కంఠస్థాలు వందలాది సంఘటనలు వచో విధేయాలు.

శ్రీ సుబ్బరాయశాస్త్రీగారు రచించిన పది గ్రంథాలలో మహేంద్ర విజయం అనే ప్రబంధం 1907 సం. రంలో రాజా చల్లయమ్మారావు (కోలంక) గారి ద్రవ్య సహాయంతో ముద్రింపబడింది. అప్పటి దివాన్ సూర్యారావుగారి విద్యా గురువులగు మొక్కపాటి సుబ్బారాయుడు, బి. ఏ. గారు 'విద్యాభిమాని' అనే ప్రచ్ఛన్న నామంతో ఉపోద్ఘాతంగా కవి జీవితము రచించారు. వీరే 'భాషాభి మాని' అనేపేరుతో పీఠికను కూడా రచించారు ఈ రెండు చదివిన వారికి మొక్కపాటి సుబ్బరాయుడుగారెంతటి ఆంధ్ర భాషావిద్వాంసులో, ధీ విశాలురో అవగాహన మవుతుంది.

1879వ సంవత్సరము నవంబరు నెల శతావధాన ధురీణులు శ్రీ మాడ భూషి వేంకటాచార్యులు గంగాధర రామారావుగారి దర్శనార్థం వచ్చారు. దాన కర్ణులుగా వీరు పొందినఖ్యాతివిని; తన ప్రజ్ఞ చూపి, బహుమతి పొందుటకు సంకల్పించారు. వారి అష్టావధానం ఏర్పాటయింది గొప్పగా జరిగింది. మహారాజా ఆనందించారు, సముచిత సత్కారం చేశారు. "మన ఆస్థానంలో ఇలాంటి వైదుష్యంతో అవధానం చేయగలవారెవరైనా ఉన్నారా" అని సభను ప్రశ్నించారు. ఆ సమయంలో దేవులపల్లి సోదరకవులక్కడ లేరు "ఎవరో లేచి లేకేమి దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి కుమారులున్నారు, వారిరువురూ ఈ మాత్రం చేయ గల దిట్టలే అని జవాబు చెప్పారు. అలా చెప్పిన వారూ వీరిరువురూ అవధా నాలు చేయడం చూసి ఎరుగరు. వెంటనే వారికి పిలుపు వెళ్ళింది. అవధానం చేయమని రాజు వారిని ఆజ్ఞాపించారు. "ఇంతకు పూర్వం మేమెన్నడూ యిట్టి అవధాన ప్రదర్శనం చేసి ఉండలేదు, కాని అభినవ భోజులు తమ సమక్షంలో సాహసించగలమనే విన్నపము" అన్నారు.

మరునాడే శతావధానం ఏర్పాటయింది. శతావధాని మాడభూషి వేంకటా చార్యులుగారు తిలకించారు. మెచ్చుకొన్నారు. వారిమేధా ప్రజ్ఞ అవితర సాధ్యం. "మీ పద్యాలన్నీ సావధానంగా రచించిన ప్రబంధము వలె ఉన్నాయి. ఆశువుగా అల్లిబిల్లిగా చెప్పినట్లు లేనేలేవు" అంటూ విస్మేరచిత్తంతో ఆశీర్వదించారు.

1903లో వీరు జరిపిన మరో శతావధానాన్ని స్వయంగా పరిశీలించిన ఆత్మకూరు సంస్థాన విద్వాంసులు, బాల సరస్వతి బిరుదాంకితులు శ్రీనివాసాచార్యులుగారు ఫిబ్రవరి 4వ తేదీగల శశిరేఖ పత్రికలో నాలుగు ప్రశంసా శ్లోకాలు ప్రచురించారు. 1879 నాటి శతావధానం నుంచీ గంగాధరరామారావు గారికి వీరెంతో ప్రీతిపాత్రులయ్యారు. పరంపరానుగతంగా రాయబడుతూ భద్రం చేయబడిన 'ఆఖీఖత్' అనబడే రావువారి వంశ చరిత్రను సుబ్బరాయశాస్త్రిగారిచే సంస్కృత కావ్యంగానూ, తమ్మనశాస్త్రిగారిచే తెలుగు కావ్యంగాను రచింపచేసి, 1882లో ఈ రెండు కావ్యాలనూ అంకితం తీసుకొన్నారు. ఆ సందర్భంలోనే భోజమహారాజు అర్థ సింహాసన మిచ్చే ఈ మహారాజుగారు సంపూర్ణంగా సింహాసన మర్పించారు. 1890లో వల్లాణ కావ్యాన్ని శివస్తవంగా అంద్రీకరించారు. ఆ సంవత్సరమే గంగాధర రామారావు కాలధర్మం చెందారు. ఆ సంఘటనతో పెద్దన్నవలె తమ నిర్వేదాన్ని ప్రకటించుకున్నారీ సోదరకవులు.

దత్తపుత్రుడు తెచ్చిన దావా వ్యవహారాలకు ముఖ్య సలహాదారులుగా సోదరకవులు చెన్నపట్నంలో చాలాకాలం నివసించవలసి వచ్చింది. అప్పుడు వీరి అవధానాలతో దేశీయ ఉన్నత విద్వాంసులేకాక, వైదేశిక రాజపీతిజ్ఞులు కూడ అచ్చెరువంది ఎన్నో యోగ్యతా పత్రాలందచేశారు. అలాంటి ప్రదర్శనాలలో 1904లో జరిగిన శతావధానం మిక్కిలి ప్రశంసాపాత్రం. వివిధ భాషల విద్వన్మణులు పృచ్ఛకులుగా ఆశీనులయ్యారు. అవధానులకు పరిచయ పూర్వం కాని భాషలలో కూడా రమ్యంగా సమాధానాలిచ్చేసరికి అందరూ ఆశ్చర్యచకితులయ్యారు ఈ ఉదంతాన్ని శ్రీ మొక్కపాటివారు సోదాహరణంగా వివరించారు. ఆ శతావధానంలో పృచ్ఛకులలో ఒకరు మహాకవి గురజాడ అప్పారావు బి. ఏ., గారున్నారని వారు రాశారు. వారు ఉద్దిష్టాక్షరి అనే ప్రక్రియకు ప్రాతినిధ్యం వహించారట: (తమకు తోచిన అక్షరాన్ని సూచిస్తుండగా 132 గళ్ళలో ఉన్న ఆ అక్షరాలతో కోరిన స్తుతి శ్లోకం చెప్పాలి.) అంజనేయస్తవంగా సంస్కృత శ్లోకం చెప్పారు అవధానులు. ఆ శ్లోకం యిది.

సీతా శోకాపహర్తారం వారాశి తరణక్షమం
శ్రీరామ పాద భక్తం తమాంజనేయం భజామ్యహమ్!

కవి సార్వభౌమ దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి, మహేంద్ర విజయకవి వంశావతరణంలో తెల్పిన విద్వత్కవులందరి గురించీ యిక్కడ వివరించడం సాధ్యం కాదు. అది వేరే ఒక గ్రంథమంత విషయం. నాలుగువందల సంవత్సరాల ఒక వంశ చరిత్రలో కొన్నివందలమంది విద్వాంసులూ, సాహితీ మర్మజ్ఞులూ కవులూ పుంఖాను పుంఖాలుగా సంభవించడం ఒక అరుదైన విషయం.

కవులూ పండితులూ ప్రాదుర్భవించడం అనువంశికంగా జరిగే విషయంగా ఆధునిక విజ్ఞాన శాస్త్ర విభాగాలలో ఏదీ ఆమోదించదు. కాని తెలుగువాడు అలవోకగా అనేసిన-"ఏ గూటి చిలుక ఆ గూటి పలుకు" అన్న నానుడి కొంతయినా ప్రభావం కలిగించకపోదు. ముచ్చి కొడుకు తోలుముక్కలతోటీ, సానరాయితోటీ, కంసాలీతోటి ఆడుకోవడం ప్రారంభించినట్లు కవి కొడుకు కాగితాలతోటీ, కలాలతోటీ ఆడుకుంటాడు. దీనికి కాస్త తండ్రి అజమాయిషీ ఏర్పడి, సాహిత్య జ్ఞానాన్ని స్వార్జితంగా సాధించాలనే ఉత్సుకత శిశువులో వుంటే విద్వాంసుని కుమారుడు పండిత పుత్రుడు కాబోడు. ఆ విధంగానే దేవులపల్లివారి వంశం కవి పండిత పరంపరగా రూపొందింది. వీరి చరిత్రను దాగిరిపల్లినుంచి సామర్లకోటకు వచ్చి స్థిరపడిన దేవులపల్లి వేంకట శాస్త్రిగారితో ప్రారంభించి, భావకవి చక్రవర్తి కృష్ణశాస్త్రిగారితో ముగించారు. తమ్మన్న శాస్త్రిగారి వివాహ విషయం ప్రస్తావించి ఈ క్రింది పద్యంలో

"కనె నతడు సుతు జిరాయువు
చిన వేంకట కృష్ణశాస్త్రి, శ్రీరామ కృపన్
దన రారుచు నున్నాడిక
దనరారగలడు వాడపత్యధన సంపదలన్"

అంటూ వారు ఆశీః పురస్సరమైన భవిష్యద్వాణిని పలికారు. మన కృష్ణశాస్త్రిగారి బాబయ్యగారు, నాన్నగారూ కూడా దాదాపు నడిమి వయస్సులోనే అంటే షష్టిపూర్తి కాకుండానే కాలధర్మం చెందినట్లు పెద్దలు చెబుతారు. కృష్ణశాస్త్రిగారి పెదబావగారు విజయనగరం సంస్థానంలో ఉద్యోగం చేస్తూ ఉండేవారు. విద్యార్థిగా హైస్కూలు తరగతుల చదువుతున్ననాటి నుంచీ కృష్ణశాస్త్రి విజయనగరం తరచుగా వెళ్ళివస్తూ ఉండేవారట. అస్తమానూ మా బాబయ్య నాన్న అంటూ చెప్పుకోవడమేనా నీకేమైనా కవిత్వం వచ్చిందా? అని బావగారు వేళాకోళం చేయగా, మన కృష్ణశాస్త్రి పన్నెండేళ్ళవారు-ఒక పద్యం చెప్పారు. ఆ పద్యంలో పులి కడుపున పుట్టినవాడికి ఒక చారయినా రాదా అనే భావం వ్యక్తమవుతుంది. తద్వారా పసితనంనుంచీ గురజాడ అప్పారావుగారిని దర్శిస్తుండటం జరిగేది. తరువాత కాలంలో ఈ పెదబావగారి కుమార్తెనే కృష్ణశాస్త్రి ప్రథమ వివాహం చేసుకున్నారు. కాకినాడ కాలేజీ అప్పటికి ఫస్టుగ్రేడు కాలేజి కాకపోవడం వల్ల డిగ్రీ చదువుకు విజయనగరమే వెళ్ళవలసి వచ్చింది.

మా బాబయ్యగారు, నాన్నగారు అనే శీర్షికతో కృష్ణశాస్త్రి రచించిన ఏడు గీతమాలికలలోనూ సర్వత్రా వారివురినీ ఏకమూర్తిగా సంభావించడమే జరిగింది. బాబయ్యగారికంతా కుమార్తెలే కావడం వల్ల అన్నతమ్ములిరువురికీ వీరే

వంశోద్ధారకులు కావడం వల్లనూ, వారిరువురూ జన్మతః ఏకస్థులై మసిలిన కారణం గానూ, ఏక మూర్త్యాత్మక సందర్శనమే కలుగుతుంది. ఈ ఖండ కావ్యంలో మాత్రం ఎక్కడా వ్యక్తిగత జీవిత విశేషాల తోగట్టా కానరాదు. "అమృత గాన మధుర మందాకినీ భంగమాలికాంబుశీకర వితాన మోహన చిత్రనటన మెన్ని యెన్ని రీతుల చూపుచున్నారో?" మాత్రమే కృష్ణశాస్త్రి, భావన చేస్తారు వారు మరణానంతరమే-"పూర్ణ వికసిత జీవిత పుష్పకమ్ర సౌరభమ్ముల చిమ్ముచున్నా" రేమోనని కవి సంశయిస్తారు. వారు కలనైనా ఎడబాటెరుగని సహోదర ప్రేమా స్పదులు.

''ఏనెఱుంగుదు చిరనూతనానురాగ
బంధముల కట్టువడుట స్వప్నముల నేని
ఎప్పుడునుగాని యెచ్చోట నేని నిముస
మేని ఎడబాటు మీారు సహింప లేరు!''

అంతటి ప్రేమానుబంధం వారిది. అంతేకాదు, వారి ప్రభుభక్తి కూడా అలాంటిదే. వారికన్న ముందే స్వర్గావాసానికి వెడలిపోయిన గంగాధర రామా రావుగారితో చేయి చేయి కలిపి కాంతిసీమల వీరు ముగ్గురూ విహరిస్తున్నారు కాబోలు! వారి ముగ్గురికీ ప్రేమపాత్రులైన చిరంజీవి సూర్యారావుగారి కొదల నాశిషాక్షతలు చల్లుతూ ఉంటారు కాబోలు! అని కృష్ణశాస్త్రి భావిస్తారు.

అంతేకాదు, దీనజన హృదయాంతర స్థిర విహారులైన సూర్యారావుగారికి జయం పలుకుతూ దశదిశలు మార్మ్రోగే సమయంలో ముగ్గురూ కలిసి వింటూ తమలో తామానందిస్తూ ఉంటారు. వారి దరహాస రేఖలే-వెన్నెలై వినువీధులు విరియునేమో! అని భావిస్తారు. వారి యశశ్చంద్రికా పవిత్రధారల స్నాతులవ డంవల్ల వారి తనయుని జీవితం కూడా పవిత్రమయిందని ఎంతో ఆనందంతో సంభావిస్తారు కృష్ణశాస్త్రి.

రామరాయేంద్ర సభాస్థలిలో ఈ సోదరకవులు దరనిమీలిత నేత్రాలతో నూత్న గీతాలాపన చేయగా ఆ అపూర్వ రక్తికలరి కవీంద్ర సామ్రాట్లు లేత నవ్వులతో శిరఃకంపనం చేశారట. దానితో విశ్వమంతటా మెరుపుతీగలు పరు వులు తీసినట్లయిందట!

ఆ మహాకవులెప్పుడో పాడిన వసంత మధుర జీవనగీతి, కాలాలనూ ఋతువులనూ అతిక్రమించి సదా పారవశ్యం కలిగిస్తూనే ఉన్నదట. నవ్య భాగీ రథీ దివ్యన విధాన సోత్సవ నృత్యం సంతతమూ జరుపుతున్నదట!

ప్రాజ్య పీఠపురీ మహారాజ్య భాగ్యలక్ష్మి కొలువు దీర్చు చిరత్న రత్న ఖచిత భాసమాన కళ్యాణ సింహాసనంపై ఈ మహాకవులను ఆశీనులుజేసి చామర సమీరాల ప్రసరించగా పులకిత మృదుశరీరాలను భావనాలోకంలో దర్శించుకుం టాయ కృష్ణశాస్త్రి

అలాంటి విగమాగమాలు ప్రవహించిన వంశపు పాదులో పుట్టిన కృష్ణ శాస్త్రి కాలం పిలుపందుకున్నారు. కేలందుకున్నారు. సంఘ సంస్కరణ మహో ద్యమంలో భాగస్వామిగా చేరారు. హరి జనోద్ధరణ మహా క్రతువుకు పూను కున్నారు. చెట్టు చెడే కాలానికి కుక్కమూతి పిందె అని ఛాందభావ్మాలు గేలిచేశారు మహానీయుల కడుపున చెడపుట్టినవాడని బహిరంగంగా నిందించి సంఘ బహి ష్కరణ కావించారు. కృష్ణశాస్త్రి స్థిర సంకల్పాలు కదలలేదు గురజాడ పిలిచిన భాషా సంస్కరణ ఉద్యమాన్ని అందుకున్నారు, సంఘ సంస్కరణ వరకూ తనతో కలిసి వచ్చిన మహారాజు భాషాభిషక్కులు దుష్ట మంత్రాంగంతో కృష్ణశాస్త్రికి అనాటివరకూ జరిగే ఆస్థాన మర్యాదలన్నిటినీ తగ్గించారు. ఆయన ధైర్యం వీగిపోలేదు కోటలోనికి రా వీలు లేదని దేవిడీమన్నా చేయించారు. పిఠా పురం మహారాజు హృదయం ద్రవరూపమైంది. మంత్రులూ చోదకులూ ఏ స్వరూపులైతే దానికి ఆ రూపమే సంభవించడం పరిపాటి. పైగా కదలబారని జలకలశం నాచు పాకుడులతో నిండిపోయింది. ఇంక కావలసిందేమిటో?

అప్పటికే కృష్ణశాస్త్రి చైతన్యం యథార్థాన్ని గుర్తించింది. "తిరుగ నీ నాటికాంధ్ర సారస్వతమునకు వసంతోదయమైనది. నవజీవము కలిగినది. నూతన రామణీయకము చేకూరినది. వల్లరులకొక క్రొత్త సౌకుమార్యము, చివురులకొక క్రొత్త మెత్తందనము, ప్రసవములకొక క్రొత్త కమ్మందనము, మకరందమున కొక క్రొత్త మాధుర్యము, కలకంఠమునకొక కొత్త కంఠస్వరము-ఈ వసంత వనలక్ష్మికొక కొత్త శోభ" తనరారిందని గ్రహించారాయన. "ఆంధ్ర సారస్వత చరిత్రలో నొక నూతన శకము ప్రారంభమైంది. కవులు బయలుదేరినారు. ప్రాత కవులవంటివారు కారు. గానమొనర్చుచున్నారు వెనుకటివారి వలె కాదు. విష యములో మార్పు, రీతిలో మార్పు, స్వరములో మార్పు. ఔను కాలము మారి నపుడు కాలముతో పరిస్థితులన్నియు మారినపుడు కవిత్వము మాత్రము మార కుండునా?" అని ప్రశ్నిస్తారు. ఈ సమస్తభావాలూ ప్రకటితమయ్యాయి, 1922లో వేంకట పార్వతీశ్వర కవుల ఏకాంత సేవ ప్రచురితమైనపుడు దానికి పీఠిక రచించారు కృష్ణశాస్త్రి. ఇరువదైదేళ్ళ ప్రారంభయౌవనులాయన. వారే మరో సత్యాన్ని సాహితీపరంగా ఇలా అన్వయిస్తున్నారు. "ప్రాచ్య పాశ్చాత్య నాగరికతా సమ్మేళనము వలన మనవారు కొత్తవారైనారు. వీరికి కొన్ని నూతనాశయములు అలవడినవి. మారిపోవుట తప్పకమారిపోవుచున్నారు"

అని ప్రబల కంఠస్వరంతో మార్పును వేనోళ్ళకొనియాడుతూ చిత్రిస్తారు. క్రొత్త కవిత్వానికి భావనాశక్తియే ముఖ్యముగాని బుద్ధిసూక్ష్మతకాదని వక్కాణించారు. ఏకాంతసేవకు వీరు రచించిన పీఠిక భావకవితకే రాసిన పీఠిక. దిద్దిన తిలకాయమానరేఖ. ప్రజల అనూనసంపదయగు గేయవాఙ్మయ మాధుర్యాన్ని నవ్యభావ కవిత ఎలా పుణికి పుచ్చుకుంటున్నదీ వివరించారు.

ఈ భావాలే రాజావారికి పడవు. వారిని పరివేష్టించి వున్న పండితబ్రువులు పడనీయరు. విశాలహృదయులు శ్రేయఃకాములూ అగు మొక్కపాటి సుబ్బారాయుడుగారు అప్పటికే కాలధర్మం చెందారు. దుష్టమంత్రాంగం రాజావారి హృదయాన్ని ఆక్రమించుకుంది మహావీయుడు చెలికాని లచ్చారావుగారివంటి మనిషీ, ఈ దుష్టమంత్రాంగం గురించి చేసిన హెచ్చరికలు వినకుండా పండిత వృషభులు దుర్గం నిర్మించారు.

"అవిందగ్రామ్య భాషోద్యమాన్ని భావాభావ కవిత్వాన్ని అరికట్టడానికి పండితుల దుష్టమార్గ దర్శకత్వంతో సూర్యారావుగారి కృషి దుర్వినియోగం పొందింది" అని పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారే సెలవిచ్చారు వీరునూ గ్రాంధిక వాదులే కాని పాషండులు కారు.

ఇంతగా భాషావిషయికమైన ఈ మార్పును అంగీకరించక అరికట్ట చూస్తున్నా, తరతరాలుగా సిద్ధించిన ప్రభుభక్తితో కృష్ణశాస్త్రి తన కృష్ణపక్షాన్ని శ్రీ సూర్యారావు బహద్దురువారికే అంకితమిచ్చారు, వారు దాన్ని స్వీకరించనే లేదు. అయితేనేం? వారు తమ భక్తి విశ్వాసాలను ప్రకటించుకోకుండా ఎవరరి కట్టగలరు?

''పిక కుమారకు నన్ను పాడుకొననిమ్ము
మాలగా తొలిపాటల పూలతోడ
హృదయమే కూర్చి నీకొరకెదురుచూతు''

అలా అలా మహారాజావారి జీవితాంతం ఎదురుచూడటం కృష్ణశాస్త్రిగారి వంతుగా మారిపోయింది. శ్రీసూర్యారావు బహద్దరు వారు సరస కవితా పక్షాన్ని కన్నెత్తయినా చూడలేదు చుట్టూ క్రమ్మివున్న పండితులు వారిని చూడనివ్వలే ఐతేనేమాయె. ఒకరాజు లెక్కా కోట్లాది తెలుగు ప్రజాహృదయాలు, కృష్ణశాస్త్రి కురిపించిన జీవనాసారానికి కొత్త మోసులెత్తాయి.

# మూడో ప్రకరణం

## ఇరవయ్యో శతాబ్దికి కలికితురాయి

పంతొమ్మిదో శతాబ్ది చివరి పాదం వరకూ తెలుగు కావ్యాల్లో వినపబడుతున్న పదాలు తొమ్మిదివందల ఏళ్ళుగా మన కవితావితానంలో స్థిరపడ్డవే. గతానుగతికత్వంతో గుడి సుళ్ళు తిరుగుతూన్నవే. వాడగా వాడగా పసివాడి, నలిగి కగ్గిపోయిన పదాలవి. సొంతకాంతులు కోల్పోయీ, మగ్గి వాసనలు పోకొట్టుకొనీ, నిస్తేజాలయిన పదాలవి. ఆ పదాలకు ముసలితనం దాపురించింది. శ్రోత్రమనోలోకాన్ని ప్రజ్వలించలేకపోయినవి.

మొద్దుబారిన పద్మముఖులూ, చీపిరికళ్ళ చంద్రవదనలూ, మెల్లకంటి ఆకర్ణాంత విశాలలోచనలూ, మరుగుజ్జు మదేభయానలూ, స్థూల శరీరాల కుంభస్తనులూ, వక్రరేఖలవంటి చక్రస్తనులూ మన కవిత్వాన్ని నింపివేశారు. క్రిక్కిరిసి ఒరుసుకుంటూ తిరునాళ్ళకు తరలి వెళ్ళారు. కొత్తగాలిని వెలుతురునీ స్తంభింపచేశారు. పాఠకుని మనసుకు క్రొత్త రేకులద్దలేకపోయారు క్రొత్త ఉత్తేజాన్ని కలిగించలేకపోయారు. అనుకరణ అంటురోగమై జాతిని పీడింపనారంభించింది. వాగ్దేవి వాకిలి కశ్మల భరితమైపోయింది.

నిలవబారిన కవిసమయాలు సాహితీ సరోవరాన్ని కల్మషపరిచాయి. ప్రాణశక్తిని కోల్పోయిన సమాసాలు విపరీతంగా ప్రోగుపడి కావ్యాలను శ్మశానాలుగా రూపొందించాయి. అవసరమున్నా లేకున్నా అంధవిశ్వాసంగా స్థిరపడిన అష్టాదశ వర్ణనలు నిర్జీవాలంకారాలుగా దుర్భరమయ్యాయి. ఈ విధంగా మన కవిత్వం బలాన్ని కాక వాపును ప్రదర్శించింది.

నాటి కవిత్వంలో అనుస్యూతంగా ప్రయుక్తమవుతూ గతించిపోయిన కాలానికీ, లోకానికీ చెందిన దన్న వైముఖ్యం ఆలోచనా పరుల మేధావుల హృదయాలలో వ్యాపించింది. ఈ చైతన్యం ప్రథమతః గురజాడ అప్పారావులోనే

అభివ్యక్తి పందుకుంది. ఇవన్నీ కొయ్యబొమ్మలను మెచ్చుకళ్ళుగా సంప్రదాయ వాదుల నాయన పోల్చుకున్నారు. 19వ శతాబ్దపు చివరిదశలోనే తన వీక్షణా కాంతుల్ని దిగంతాలవరకూ ప్రసరించారాయన. ఆయన సమ్యక్ దర్శనుడే కాక క్రాంతదర్శిగా కూడా ప్రధమ దర్శనమిచ్చాడు.

రాగల శతాబ్దంలో రేకు విప్పనున్న భాషావిప్లవానికి సమగ్ర ప్రణాళికను సిద్ధపరచారు. ఆ ప్రణాళిక 1897లో ప్రచురితమైన కన్యాశుల్కం మొదటి పాఠం లోనే సంపూర్ణ స్వరూపం పొందింది. రాబోయే అభినవ భావాభివ్యక్తి రీతికి ఆద్యులయ్యారు.

గతాను గతికంగా సుళ్ళు తిరుగుతున్న కవితా పరిభాషకు కాలదోషం పట్టిందన్న సత్యాన్ని గురజాడ గ్రహించి ఎలుగెత్తి చాటడమే కాక, నవీనపంథాను తర్వాతికరం కవుల కందించారు. తెలిసో తెలియకో గురజాడ పక్షానికి వచ్చి, కవితాపరమైన విమూత్న పరిభాష అవసరాన్ని ఆనాటి జీవత్కవులు గుర్తించారు. వేంకట పార్వతీశ్వర కవులుగాని, రాయప్రోలు సుబ్బారావుగారు కాని, అబ్బూరి రామకృష్ణరావు గాని కావ్యభాషమారడం, ఎంత అవసరమో గుర్తించారు.

ప్రజల నిత్య వ్యవహారపు సరిహద్దుల్లో ప్రకాశించకపోతే కావ్యభాష స్థాణుత్వమందుతుంది. చలామణీ ఉన్నప్పుడే పదానికి నాణెంలా విలువ ఏర్పడు తుంది. కేవలం ప్రాచీన కావ్యాలలో మాత్రమే కనిపించే భాష శిలీభావరూపమే. దానికి నైశిత్యం లేదు. అది నూత్నకావ్యాలలో ప్రయోగింపబడితే సత్వరాభి వ్యక్తిని సంచలనాత్మశక్తిని సంతరించుకోదు. ఈ సత్యాన్ని గుర్తించిన వారే జీవత్కవులుగా రాణించారు. సృజనాత్మక కవితానిర్మాణానికి మృతపదాలు కొత్తగా పనికిరావని గుర్తించినవారిలో కృష్ణశాస్త్రి ప్రముఖులు. ఏ పదమైనా అతిగా వాడటంవల్ల మొనలు అరిగిన వజ్రంలా మెరవడం మానివేస్తుంది. కాంతి విహీనమవుతుంది. ఒక ప్రాజ్ఞుడైన కవి తన కవితాభివ్యక్తికి అనుకూల వాహన మైన భాషను తానుగా రూపొందించుకుంటాడు. ప్రజలదైన భాషాభాండారం అమేయంగా తనకై నిరీక్షిస్తోందని గ్రహిస్తాడు. ముఖ్యంగా నవీన యుగంలో ప్రతిభావంతుడైన ప్రతికవీ నిరాడంబరంగా అన్వేషిస్తూనే ఉంటాడు. అంటూ కృష్ణశాస్త్రి ఒక ఉపన్యాసంలో తెల్పిన అభిప్రాయం ఎన్నోరోజుల ఆలోచనా ఫలితమే. గతానుగతికమైన సంప్రదాయ బద్ధులైన కవులుటజస్సుందరమైన ప్రతి భను ప్రదర్శించనే లేకపోయారన్నది ఈ శతాబ్దపు సాహిత్యాన్నంతా పరిశీలించిన వారికి బోధపడుతూనే ఉన్న సత్యమే. అట్టివారు ఈ శతాబ్దంలో పుట్టిన వారైనప్పటికీ ఆధునిక శబ్దవాచ్యులు కాలేరు సరికదా కవీసం నవీనులైనాకారు.

కవితాభావన పదాశ్రయమే, సందేహం లేదు. అనూచానంగా తనకు లభించిన పాతపదాలనూ, సమాసాలనూ, సాంప్రదాయిక పదబంధాలనూ, రూప

కాలనూ, ప్రయోగిస్తూ పోయే కవి ఎన్నడూ కొత్తభావానుభూతిని ప్రచలితం చేయలేడు. కనుకనే ప్రతి ఉత్తమకవి సమకాలీన సామాజికుల హృదయ సంచలనాన్ని ప్రతిబింబింపదలిస్తే తన కవితాభివ్యక్తికి భూమికగా నిలువవలసిన భాషను స్వీయముద్రతో సారభూతం చేసుకుంటాడు. ఆ కృషిలో ఆరితేరినవాడే ఉత్తమకవిగా గణ్యతనూ పూజ్యతనూ పొందుతాడు కృష్ణశాస్త్రి శబ్దశిల్పంలో గల అంతఃసూత్రమిదే. ఈ రహస్యంవల్లనే వందల కవుల్లో ఒక్కడే కృష్ణశాస్త్రిగా విశిష్టత నార్జించుకున్నారు.

ఈ కీలకం గ్రహించలేని సంప్రదాయ మౌఢ్యులు వందలాదిగా వచ్చిన దారినే వెళ్ళిపోయారు. కొందరు బ్రతికిన కాలంలో ఎంతో పలుకుబడిని సాధించుకున్నారు, బిరుదులూ కైవారాలూ పొందారు. రాజభోగాలు అనుభవించారు. కాని కన్నుమూసేసరికి కాలం కాటువేసి గర్భస్థం చేసేసుకుంది.

ప్రతిభావంతుడైన ప్రతికవీ ఆనుపూర్వికభాషాబంధాల నుంచి తన కవితాహృదయాన్ని సంరక్షించుకు తీరాలని కృష్ణశాస్త్రి పదే పదే చెప్పేవారు. చెప్పడమేకాదు, భాషాపరంగా కాని, భావపరంగా కాని, అలాంటి సృజనాత్మక ప్రతిభనే ఆయన ప్రదర్శించారు. ప్రాబంధికుల క్షీణభాషాటోపంనుంచి తన కవితాహృదయాన్ని విముక్తం చేసుకున్నారు. తన దైన విన్నూత కవితాభివ్యక్తిని ప్రయుక్తం చేసుకున్నారు విస్పష్టంగా వినిపించే తనదైన బాణీయిది అనేముద్రతో కావ్యాన్నికాని లలితగీతాన్నికాని వచనాన్నికాని, ప్రసంగాన్నికాని మొత్తానికి తన వాణినే విశిష్టంగా సంతరించుకున్నారు లలితహృదయ తంత్రీప్రకంపనం కలిగించగలిగారు.

వారి కవితలు సనాతన వాదులనుంచి సంప్రదాయక వయ్యాకరణులనుంచీ ఎంత తీవ్రవిమర్శలందుకున్నా జనహృదయవిశేషాలయ్యాయి. రసజ్ఞహృదయాలకు మనోరంజకాలయ్యాయి. సమకాలిక యువహృదయాలను పాలించాయి. ఇదే యువహృదయ జాజ్జ్వల్యవాణి అనిపించుకున్నాయి. జాతి కన్నులకు ముందు చూపుగా తనరారాయి. ఒక చారిత్రక పరిణామదశలో నిశ్చల మార్గదర్శకాలుగా నిలచి—ఇరవయ్యో శతాబ్దానికే కలికితురాయి కీలించాయి.

కృష్ణశాస్త్రి తన కెదురుగా స్థిరపడివున్న ఆంధ్ర భాషను తన భావ కమతూల కవితా భాషగా శిల్పీకరించుకుందుకు ఏంచేశారు? సంప్రదాయ కావ్యభాషా మహాసాగరపు లోలోతులకు మునిగి రత్నాలనూ, మౌక్తికాలనూ ప్రవాళాలనూ ఏరుకొని తెచ్చుకున్నారు వేరువేరుగా తన హృదయపు పొరుగులలో కేటాయించుకున్నారు. తెలుగు భాషలో కలగలిసిపోయిన బండబాదుళ్ళ పెటుకు శబ్దాలనూ, రాంధోళ్ళ కఠోరపదాలబాదరబందీలనూ దూరంచేసి స్వాప్తి చెప్పారు. చిన్నదీపంతో పెద్దకాంతిని ప్రసరించే శక్తిని తన పదాల కాపాడించుకున్నారు. అదువిత కావ్య

భాషగా తెలుగుకు ఒక సౌకుమార్యాన్ని చేకూర్చుకున్నారు. మాట మాటకూ నడిమిశూన్యంలో ఒక అనుభూతి హోరును దట్టించి, మాట పక్కనిలవగలిగే మాట తూకం పరిచూసుకొని— కవితాపాదానికి ఒక అపూర్వసువిశితత్వాన్ని సంతరించారు జటిలపదాలకు పెటుకు సమాసాల పెద్ద బాడిత పని కాక- సన్నని గారతో అతికుశలంగా దంతపు బొమ్మలు చెక్కే శిల్ప విజ్ఞానాన్ని ప్రదర్శించారు. ఒక మాటతో చెప్పాలంటే—తెలుగును మధ్యయుగాల భూస్వామ్యరాచరికపు ప్రబ ధకారాగృహాలనుంచి విడిపించి, ప్రపంచనాగరీకభాషల స్థాయికి సమర్థరించారు. అనాగరిక కచకుచవర్ణనలకు, పాశవిక శృంగార ప్రదర్శనలకూ ఉద్వాసనపలికి. హార్ధికానుభవాల మంజుల నాటికలుగా తమ కవితలను తీర్చారు. సరళమురళీనాదంతో హృదయతంత్రుల్ని ప్రత్యక్షంగా మీటగలిగే కిటుకు గ్రహించారు సున్నితమూ సుకుమారమూ అగు మనోజ్ఞభావనకు అపూర్వంగా స్థానం కలిగించారు.

పాత కావ్యభాషను గట్టిగా కుదిపి ఆయన సంక్షుభితమొనర్చినపుడు తరం నుంచి తరానికి అల్పంగానైనా మార్చుకుంటున్న జీవన ధాతువుల నాడి ఆయనకు చిక్కింది. అలా కలగలిపిన భాషాద్రవాన్ని తిరిగి తేరుకోనిచ్చి నూత్న రసాయన శక్తి దాని కందించి ప్రణుతివహించారు. ఆయన కవితారంగంలో ప్రవేశించక పూర్వం నత్తనడక నడచిన తెలుగు కవిత—కృష్ణశాస్త్రి అనే సముజ్జ్వల కవితా తరంగ ప్రవేశంతో నూత్నజవసత్త్వాలు చేకూర్చుకుంది. వేయి గుర్రపుకొదమల బలంతో లంఘించింది- అమేయమైన ఆంధ్ర సాహిత్య చరిత్రలో కృష్ణశాస్త్రి సముపార్జించుకొన్న అత్యంత విశిష్టస్థానం అదే:

మధ్యయుగాల భూస్వామ్య వ్యవస్థ పాదుకొల్పిన సామాజిక నీతులపైనా, ద్వంద్వ ప్రమాణాలపైన, ఛాందస భావనా పరికరంపైనా, మూఢ విశ్వాసాలకు లోబడిన ఆలోచనా ధోరణులపైనా తిరుగుబాటుగా రూపొందిన భావకవిత్వానికి కృష్ణశాస్త్రి ప్రత్యక్షమూర్తి భావం. ఇటు అనుకూలురూ, అటు వ్యతిరేకులూ విస్పంటేహంగ అతడినే ప్రధాన కేంద్రంగా గుర్తించారు. ఛాందసులూ, సనాతన తిరోగమనవాదులూ, పరప్రత్యయనేయబుద్ధులూ కృష్ణశాస్త్రినే—భావ కవిత్వం మొదల కర్ణవిగ భావించి తమ అస్త్రశస్త్రాలు ప్రయోగించనారంభించారు. ఆయన పైనే కువిమర్శల బండరాళ్ళన్నీ దొర్లించారు. నిందించీ, గేలిచేసీ, అపవాదులు ప్రచారంచేసీ తమ పబ్బం గడుపుకొన్నారు. ఆయన హరిజనసేవా పరాయణతకు కినిసి స్థానికులు సంఘ బహిష్కరణ కావించారు. ఆవిధంగా తమ కడుపు మంటలు చల్లార్చుకున్నామనుకున్నారే కాని, ఈ అక్కిరాజులూ కాశీభట్లులూ కృష్ణ కీర్తి ధ్వజ వాహకులవుతున్నామన్న సత్యాన్ని మరో దశాబ్దానికికాని గుర్తించలేకపోయారు.

సనాతన వాదులు కృష్ణశాస్త్రిపై అంతగా విరుచుకుపడటానికి ముఖ్య కారణాలు రెండు. ఒకటి కాల్పనిక వాదకవులు మొత్తంగానూ, కృష్ణశాస్త్రి ముఖ్యంగానూ కావ్యప్రపంచంలో స్థిరపడిన అభివ్యక్తి రీతులను ప్రమాణాలనూ తృణీకరించారు. రెండు—ఇతివృత్త స్వీకరణలో అనవద్యంగా వ్యక్తి స్వేచ్ఛకు శిష్టసాహిత్యంలో ప్రాణప్రతిష్ఠ చల్పారు. అంటే కవితలో సంప్రదాయవాదానికి మారుగా రీతిలోనూ వస్తువులోనూ ప్రయోగవాదాన్ని ప్రవేశపెట్టారు. సనాతనత్వానికి బదులుగా ఆధునికత్వాన్ని ఆవిష్కరింపచేశారు. ఈ కారణాలవల్లనే యిటీవలికాలంలో వైశ్వనాథులంతా ఒక్కమ్మడిగ గురజాడ మొదలు కృష్ణశాస్త్రి వరకూగల ప్రయోగవాదులందరినీ 'అకవు'లని ఏకరువు పెట్టారు. లలిత పద ప్రయోగం ఒక్కటే కవిత్వంకాదని కృష్ణశాస్త్రిని నిందించారు.

కృష్ణశాస్త్రి కన్యాశుల్కం పుట్టిన రోజులలోనే అవతరించారని చెప్పుకు న్నాం అప్పుడప్పుడే విస్మాత వాతూలాలు అన్ని కోణాలనుంచీ ధైర్యంగా వీచు తున్న రోజులవి. కృష్ణశాస్త్రి కవితాహృదయం బాగా మేలుకొన్న ప్రారంభ యౌవనపు తొలిదశ 1915 ప్రాంతం. కాకినాడ కాలేజీలో బ్రహ్మర్షి రఘుపతి వేంకట రత్నంగారి అంతేవాసిత్వంలో కన్నులు విప్పార్చుకుంటున్న రోజులు. అప్పటికి వీరేశలింగంగారి వితంతూద్వాహ మహోద్యమం నిరాటంకంగా విల దొక్కుకుంది. సంఘ సంస్కరణ పతాక నిర్నిరోధకంగా రెపరెపలాడుతోంది. మన ధర్మశాస్త్రం నాటి వర్ణాశ్రమ ధర్మాల ఉక్కు చట్రాన్ని కూలుస్తోంది. హేతువాదం సర్వ ఆచరణలకూ ప్రాణదీప్తి కలిగించి స్వేచ్ఛ నందిస్తోంది. బ్రాహ్మ మత ప్రచారంతో గుడి గోపురాలకూ మూఢ విశ్వాసాలకూ గిరాకీతగ్గింది. వీరేశలింగం వీర యోధునివలె తెలుగు దేశం నిండా క్రమ్మిన బ్రహ్మచెముడు డొంకల్ని నరకి అందచందాలు తీర్చుతూంటే బ్రహ్మర్షి రఘుపతివారు ఈ మహోద్యమానికి హార్దిక ద్రవ్యాన్ని అందిస్తున్నారు. తాత్త్వికప్రత్యయాలనన్వేషిస్తు న్నారు. ఆధ్యాత్మిక సోపానాలమరుస్తున్నారు. వీరేశలింగం ప్రచండార్కుడైతే— రఘుపతి సౌమ్య శీతల సుధాకరుడు. యుగపురుషుని ప్రజ్వలిత కాంతిలో తేజ స్వంతమై, మహాకవి గురజాడ చూపిన వెలుగు జాడలను స్వాయత్తమొనర్చు కొని, బ్రహ్మర్షి ఉపదేశామృతంతో పునరుజ్జీవన మందిన నవీన యుగ హృద యంగా కృష్ణశాస్త్రి గొంతెత్తారు. కావునే శిథిలాలయమ్ములో శివుడు లేడోయి అని గొంతెత్తి జాతికి పిలుపిచ్చారు. కలుషదుర్దాంత పంక సంకలిత కుహరముల జనించు అశ్రు మలినధారలే స్వామి పాద దేశమున పారి పరమజాహ్నవి కాగల దని చాటాడు!

1920కి పూర్వం, అంటే వీరేశలింగంగారు తమ అవతారం చాలించేనాటికి మన మేధావి వర్గంలో కొంత కర్తవ్యతా విమూఢత్వం వ్యాపించివుంది. ముఖ్యంగ

రాజకీయ పరిస్థితుల పట్ల అవగాహన లోపించిందనే చెప్పాలి. లోకమాన్య తిలక్ అందించిన స్వాతంత్ర్య శంఖారావం జాతి జీవనాడులన్నిటికీ వ్యాపించలేదు. ఖిలాఫత్ మహోద్యమ కాంతులుకాని ఛాయలుకాని జాతిపై ప్రసరించలేదు. గాంధీజీ భారత రాజకీయోద్యమ ప్రవేశం తర్వాతనే స్వాతంత్ర్య పోరాట దీక్ష ప్రజల పరమైంది. అట్టి 1920కి పూర్వ పరిస్థితితోగల సంధిగ్ధావస్థ కృష్ణశాస్త్రి కవితాహృదయాన్ని సైతం లోగొనకపోలేదు.

మేధావి వర్గంలో ఆంగ్ల ప్రభువులపై ప్రభుభక్తి పరాయణత దాదాపు సార్వత్రికంగా వ్యాపించిఉంది. సామాజికంగ అస్తవ్యస్తస్థితి కొనసాగుతోంది. అందుకే ఈ కవి తన ప్రారంభ యౌవనంలో ఊరుకుంటే అడవినే వాంఛనీయమనుకొన్నాడు. మానవ లోకం కంటే నవ్య ప్రకృతినే వాసయోగ్యమనుకొన్నాడు. లోకాన్ని కాలాన్ని విడిచి వనాంతర సౌందర్యానికి వివశుడై నిర్లిప్తుడుగా నారంభించాడు. ప్రారంభయౌవనంలో గార్హస్థ్యంకన్న వానప్రస్థం ఆరాధ్యంగా భావించాడు ఇవన్నీ భావుకునికి బుణధృవ వైఖరులే; అది అంతవరకే;

కృష్ణశాస్త్రి కవిత్వం ఆరంభంనుంచీ మహోజ్వల తరంగంగానే గుర్తించబడింది. ఆయన గొంతెత్తి వినిపించిన ప్రతి పిలుపుకూ లక్షోపలక్షల ప్రతిధ్వనులు విస్తరించాయి. ప్రతి పదం విశిష్టముద్రను నిర్ధరించుకుంది. సొంత యాసనీ, సొంత బాణీని సంతరించుకున్న విస్పష్టరేఖ. వేయేళ్ళ కవిత్వ చరిత్రలో తన దైన రీతిని సాధించుకొన్న అపూర్వ భావుక నైశిత్యాన్ని ప్రస్ఫుటమొనర్చుకొన్న భావకవితా చక్రవర్తి కృష్ణశాస్త్రి; తన నవీన కవితా భావుకతకు మృతపదాలు పనికిరావని నూత్నరీతిని సంతరించుకొన్న క్రాంత దర్శి ప్రాబంధికుల క్షీణ భాషా పటాటోపంనుంచి, కవిత్వాన్ని రక్షించిన వాడాయన. కొత్త నగిషీ బుటా పనితనంతో మాటలకు నూతనోజస్సు చేకూర్చి భాషాబంధం నుంచి కవిత్వాన్ని విముక్తం జేసిన తేజస్వి; ఒక చారిత్రక పరిణామ దశలో ఒక నిశ్చల మార్గాన్ని నిర్దేశించిందాయన కవితా వాణి; ఇదొక్కటే చాలు, ఆయన విశిష్టమూర్తి మంతనానికి ఏవాళతెత్తడానికి.

అలనాడాయన ఆకులో ఆకుగా మారి అడివిలో ఆగిపోవాలనుకున్నారు. అలా ఆగిపోవడం నిజానికి పర్ణశాలను నిర్మించుకుందుకు కాదు. తపస్సు చేసుకుందుకూ కాదు. గల గలమంటూ వీచే చిరుగాలిలో కెరటం కావడానికి; జలజలమని పారే సెలయేటిలోని కెరటపు తేట కావడానికి; పగడాల చిగురాకు తెర చాటులో తేటిగా హాయిగా ఎగరడానికి;....గాని జీవిత యథార్థం అలా బ్రతకనిస్తుందా? "క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య శృంఖలాలు గలగల మ్రోగుతాయి కరకర నవ్వుతాయి. ఈ పాదంలో గల దాస్య శృంఖలాల కాఠిన్యాన్నీ కఠోరతనీ తెలపడానికి నాలుగు కవర్ణంతో ప్రారంభమైన పదాలున్నాయి; అర్థంతో

నిమిత్తం లేకుండానే చెవికి వినిపించే శాబ్దిక కాఠిన్యత ద్వారా భావాభివ్యక్తి కావించే మార్గం. బ్రతుకు కటికతనానికి నిదర్శనాలు; తన స్వేచ్ఛకు ఏవేవో కనిపించని అవరోధాలు; ఈ ఆత్మ చైతన్యం బాహ్య వాస్తవికతా జన్యం. కవి దర్శనను మార్చివేసింది. కనుకనే "జగమునిండ స్వేచ్ఛాగాన ఝరుల" నింప డానికి ఉద్యుక్తులయ్యారు.

"పతిత వెట్లౌదు; నేనెట్లు పతినౌదు;" ఇంతటిలఘుపదాల పోహళింపులో అలఘు భావనా వ్రాతం ఎలా ఆవిష్కృతమైందో సహృదయ సమభావుకుల కర్థ మవుతుంది. ఎంత సునాయాసంగా దానినాయన సాధించగలిగారో శిల్ప మర్మజ్ఞు లకు అవగతమవుతుంది. తెలుగుపదాలతో కట్టిన సరళ సమాసాలన్నీ పదిలంగా అల్లుకొన్న పొదరిళ్ళు స్వాదు మురళీనాదాన్ని ఉరలించే సూర్యసుతా ప్రవంతికా తరంగాలు; హృదయ తంత్రుల నలవోకగా మీటించగల మహతీ మహత్వాధికారి ఆయన.

భాషను ఆధునికరించడంలో శక్తివంతమైన వారసుడు ఆయన. అందుకే ఆయన తెలుగు కవితా చరిత్రలో మహోజ్వల ఘట్టాన్ని ఆవిష్కరించగలిగారు. చిరంతన దీప్తుల వెలయించ కలిగారు. ఇరవయ్యవ శతాబ్దపు తెలుగు కవిత్వానికి ఆయన అలంకరించిన కలికితురాయి ఆదే!!

# నాలుగో ప్రకరణము

## కృష్ణశాస్త్రి కవితా హృదయము

### ఒక త్రివేణీ సంగమం

కృష్ణశాస్త్రి కవితా పరంపరలో మనకు ప్రధానంగా మూడు ఉద్యమాల పాయలు సాక్షాత్కరిస్తాయి. తదనుగుణంగానే అవి ఆయన కవితకు యితి వృత్తాలై ప్రాణజ్యోతులు వెలిగించుకున్నాయి. విస్పష్టంగా దర్శనమిచ్చే ఆ మూడు ఉద్యమాలూ ఈ విధంగా పేర్కొనవచ్చు:

1. నవ మానవీయ మహోద్యమం
2. వ్యక్తి స్వేచ్ఛ, ఆత్మాశ్రయ ప్రేమ కవిత్వం
3. లోకవృత్తి ప్రదర్శనంలో అభ్యుదయ దర్శనం.

విస్పష్టంగా దర్శనమిచ్చే యీ మూడు ప్రధాన ఉద్యమాలూ ఆయన కవితా హృదయంపై చారిత్రక పాత్రనే వహించాయి. ప్రభావ ముద్రలు పుంజీభవించుకున్నాయి. ప్రధాన ఇతివృత్తాలై కవితా హృదయాన్ని ఆవిష్కరింపచేశాయి. వాటివి వివరించుకోవడం అవసరం.

## 1. నవ మానవీయా మహోద్యమం:

కృష్ణశాస్త్రి కవిగా కన్ను తెరచిన ప్రారంభ యౌవనపు తొలిరోజులు మన దేశానికి బ్రాహ్మ మతం కొత్త జేగంటలు వినిపింపచేస్తోంది. వ్యక్తి నవ చైతన్యావిర్భావంతో లోకాన్నీ కాలాన్నీ కొత్తచూపుతో పరిశీలించుకొనే వయసులో ఈ మహోద్యమం సహజంగా ఆయనపై తన ప్రభావాన్ని ప్రసరించింది. గతానుగతికంగా అనాటివరకూ సమాజం కునారిల్లిపోతోంది. అనవసరపు ఆచారాల ఆచ్ఛాదాలతో ఊపిరి సలపడం లేదు. అనమానవతల బ్రహ్మచెముడు డొంకలతో సమాజ కేదారం నిండిపోయింది. ఆలోచనా పరులకది కంటకావృత సీమగా

స్పష్టపడుతోంది. మధ్య యుగాల భూస్వామ్య వ్యవస్థ సాంఘికాచారాలనే పేర తన దురన్యాయాలను సాగిస్తూనే ఉంది. అట్టిసమయంలో బ్రహ్మసమాజం ఆవిర్భవించింది. యావద్భారతదేశంలోనూ సాంఘిక విప్లవానికి ప్రేరణ కలిగించింది.

మతంమీద, సామాజిక న్యాయ వ్యవస్థమీద చేసే తిరుగుబాటు ప్రాథమికమైనదే. కాని అదే సకల విప్లవాలకూ మాతృత్వం వహించగలిగేది వేదకాలం నాటిదని భ్రమచెందుతున్న మధ్య యుగాల వర్ణాశ్రమ ధర్మాలు అప్పటికే కొన ప్రాణంతో కొట్టుమిట్లాడుతున్నాయి. బ్రతకాలని సంఘర్షిస్తున్నాయి. హిందూ సమాజం తన కులతత్త్వపు ఏర్పాట్లకు తానే బలికానున్న తుదిరూపం విస్పష్టం కాజొచ్చింది. కులాల ఎక్కువ తక్కువలు, అంటరానితనం వంటి సామాజిక ధర్మాలు అధర్మాలుగా పరిగణింపబడుతున్నాయి. పసితనపు పాలగుమ్మలయినా తాము చేయని నేరానికి వితంతువులుగా జీవితాశలను ఖండించి, శాశ్వత శిక్షకు గురిచేయడం పరమ ఘాతుకంగా గుర్తింపబడుతోంది. ఇలాంటి సాంఘిక దురన్యాయాలనన్నిటినీ ఎదిరించిన రాజారామ్ మోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్‌ల ప్రభావం యావద్దేశంపైని ప్రసరించింది. తెలుగుజాతి తన మహావీరుడు వీరేశలింగం ముఖతా తన తిరుగుబాటు జండా ఎగరవేసింది. ఆయన సాంఘిక సారస్వత రంగాలలో ఏకైక నాయకమణిగా మెరుస్తున్న రోజులు. ఆ రోజులలో కృష్ణశాస్త్రి ఆరంభ యౌవనంలోనికి మేల్కొన్నారు. సకల బానిస బంధాలనూ తుత్తునియలు చేయడమే తన పరమ బాధ్యతగా గుర్తించారు. దానికి వారే సచేతన ధ్వని ప్రకటించారు

"నవ్య కవులకు స్వేచ్ఛ ప్రాణము. వీరు ప్రాణమైన కోల్పోదురుగాని, శృంఖలముల ధరింపరు వీరికి ప్రాణముకన్న గానము తీపు సంకెలలో సంగీతమా కట్టుబాటులో కవిత్వమా?" అని ప్రశ్నించుకుంటున్నారు కృష్ణశాస్త్రి ఈ ప్రశ్న వారికి కాకినాడలో 1915-1916లలో ఎఫ్ ఏ చదువుతున్న రోజులలోనే అంటే రఘుపతి వెంకటరత్నంగారి అంతేవాసిత్వంలోనే కలిగింది. మరి ఐదేళ్ళకు ఏకాంత సేవ పీఠికలో అక్షరాకృతి నందుకుంది

ఆ తొలిరోజులలో బ్రాహ్మ మతావలంబికాని యువ మేధావి దాదాపు లేనే లేడని చెప్పవచ్చు. విశిత దృష్టికల కృష్ణశాస్త్రి సహజంగానే తమ ప్రారంభ యౌవనంలో బ్రాహ్మసమాజ ప్రభావానికి లోనయ్యారు. తమ భావుక హృదయానికి మరింత నైశిత్యం సముపార్జించుకున్నారు. ఈ ప్రభావానికి మూడు ప్రధాన కారణాలున్నాయి. ఒకటి-ఆనాడు సంఘ సంస్కరణ పతాకను మోస్తున్న నగరాలలో ఈ కవి జన్మస్థలి పిఠాపురం ఒకటి కావడం రెండోది, వీరేశలింగం శంఖారావంతో వినిపిస్తున్న నవీన ధర్మబోధ యువ హృదయాలను ఆకర్షించడం.

మూడోది-కాకినాడ కాలేజీ చదువువల్ల బ్రహర్షి రఘుపతి వెంకటరత్నంగారు ఆంగ్ల సాహిత్యంలో గల అపురూప శోభల్ని ఆకర్షణీయంగా బోధించడమేగాక నూత్న ప్రజాస్వామ్య ధర్మాలను కూడా విద్యార్థులకు బోధించడం. దీనితో కృష్ణశాస్త్రి సాంఘిక సారస్వత రంగాలలో నూత్న దృక్పథాన్ని సంతరించుకోగలిగారు. కవిత్వంలో తానుగా ఆవిష్కరించగల నూత్న కోణాలేమిటా అనే అన్వేషణ ఆయన హృదయాన్ని కలవరపరచనారంభించింది. అభినవయోచనా ఝరులు ముంచెత్తనారంభించాయి.

అప్పుడొక సద్యఃస్ఫూర్తి లభించింది. బ్రాహ్మమత ప్రభావం కృష్ణశాస్త్రి కవితలో ప్రధాన యితివృత్తమైంది. ముఖ్యంగా ప్రారంభ దినాలలో యిది మరీ స్పష్టంగా వారిలో ఉన్నత చైతన్యాన్ని ఆవిష్కరించింది: కన్నీరు, మహతి, మున్నగు గీతికా గుచ్ఛాలలోనూ కృష్ణపక్షంలోని కొన్ని కవితలలోనూ ఈ ధోరణి స్పష్టంగా దర్శనమిస్తుంది.

ఈ నవీన మానవీయమతానికి ఏకేశ్వరోపాసన ప్రధానభూమిక. ఇదే చాలు ఛాందసవైదికమత వాదులలో నిరీశ్వరవాదంగానూ, నాస్తిక ధర్మంగానూ అపభ్రంశం చేయబడటానికి. దానికి సాయం సాంఘిక అసమానత్వాన్ని, దురాచారాల్ని ఖండించటమొకటి. ఇక కావలసిందేమిటి హిందూ పాషండులకు? నిప్పు తొక్కిన కోతులయ్యారు బ్రాహ్మమతానికి మరో ప్రధాన ఆధారభూమిక, సంస్కరణ ప్రియత్వం. ఇది సనాతనులలో ప్రతిచర్యను ప్రేరేపించడమే కాక సమరశీలతకే పురిగొల్పింది.

ఆనాటి వరకూ సమస్త సాంఘిక దురాచారాలలోనూ భాగస్వామిగా మనుతున్న వ్యక్తి ఈ నవీన దర్శనంలో తానెంత పాపిగా బ్రతికాడో తెలుసుకున్నాడు. నవ్యచైతన్యంతో చిదానంద మంగళ స్వరూపుడైన భగవానుని మ్రోల తన హృదయ కల్మషాన్ని బాష్పవారితో క్షాళనం చేసుకోపూనుకొన్నాడు. ఈ ఆత్మజ్ఞానం కృష్ణశాస్త్రి ఆనాటి పాటలకు ప్రధానపాత్ర వహించింది. ఈ కొత్తగొంతు నవీనస్ఫురణగా దర్శనమిచ్చింది.

భగవానుడు హృదయనాథుడు. తారకారత్నభాసుర తారహార సుప్రభా మాలికాజాల శోభితుడు. రాజరాజేశ్వరుడు. ఆ ప్రభువుకు తానేమి కాన్కలీయగలడు? అతని పద సరోజ మృదురజోలేశదివ్య సంపదను వలచి, తలచి వీధి వీధులలోనూ, వాడలలోనూ, విపినాలలోనూ భిక్షుకునిగ తిరుగాడుతున్న పేద. గాఢ లజ్జాను తాపసంకలిత హృదయ నీరజదళాల రాలేకన్నీటి చుక్కను మాత్రమే కానుకగా సమర్పించగలడు. ఈ గాఢలజ్జానుతాపం ఎందుకు? యుగయుగాలుగా తనజాతి మానవత్వానికి కలిగించిన మహాపరాధానికి. అందుకే కన్నీటి చుక్కను కాన్కగా ఇస్తాడు.

నిరాకారుడూ నిర్వికల్పుడూ అగు ఆ ప్రభువును ఎలా ఊహించాలో తెలియక 'వంగి వంగి శిరమువాంచి కుర్గింగి' పోతున్నాడు కవి. 'రత్నమాణిక్య కాంతి నీరేజనార్చితాంఘ్రి నీరేజయుగళు' డా ప్రభువు. కాని చింపిపాతలు కట్టుకున్నాడు. 'జీర్ణపటకుటీర పాళికా ప్రాంగణాల'లో నివసిస్తున్నాడు. నిరుపేదలతోకూడి బ్రతుకుతున్నాడు. దిక్కుమాలినవాని వలె ఇంటింటికీ తిరుగుతున్నాడు. బిచ్చమెత్తుతున్నాడు. అతని చేతలు చిత్రాతి చిత్రాలు. అలాంటి ప్రభువు నెలా ఊహించగలడు. కలుషబాష్పకాల్లో నిపీ కణాలలో తళుకు తళుకని నాట్యాల సలిపేది అతని అనంత రాగాంశుమాలికా కాంతి. క్షామ దేవత నిశ్వాసధూమపటలిలో ఆ కాంతి చల్లగా వెల్లి విరుస్తుంది. అతని భవ్యకరుణార్ద్ర వీక్షణ పరిమళాలు అంతటా వ్యాపిస్తాయి. చండతర మృత్యుగంభీర గర్జరవాలలో సైతం సవ్యవిపంచిలా అతని కరుణ పల్లవిస్తుంది. అతని కంఠమంజు రవం మాధురుల చిమ్ముతుంది అతని చేతలన్నీ చిత్రాతి చిత్రాలు. మౌనల గానాలకు మారు మాటాడడు ఇంచుకంతయినా మనసీయడు. ఆశ్రితజనావళి నమ్రసేవలకు అలరి తలవూపడు. ధనాంధసార్వభౌముల పూజావిధానాలు మెచ్చనైనా మెచ్చడు. వాళ్ళను కన్నెత్తి చూడడు. అట్టి చిత్ర విచిత్ర వర్తనుడైన ఆస్వామిని కవి ఎలా ఊహించగలడు? అందుకే వంగి వంగి క్రుంగిపోతున్నాడు

మలిన బాష్పాలరాల్చి, హృదయార్తి వెలికుబికితే ఆ బాష్పమౌక్తికాలలో తారకానివహమే ప్రతిబింబిస్తుంది. ఉన్నతోన్నత పథాలు దిగివచ్చి నటిస్తుంది. తాను పాపి. తనవంటి సామాజికులంతాపాపులు. తమ హృదయార్తిని ఆ దేవదేవునికి నివేదించుకోవాలి. తమ కన్నీటితో మోడుమ్రాకులే చివురులెత్తుతాయి. తళతళమంటూ మురిసిపోతాయి. తరతరాల నీచదాస్య శృంఖలాలలో మసిన తమ హృదయాలలో భరింపరాని లజ్జ ఘనీభవిస్తోంది. ఆ మసగతెరలదాటి ఆశా కిరణాలతో చందమామ నవ్వుల వెన్నెల ప్రసరిస్తుంది. ముందుదారి కానరాని తాను 'రారాస్వామీ' అని కంఠమెత్తి ఆక్రోశిస్తే సమశ్రుతిగా గగన వీథులలో గంధర్వులు గొంతుకలుపతారు. తాను పశ్చాత్తాప విదగ్ధమానసుడై కన్నీటిని కురిస్తే ఆ బిందువులన్నీ మంచి ముత్యాలుగా మారిపోగలవు. పరమేశ్వరుని కంఠసీమ నలంకరించగలవు.

భక్తుని కన్నీరు సామాన్యమైనది కాదు. పంక సంకలిత కుహరాల జనించినా కూడా పరమేశ్వరుని పాదదేశంలో ప్రవహించి పరమ పావన జాహ్నవి ప్రతిభలందుకోగలదు అయితే ఆ కన్నీరు యెట్టిది? గాఢమైన లజ్జవల్ల, దుఃఖార్తి వల్ల, కనులనుంచిజారే ఉష్ణాశ్రు శీకరాలు హృదయాన్ని కలచి బయల్వెడలినవి, సాంద్రశోణిత బిందువుల వర్షంగా కురిసినవి. ఆ వేడి కన్నీటి చుక్కల్ని తాన

కీన పదన రోజ దళములందు నిలువనిమ్ము అని కవి ప్రార్థిస్తాడు నలుదిక్కులా ప్రసరించే నేత్రావుల కమ్మదనాన్ని త్రాగనివ్వమని ప్రభువును వేడుకుంటాడు.

కృష్ణ పక్షంలో నాకాన్క, క్రుంగిపోదు. పాపీ కన్నీరు—అనే నాలుగు కృతులేగాక ఏకేశ్వరోపాసనకు సంబంధించిన మరికొన్ని ఉన్నాయి. స్వాదు సంగీత కలనాద, ఈ నిశీధి మధ్య ఏను గాలింపు నిద్దురలోన అనే ప్రారంభపదాలు కలవి వీటికి శీర్షిక లీయలేదు కవి జీవితంలో అడుగడుగునా ఎదురయ్యే వైరుధ్యమూ, నికృష్ట సామాజిక మానవుల దుర్భర జీవితమూ, రసహృదయుల స్వాప్నిక కళాసాక్షాత్కారమూ ఈ కృతులలో ధ్వనింపబడుతుంది.

''ఎటుల నేనీలీల కీర్తింతు ఓ దేవ దేవా
ఎటుల నేనీ ప్రేమాల నర్తింతు కటకటాలిను
దలచి తలచి కదల లేదే కంఠరవము''.

అంటూ ధైర్యంతో తన హృదయ పరిదేవనలను సమర్పిస్తాడు. కృష్ణశాస్త్రి భక్తి సామూహికార్తికి ప్రతిధ్వనిగా సాగుతుంది. వైయక్తిక మోక్షపదవి నర్థించదు.

''ఇపుడు వెలుగో అపుడు పిలుపో
ఎపుడు మహాన నిశీధ భార మె
ఉపశమించని తపనయే
నాకున్న భాగ్యము కన్నతండ్రీ''

అంటూ వినిపించిన కంఠరవంలో ఆత్మార్పణ స్పష్టంగా వినిపిస్తుంది. తొలి నాళ్ళల్లో కృష్ణశాస్త్రి ఏకేశ్వరోపాసనా వివిగ్రత కోమలాంబు శిఖరాల వెదజల్లారు. నామరహితుడు రూపరహితుడు అగు పరమాత్ముని ఎంతో ఆత్మీయునిగా స్ఫురింప చేసుకుంటారు. కృష్ణశాస్త్రి కవితా హృదయంపై రవీంద్రుని భవ్యవాణీ ప్రభావం ఎంతగానో స్పష్టపడుతు ఉంటుంది. ఆనాటి రవీంద్రవాణిని గురించి శ్రీ రాయప్రోలువారిలా అంటారు. "భానుసింహ పదావళిని వ్రాసిన రవీంద్రులు గురుదేవులై గీతాంజలి వ్రాశారు స్వయంగా కంఠమెత్తి పాడి తనధ్యాన గీతములతో శాంతి నికేతనమును గానమయం చేసేవారు. నాటకములు వ్రాసి స్వయంగా వాల్మీకి పాత్రధారియై మనోభావములను అంగభినయ భంగిమలు చూపేవారు. విధుశేఖర భట్టాచార్య బృహదారణ్యక శ్రుతులను బృందావన వేణు గీతములుగా సమన్వయించేవారు...." (కృష్ణశాస్త్రి కవితా స్వర్ణోత్సవ సంచిక పు 131) అలా ప్రవహించివచ్చిన నవ్యకవితా వాణి-వేంకటపార్వతీశ్వర కవుల ఏకాంతసేవ అనే నిసర్గసుందర కావ్యంలోనే ప్రథమ వీక్షణ ప్రభల ప్రసరించింది

రాయప్రోలు సుబ్బారావుగారి కవిత్వం 1910నుంచీ కొత్తపోకడల కూర్చుకుంటు న్నది కాని భక్తి పారవశ్యంలో కీర్తించే తెలుగు భజన గీతావళికి ఈ కంఠ రవం పూర్తిగా కొత్త వస్తువు. ఆంధ్ర కవితా శ్రేణిలో అంతకు పూర్వ మెన్నడూ ఏతాదృశ జీవన ధాతువుల వెలయించలేదు.

''కనులు విచ్చి కనుడీ...కను లలరగ కనుడీ
మనువులీయు వలదు మీ కనుల నీరు వలదు
కనుచు నుందమతనిని——మనకన్నులార గాను
ఎట్టి పాపినైన, ఎట్టి దోసకారినైన నంచే
పట్టి ప్రోచుచునంట అతడెట్టి బాధో కాని''

అంటూ ఆ దయామృత సింధువును కన్నులార తాను కని భక్తులందరికి చూపు తున్నాడా అన్నంత ఆత్మీయంగా ఊహచేస్తారు కృష్ణశాస్త్రి. ఈ ప్రతిభ బ్రాహ్మ మత ప్రభావంతో పల్లవించినదే. పుణ్యాత్మునిపై ఒక దృష్టి పాపిపై ఒక దృష్టి సమదర్శియగు భగవంతుని కుండదనే నూత్న విశ్వాసం ఈ మానవతా ఉద్యమా నికి ఆత్మపదార్థంగ ప్రచలితమైంది. ఈ మతం ఆవేశింప చేసుకున్న భగవానుడు ప్రతినరునికీ ప్రాణేశుడే; ఆత్మీయుడే; ఈయన జగత్పతి.

''రండురండు ప్రాణేశుడు
రాకరాక వచ్చె నేడు
తెండు తెండు విలువలేని
వలపు కానుకలన్
నిరతము మన కడనె యుండ
వరదు డెపుడు విశ్రమింప
పరచుదమా విమల హృదయ
మృదుల తల్పమున్!!

అవి సాగిన ఈ ముత్యాల సరాలు కవితాపరంగా కూడా మేలుబంతులు, అలతి అలతి పదాలతో అలవోకగా సాగే ఈ గేయంలో ప్రాణామృత గీతికా ధ్వనులు వినిపిస్తాయి.

ఆనంద సాగరుడు అరుగుదెంచె నేడు
కలుష హృదయు కొరకె, కపట వర్తను కొరకె
కులిన మానసు కొరకె – నా కొరకె! నా కొరకె!

అంటూ సాగుతుంది కృష్ణశాస్త్రి గొంతు జీర. భక్త హృదయం భగవానుని ప్రేమాల ఎంత విమ్మ మో, పత్యక్షర స్ఫురణతో సాగుతుంది. అయితే భగవంతుడు పతిత పావనుడు మాత్రమే. ఉన్నతులతో అతనికి పనిలేదు, అతని సన్నిధి ఒక్కటే భక్తుని కేడుగడ!

"హరి నామ గాన మధుపానమే వినా
వర మేది మనకు సోదరులారా!
విరితేనె కాదు, సురవరులు గ్రోలు
సుధ కాదు, కాదు: జర రాదు, ఏ
వెరపు రాదు, రాదు! మరణమ్మె
రాదు! రాదు సోదరులారా!

అనే విశ్వాస జీవకాంతులను మాటి మాటికీ ప్రసరిస్తూ ఉంటుంది. హరినామ స్మరణ మొక్కటే అమృత తుల్యమనే భావం అనాదిగా ఈ దేశంలో పాదుకొనియున్నదే! పోతన్నగారు ప్రహ్లాదాదుల నోట చెప్పించినదీ అదే! ఐతే ఈ హరియనే పదం విష్ణు సహస్ర నామావళిలో ఒకటి కాదు. హరియించును పాతకములు అనే ఉత్పత్త్యర్థ వివరణతో ప్రయుక్తమైనది. బ్రాహ్మమతం ప్రతిపాదించే భక్తికీ, విశిష్టాద్వైతం ప్రతిపాదించే భక్తికీ వున్న విభేదం కృష్ణశాస్త్రి ఉపాసన గీతాలలో విస్పష్టంగా మనకు కనిపిస్తుంది.

"తెరచుకొన్నవి స్వామి విరితావి కౌగిలి
విరిసికొన్నది కరుణ కురియుచల్లని చూపు
వెరపేల ననుబోలు పతితులూ పేదలూ
పశువు పరువున రండు!..."

అంటూ పేదలతో పతితులతో వికృష్టులతో కవి హృదయం తాదాత్మ్యం ప్రకటించుకుంటుంది. పరమాత్ముని సన్నిధికి సమిష్టిగా కొనిపోతుంది. యీ బ్రాహ్మమత ప్రార్థనా గీతాలలో అడుగడుగునా ఈ సమిష్టి భావన ప్రధాన స్ఫురణగా వ్యక్తమవుతూనే వుంటుంది. వ్యక్తి పరమైన దైన్యాలకు సమాజ పర ఆక్రోశాలతో సంలీనం చేసి యీ భక్తి ఊపిరి పీల్చుకుంది. ఆత్మార్పణమూ, అహంకార విసర్జనమూ, సమిష్టిగానమూ, బ్రాహ్మ గీతాలలో ద్యోతకమవుతాయి.

ఆంధ్రదేశంలో బ్రాహ్మ మతానికి బ్రహ్మర్షి రఘుపతిగారి తర్వాత వారి ఆధ్యాత్మిక వారసులుగా, ప్రధాన సంచాలకులుగా నిరంతర సేవలొనర్చిన మహనీయులు శ్రీ కంభంపాటి తారకంగారు. కృష్ణశాస్త్రిగారి ఆనాటి బ్రహ్మోపాసన

గీతావళి ప్రభావం ఎలాంటిదో ఎంత హృద్యంగా వివరిస్తారో చూద్దాం; కృష్ణశాస్త్రిగారి కవితలో రవీంద్రుని ప్రభావం అడుగడుగున ప్రస్ఫుటంగా గోచరిస్తూనే వుంటుంది. వెల్లువవైపు వహించిన వివిధ సాహిత్య వీధులలో హృదయానిని హత్తుకొనే విశిష్టత ఆయన మానవత. అందుకనే పండితులకు, పామరులకు, భక్తులకు పాపులకు అందరికీ ఆయన వందనీయులయ్యారు. వారి గృహం అందరికీ మందిరం. ఎవరు వెళ్ళినా ఎంత ఆదరణ! ఆప్యాయత! గుణములేని వానిదే కులమైతేనేమి- తృణమైతేనేమి శ్రీచరణమంటునేం! అని ఆలపించిన కవి చక్రవర్తి — వెలివేయబడిన సంఘసంస్కర్త!....ఆంధ్ర బ్రాహ్మసమాజం శ్రీ కృష్ణశాస్త్రి కెంతేం ఋణపడిఉంది. బ్రాహ్మ సమాజం అంటే ఏమిటో వారు రాసిన నిర్వచనం ఒక క్లాసిక్ అనదగిన కళాఖండం! "బ్రాహ్మ సమాజమనగానే ప్రతి బ్రాహ్మని అంతర నేత్రములు మ్రోల ఈ విశ్వమంతయు ప్రకృతితో, ప్రజతో, నిశాదినములతో, సుఖ దుఃఖములతో, పూర్వ వర్తమాన భవిష్యత్తులతో, ప్రాక్ పశ్చిమములతో ఒక్కసారి పరచుకొనినట్లగును" అని అనేక మూర్తులను చిత్రించారు. ఆయనే ఒక మహాకావ్యం కాకినాడ ఆంధ్రబ్రహ్మోపాసనా మందిరంలో గీతోపాసనలతో ఆరాధకులను ఆనంద పరవశులను చేసిన స్వర్ణయుగం మనం మరచిపోలేం. ఏనాడో He is our Trailokya Sanyal అన్నారు డా॥ వేమూరి రామకృష్ణారావుగారు. "ఆయా క్షణాలలో ఉండే మానసిక ప్రవృత్తిని బట్టి సరిపోయేది — ఏకాంతంగా ఏ పాట ఆయనని పాడుకున్నా మనహృదయ తంత్రులను మహాకవి మీటుతున్నాడా అనిపించి ఎంతో శాంతి నిస్తుంది" అంటూ ప్రత్యక్షానుభవ ఆవేశస్ఫూర్తితో కీర్తించారు శ్రీ తారకంగారు. చిత్తశుద్ధికి వారు నికష్యపాషాణం! (కవితా స్వర్ణోత్సవ సంచిక పుట 57)

కృష్ణశాస్త్రి దేవదేవుడు తనువునే అమృతవీణగా మార్చాడని విశ్వాసం ఉంది. ఐతే తనకేల ఒక జోలెను కూడా అతడే అందించాడు. నిద్రలేపాడు. నాలుగుదిక్కుల మధ్య ఒక స్వర్గం అమర్చాడు. ప్రతియింటి మోసాల ఆగమన్నాడు. ప్రతిగుండెనూ మీటమన్నాడు. పాడిపాడి నృత్యమాడి యాడి అలసి సొలసి భూహృదయంపై వొరలమన్నాడు. ప్రతి గుండెతోనూ కలసి తరలమన్నాడు. నాలుగు దిక్కుల నడిమ దేశమంతా స్వర్గంగా, గంధర్వ లోకంగా మలచమన్నాడు. గానసౌధంగా రూపొందించమన్నాడు. తేనెల కురియమన్నాడు. పూలపందిరిగా, బృందావనంగ మార్చమన్నాడు. ఇదంతా నాకేల నొక జోలె అనే గీతలో పాడుకొన్న భావమేకావి, స్వీయహృదయావిష్కరణమే. తానొక కవితా గంగయై జనుల ఎదల కడలిలో దుమికాడు. కారణజన్ముడిగా సార్థక్య మొనర్చుకున్నాడు

తలుపు తలుపూ జ్యోతి
పలుకు పలుకూ గీతి
పనులన్నీ ప్రణయముగ చేయవా
దేవ, ప్రతిగుండె నీ గాథ పాడయవా?

అని తన ప్రాణేశుని ప్రశ్నిస్తాడు. తానట్టి పనికే యుక్తుడు.

దూర దూరాన్నైన ద్వారతోరణమైన
తోచదే నామోాిల దేవ దేవా!
వన్నె వన్నెల ధూళి చిన్నెలన్నీ జాలి
బ్రతుకంత సంతెకో దేవా!
ఇంత తెలియని యాత్రి ఇంత కాల్చే ఆర్తి
ఎంత కాలము నాకు దేవ దేవా?
అంతరమ్మున శాంతి అంతటా ని కాంతి
అలరింపచేయవా దేవ దేవా!

## 2. వ్యక్తి స్వేచ్ఛా, స్వాత్మక ప్రేమ

ఇరవయవ శతాబ్దపు రెండో దశాబ్దంలో విద్యార్థిగా అప్పుడే కళ్ళు తెరచి పారచూస్తున్న కృష్ణశాస్త్రి ప్రభృతులకు విశ్వమంతా ఒక మహోజ్వల స్వేచ్ఛా విరతితో ఓలలాడుతున్న కుటుంబంగా దర్శనమీయనారంభించింది. ఆ సమ్యక్ దర్శనలో స్వదేశమనుభవిస్తున్న బానిసత్వం కూడా నగ్నంగానే సాక్షాత్కరించింది; దేశ స్వాతంత్ర్య జయఘంటలు వినిపించి మేనులను పులకింపచేస్తున్నాయి. స్వరాజ్యం నా జన్మహక్కు అంటూ సింహనాదం చేసిన లోకమాన్యుని పిలుపు ప్రతి యువకిశోరాన్నీ తట్టిలేపుతున్నది. కృష్ణశాస్త్రి ప్రభృతుల హృదయాలలో నవచైతన్యం మోసులువారుతున్ననాటికి గాంధీజీ ఇంకా స్వదేశ రాజకీయ రంగంలో ప్రవేశించలేదు. దేశ స్వాతంత్రోద్యమం ప్రజోద్యమంగా రూపొందలేదు. మేధావులలో మధ్యతరగతి విద్యాధికులలో నవచైతన్యం రేఖలు వెలార్చనారంభించింది.

ఈ స్వాతంత్రేచ్ఛాస్ఫురణ కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానం-అనే కావ్యంలో ప్రతి పాదంలోంచీ తొంగిచూస్తూనే ఉంది. పరాయి బానిసత్వంనుంచీ, సామాజికంగా భూస్వామ్య వ్యవస్థాజన్యమైన దురాచారాలనుంచీ, మేధాహృదయం కోరుతున్న విముక్తి చైతన్యంగానే ప్రాదుర్భవించడం సహజం. దాని బాహ్యాభివ్యక్తి వ్యక్తి

గత స్వేచ్ఛకోసం తహతహగా ఆవిష్కృతమవుతుంది. అదికూడా గగన కుసుమ సదృశంగానే కనిపించేసరికి దుఃఖమూ, ఆక్రోశమూ, నైరాశ్యమూ ముప్పిరి గొంటాయి.

ఐతే కృష్ణశాస్త్రి ప్రాథమికంగా కవి. కవితా శిల్ప రహస్యాలను ఉగ్గుపాలతో నేర్చుకున్నారు. అందువల్లనే ఆయన కవితలో లోకవృత్తమెక్కడా స్పష్టరేఖలతో దర్శనమీయదు. వికారముఖాల నసలే ఎత్తదు. లావణ్యాంశువులుగా మాత్రమే ప్రతిబింబిస్తుంది. త్రికాలాబాధిత జీవన రహస్యాలను మాత్రమే అదైనా ధ్వనిప్రాయంగానే మన లోచెవిలో ఊదుతుంది. ఆయన కవిత్వం జీవన సమరాన్ని కాక, అందులో తేలిన విగ్గును మాత్రమే కలగీతిగా ప్రయోగిస్తుంది.

''తిమిరలత తారకా కుసుమముల దాల్చ
కర్కశ శిలయు నవజీవన కళల జేల
మోడు మోక చివురులెత్త మురువునూప
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు!''

మన దేశంనిండా ఆనాడు తిమిరం ముళ్ళతీవలా గాఢంగా అలముకొన్నది. ఆ తిమిరంలోంచి తారకా కుసుమాలు ఉద్భూతమయ్యేరీతిగా తాను జగమునిండా స్వేచ్ఛాగాన ఝురుల నింపగలడు. తారకా కుసుమాల కాంతి సౌరభంలో వ్యాపిస్తుంది. చీకటి దుర్గంధాన్ని తొలగిస్తుంది. కర్కశమైన శిలకూడా నవజీవకళలతో తేరుకుంటుంది. మోళ్ళు చివురులెత్తుతాయి.

ఈ ఖండిక మొత్తం ఐదే తేటగీతులు. అందలి ప్రతిపద్యానికి చివరిపాదం జగమునిండ స్వేచ్ఛాగాన ఝురులనింతు! అనే మకుట మొకటి సంతరించబడింది. అసలే తేటగీతికున్నది పద్దెనిమిది మాత్రలేగల లఘుపాదాల విడివి. అలాంటి పదిహేను పాదాలలో మాత్రమే కవి తనకు సాక్షాత్కరించిన లోకవృత్తయాథార్థ్యాలను ధ్వనిబింబాలుగా ప్రతిష్ఠించవలసి వుంది. ఇలాంటి సందర్భాలలోనే అచ్చమైన కవికి గల గడసరితనం బయట పడుతుంది.

మొదటి పద్యంలో నూట యేభయి సంవత్సరాల పరాయి పాలనలో దేశంనిండా ఎంత చీకటి క్రమ్మిందో వ్యక్తం చేయబడింది. ప్రజా హృదయం ఎంత కర్కశ శిలగా మారిపోయిందో చిత్రితమైంది. జీవసారం చెల్లి, చైతన్యం ఉడిగి, ఎంత మోడు మోకగా మారిపోయిందో వర్ణితమైంది. మూడు సమాంతర స్థాయిలలో యథార్థ దృశ్యం ప్రతిష్ఠింపబడింది.

కవి జగంనిండా స్వేచ్ఛాగాన ఝురులు నింపుతాడు. ఆ స్వేచ్ఛాగానంతో క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య శృంఖలాలు తమంతతాముగా చెదరిపోతాయి.

సామ్రాజ్యవాదం క్రూరత్వంలో కుటిలనీతితో ఈ దేశాన్ని కఠిన దాస్య శృంఖలాలతో బంధించింది. తాను కంఠమెత్తి స్వేచ్ఛాగానం చేస్తాడు. గగనతలమంతా మార్మోగగలదు. చిత్తం ఆనందమరీచికలతో సోలిపోగలదు. హృదయం ఆనంద భంగిమాలికలలో ఓలలాడగలదు.

ఇక్కడ రెండుపాదాలలో వరుసగా చిత్తమూ హృదయమూ అనే పదాలు ప్రయుక్తమయ్యాయి. ఈ రెండూ పర్యాయపదాలనుకుంటారు సాంప్రదాయిక పండితులు. భావకవితలో పర్యాయపదాల ఉపయోగం సరిపడదు. ప్రతిపదమూ దాని ఉనికి పట్టుపది సహజంగా అన్వేషించుకొని ఆక్రమించుకొంటుంది. చిత్తం యోచనకూ, చైతన్యానికీ స్థావరం, అది ఆచరణకు ప్రతీక. చర్యకీ, ప్రతిచర్యకీ ఉనికి. హృదయం పని అదికాదు. అది వాసనలకావాసం. అనుభూతుల కణిధి శాల. అనుభవాలకు పాంథశాల! భంగమాలికలంటె తరంగ సమూహాలు. అలాంటి ఆనంద తరంగ సముదాయంలో హృదయం తేలిపోతుంది

కనులలో ఆనంద జనితాశ్రుకణములూరగలవు. ఇక్కడ మూడుపాదాలలోనూ ఆనందపదం ప్రయుక్తం కావడంలో ఒక కవితా చమత్కారం భాసిస్తోంది. పునరుక్తి దోషమను కొనే సాంప్రదాయవాదులకీ కిటుకు తెలియదు. ఆనందం లౌకికమైన సంతోషం కాదు. అది పారలౌకికానుభవపర్యవసాయి. తాను కవిగా స్వేచ్ఛాగానం సంతరిస్తాడు. దానివల్ల భౌతికమైన దాస్య శృంఖలాలు విచ్ఛిన్నం కావడమే కాదు; అలౌకికానందానుభూతి కూడా సిద్ధిస్తుంది. ఇది కవి ఉద్దేశించిన ఆంతరిక భావన అంత ఉద్ధృతంగా తాను స్వేచ్ఛాగాన ఝురులు నింపగలడు.

> ''యుగ యుగంబుల నీశ్వర యోధులగుచు
> స్వేచ్ఛకై ప్రాణసుమము లర్పించు వారి
> అమల జీవితఫలము ధన్యతను గాంచ
> జగమునిండ స్వేచ్ఛాగాన ఝురుల నింతు!''

విపులార్థ గర్భితమైన పద్యమిది. యుగయుగాలుగా స్వేచ్ఛకై ప్రాణసుమాలర్పిస్తున్న వీరులు ఈశ్వర యోధులే; అంటే స్వేచ్ఛా సమరయోధులు ఈశ్వర ప్రేరితులు. వీరి అమల జీవితఫలం ధన్యమయ్యే రీతిగా తాను జగమువింత స్వేచ్ఛాగాన ఝురులు నింపుతాడు. కవి బాధ్యత వీరులను ప్రేరేపించడమే గాక, వీరులను సంస్మరించడం కూడానని ధ్వని!

ఈ పద్యం తెలుగు సాహిత్యంలో ఎందరో కవులపై ప్రభావం కలిగించింది. కవికోకిల వేదుల సత్యనారాయణశాస్త్రిగారి "కాంక్ష," "జయగీతి" వంటి

రచనలపై ఎంత ప్రభావముద్ర ప్రస్ఫుటమైందో పరిశీలకులకు తెలుస్తుంది. ముఖ్యంగా పై తేటగీతి ప్రభావం ఈ క్రింది పద్యంలో ఎలా ప్రతిబింబిస్తున్నదో చూడవచ్చు

"నీచపు దాస్య వృత్తి మననేరవి భారత మాతృదేశసేవా చరణమ్ము నందసువు లర్పణ చేసినవారి పార్థివ శ్రీ చేలువారుచోట తదనుగ్రుచ్ఛులన్ వికసించి వాసనల్ వీచుచు, రాలిపోవగవలెన్ తదుదాత్త సమాధి మృత్తికన్." పై తేటగీతిలోని భావముద్ర సమాంతరంగా దర్శనమిస్తోంది.

కృష్ణశాస్త్రి భావ ప్రభావమే కాక పద్య నిర్మాణ శిల్పమూ, అనేకులపై ప్రభావం కలిగించింది. తేటగీతికి ఆయన కల్పించిన సింహాసన స్థితి అనంతర కవులనెంతగానో ఆకర్షించింది. ఈ ప్రభావం 1930 వరకూ "శ్రీశ్రీ" వంటి ప్రతిభావంతునే కాక వందలాది కవులను లోగొంది. ఆయన వృత్తాలు సమకాలికుల నెందరినో అనుసరింపచేశాయి. అనుయాయులూ అనుకరణవాదులూ ఎందరో! ఆయన వృత్తాలలోగల ఈ మార్గదర్శక సూత్రాలను విపులంగా వింగడించుకోవచ్చు.

మళ్ళీ ఆయన స్వేచ్ఛాగానం దగ్గరకి వస్తే మరికొన్ని సత్యాలు సుబోధకమవుతాయి. స్వాతంత్ర్యేచ్ఛ అంత సునాయాసంగా సాగేదికాదు. భయం కలిగిస్తుంది. కారణమేమంటే ఈ దేశాన్ని తన హస్తగతం చేసుకున్న పరాయివాడు చాలా భయంకరుడు. ప్రజలపై కష్టాతపాలు ప్రసరిస్తున్నాడు. ఈ దేశవాసులు కష్టాల ఎండలలో మాడిపోతున్నారు. కడ గండ్లు తింటున్నారు. రవి అస్తమించని సామ్రాజ్యానికి ఏకచ్ఛత్రాధిపతిగా వాడు నిరంకుశపాలన సాగిస్తున్నాడు. అలాంటి కష్టాల భయాలను మరచేటట్టుగా తన స్వేచ్ఛాగాన ఝురి సాగుతోంది. బాధాకర అంధ తమస్వినులు జాతిని కళవరపరుస్తున్నాయి. అట్టివానిని తన గానం మరపించగలుగుతుంది. విశ్వమంతా పరవశమై తనవెంట పాడేటట్లుగా ఈ స్వేచ్ఛాగానం సాగుతుంది. తనది ఒంటరిపాట కాదు. విశ్వంలో స్వేచ్ఛాపిపాసువులంతా తన వెనుక నిలచి వున్నారు. తాను నిర్భీతిగా పురోగమించగలడు.

కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానంలో వ్యక్తిగత స్వేచ్ఛకై అఘాటపడిన కవిత కూడా ఉన్నది. రెండోదైన "నవ్వివోదురుగాక, నాకేటి సిగ్గు" అనేది, కేవల వ్యష్టివాదంగా రూపొందే నిరవధిక స్వేచ్ఛావాదంనుంచి ఒక శృంగాటకం తెరుచుకొనే అవకాశం వుంటుంది. కవి ఆలోచనాపరుడై సమిష్టివినా వ్యష్టి సాధించేది. పొందేది ఏమీ ఉండదనే చైతన్యాన్ని సంతరించుకోగలిగాడా లోకశ్రేయాన్ని ఆకాంక్షించేవాడుకాగలడు. లేదా నిరవధిక వ్యక్తి స్వేచ్ఛనే కాంక్షించేవాడయ్యాడా అరాచక పితూరీలు జరుపుతాడు. సమాజంకన్న వ్యక్తి ఘనుడని భావిసాడు.

తన సోదరులందరికన్నా తాను అధికుడనని స్వీయారాధనాతత్త్వానికి మొగ్గిపోతాడు. కాని కృష్ణశాస్త్రి తదుపరికాలంలో లోకానుభవాన్ని మరింత ప్రోదిచేసుకున్నాడు. సమిష్టి మానవతావాదంవైపుగా పురోగమించాడు. సామాజిక శ్రేయాన్ని కాంక్షించి అభ్యుదయగీతాలు రచించాడు దాన్ని మరొక సందర్భంలో వివరించుకోగలం.

కృష్ణశాస్త్రి కవితలో సర్వత్రా ప్రకృతి, మానవప్రకృతి అవిభాజ్యంగా పెనవేసుకుంటాయి. ఏకదేశంగా చైతన్య రేఖలు వెలారుస్తాయి. మానవప్రకృతికి బాహ్యాభివ్యక్తిగా ప్రకృతి భాసిస్తూ వుంటుంది. ప్రకృతి ధర్మాలను మానవీకరణం Personification చేసి సాంకేతికంగా ప్రయుక్తం చేయడమూ కనిపిస్తుంది. ఎంత నైరాశ్యం వర్ణితమైనా పాఠక హృదయంలో ఆశారేఖలే ఫలితార్థంగా వెల్లివిరుస్తాయి.

కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానం బహుముఖాలుగా సాగాలని వాంఛించింది. బానిసత్వానికి అలవాటయిపోయిన జడబుద్ధులా స్వేచ్ఛను చూసి నవ్వితోయినా తనకేమీ సగ్గులేదు.

మొయిలుదోనెలలోన బయనం బొనర్చి
మిన్నెల్ల విహరించి మెరుపు నై మెరసి
పాడుచు చుక్కనై పడిపోదు నిలకు

ఎంత ఉన్నతోన్నతలోకాలవిహరించినా తన స్వేచ్ఛాగానం ఏదో పాటపాడుతూ ఏ వాన చినుకుగానో మారి ఇలపైపడిపోయినా తనకు వెరపులేదు. కాని అంతలోకే తెలిమబ్బు తెరచాటులో చెలియ చందమామతో జతగూడి సరసాలతో దోబూచులాడుతుంది ఆ మధురిమలు స్వేచ్ఛాగాన ప్రియుడైన కవిని భువికి దిగిరానీవు. కవికి యింత గుండెనిబ్బరం కలగడానికి కారణమేమిటి? తనకుగల మనోహర భావన మేనని తనకు తెలుసు. తాను అపూర్వ భావనా సంపదగల కవి. తాను స్వేచ్ఛాకుమారుడు. తాను గగన పథవిహార విహంగమపతి. ఈ ఎరుకయే కవి చైతన్యం కనుకనే రాజవీథిలో రతనాల రథమెక్కి ఊరేగే నిర్జీవ పాషాణ విగ్రహాన్ని తృణీకరించగలిగాడు. క్షుద్రమందిరాంతరాలలో కులికే దివాంధాలవంటి అధికారమదాంధుల్ని తిరస్కరించగలిగాడు. చలువరాతి మేడల చెరసాలల్లో తళుకు బంగారు సంకెళ్ళు ధరించి తానొక బానిసనని తెలుసుకోలేని అజ్ఞాని, తామేదో పెద్ద లోకపాలకులమనుకుంటున్నారు మురిసిపోతున్నారు, ఇలా ప్రభువాచ్యలను ఈసడిస్తాడు. అలాంటి అజ్ఞానులందరికీ తానే మోహన వినీల జలధర కృష్ణుడనని తెలియదు. ఆ దివాంధాలకు తానే ప్రళయ ఝంఝూ ప్రభంజన స్వామి నని తెలియదు.

సందెవేళ, పొలము గట్టు; చల్లగాలి, చేతిలో చేయి, మనులేత చిత్తములు, పిట్టల్లా విహరించడాలు—ఇవన్నీ ఈ కొత్త కవితా కంఠస్వరానికి ఉద్దీపకాలు. అపూర్వ భావాలకు ప్రేరేపకాలు. ఆ నూత్న భావనా కాంతులతో కవి తన ప్రేయసి ముఖం చూశాడు. కనులు చూశాడు? మొయిలు చూశాడు. అన్నింటా కొత్త పాట. అంతటా ఒక కొత్త ఊపు. ఆ చూపులతో కవి హృదయం ఆమెను ప్రేమించనారంభించింది. ఎందుకు ప్రేమించిందా? అని ప్రశ్నించు కున్నాడు. జవాబు దొరికింది. పూవులు సువాసన లెందుకు చిమ్ముతున్నాయో అందుకే. చందమామ వెన్నెలెందుకు కాస్తున్నాడో, అందుకే; ఏరెందుకు పారు తోందో గాలెందుకు విసురుతోందో—అందుకే; తన హృదయం సహజంగానే ప్రేమిస్తోంది. మధుమాసం వచ్చింది అనగానే సహకార శాఖనెక్కి కోకిల హాయిగా పాడుతోందికాదా— ఆపాట యితరుల కోసమా? తనహాయి కోసమేనా? గానంలేకపోతే తాను బ్రతకలేదు కనకనే? ప్రేమ లేకపోతే తన బ్రదుకూ అంతే;

అలా ప్రేమించిన కవి తన ప్రియురాలు దివ్యానుభూతులందించాలని వాంఛిస్తాడు. తన హృదయాన్నీ సంపన్నయం చేయాలని కోరుకుంటాడు. ఆమెకి హేమమణిరత్న గుణములక్కరలేదు. సంధ్యాసమయ సువర్ణితచ్ఛాయలను చూసి మురిసిపోగలదు. తారకా శోభలను కాంచి చింతలన్నిటినీ నమయింపచేసు కోవచ్చు. వలపు బాటలో త్రుళ్ళింతలాడే సమయంలో....సెలయేటి తరగల మరుగుల్ని చూసి హృదయంనిండా ప్రీతినింపుకోవచ్చు. ఐహికమైన కోరికల్ని విసర్జించవచ్చు. అన్యోన్య హృదయ పాలకులుగా తనరారే ప్రేయసీ ప్రియులకు సార్వభౌమ భోగాలు తుచ్ఛాలు కాకమరేమిటి? ప్రవిమల ప్రేమ సామ్రాజ్య పట్టభద్రభాగ్యం అందుకున్న ప్రేయసీ ప్రియులు చిన్న చిన్న లౌకిక సంపదలు లెక్కచేయరు. అలౌకిక ప్రేమదీప్తికీ అమలిన శృంగారానుభూతికీ, ఆత్మా శ్రయ ప్రేమకవితకీ కృష్ణపక్షంలోనే ఆద్యపీఠం నెలకొల్పబడింది. ప్రవాసం విప్రలంభపరిదేవనకు పరాకాష్ట. ఊర్వశి ప్రేమకవితా దేవాలయంలో గోపుర దీపం. "కృష్ణశాస్త్రి, ఊర్వశిలో విశిష్టుడై కవిసిస్తాడంటారు" రుక్మిణీనాథశాస్త్రి.

క్రూరత్వం, కుటిలత్వం, కాలుష్యం వంటి పంకాలతో మలినమయ్యే మానవహృదయం ప్రేమకాంతిలో విశుద్ధమవుతుంది. మధురమూ ఆఘరహితమూ అవుతుంది. నిజమే మరి. శర్వరీ తమోవీధుల పడివచ్చిన చంద్రుడు పూర్ణ తేజస్విగా వెలుగొందడంలేదా? అలాగే స్వార్థంతో నిండిన మానవహృదయానికి ప్రేమ, కోమలత చేకూరుస్తుంది. పవిత్రీకరిస్తుంది. సర్వప్రకృతీ తన ప్రేయసికి ప్రతిబింబంగానే కవిపిస్తుంది. ప్రకృతే పురుషునకు ప్రేయసి కదా.

ప్రాణమునకు ప్రాణమైన ప్రాణకాంత విట్టూర్పు కెరటాలలో ఓలలాడిన సౌరభమూ, గానమూ, తనకు విందు కాంతిని చేకూర్చగలవని కవి ఆశిస్తాడు.

ప్రాణకాంతహృదయ సాక్షాత్కారం సర్వత్రా కనిపిస్తుంది. ఆమె తనకోసం కార్చిన అశ్రువులు హిమకణాలుగా మారతాయి. పూవులపై తేనెచినుకులుగా గోచరమవుతాయి. ప్రణయ విమలాబ్ధి గర్భాన తేలి ప్రాణకాంత మానవకళ్లాన్ని ధరిస్తుంది నీరదమూ నీలమూ సౌందర్యవంతాలవుతాయి. మధుపాలూ కోయిలలూ ఆమె విరహ గీతికలనే ప్రతిరుతిస్తాయి.

"కవికుమార" అనే కవితకు-మార్పుపొందిన నవీనయుగంలో కవిత పొందవలసిన మార్పులేమిటో వ్యంగ్యంగా చిత్రించడమే ఇతివృత్తంగా అమరింది. క్రొత్తకలస్వనంతో- దివ్యసౌందర్యంతో భాసించే విశ్వసుందరి కవి ముందు నిలిచింది. ఆమె ఒక ఉదయలక్ష్మిలా అవతరించింది. ఆమెకు ఎదురేగి, స్వాగత గీతాలతో తోడ్కొనిరావలసిన బాధ్యత కవికున్నది. అవిరళమైన స్వేచ్ఛతో జలదాలు చిత్రకాశ్మీర కాంతులతో పశ్చిమాద్రిని విహరిస్తున్నాయి ఆ వారిదాలను చూసినా కవిమనస్సు స్వేచ్ఛా భావనామయంగా ద్యోతకమవుతుంది. క్రొత్త శక్తితో ఉజ్జ్వలిస్తుంది. శ్యామలాంబరమనే సరసిలో ప్రణయలీలలతో విహరించే విలాసినులవలె తారకలు విస్ఫారితాలవుతున్నాయి. వాటిని దర్శించినా చాలు. నవీన కవిహృదయంలో భావనానక్షత్రకాంతులు పరచుకోగలవేమో! ఏమైనా ప్రకృతిని కళ్ళు తెరచి పరిశీలించమని ఈ కవిత కవులను హెచ్చరిస్తుంది.

ఆత్మాశ్రయ ప్రేమకవితకు ఆద్యుడైన కృష్ణశాస్త్రికి తన ప్రేయసి వివిధ భంగుల దర్శనమిచ్చింది. అమావాస్యాతమస్వినిగా, గగన సీమంతినిగా ఆమె దీర్ఘ ధమ్మిల్లనీలవల్లిచ్ఛాయలో పొడిచికొని, నిదురతెరవిడచి, పూవులు నేడు తళతళ పాడుతున్నాయి. సురభిళాహ్వానాలు వినిపిస్తున్నాయి. కనువెలుగులు పరుస్తున్నాయి. తన కైశికీ ధ్వాంతనిశ్శబ్దాలను చీలుస్తున్నాయి. శర్వరీసతి సాక్షాత్కరిస్తోంది. ఆమె కుంతలములలోని పూవులు శిరసులెత్తి పిలుస్తున్నాయి. ఆ పిలుపులు తాను భరించలేకపోతున్నాడు. "తురిమి విసరుము వాని ఎరుగనేరని దూర దూరాలకో చెలీ!" అని వాపోతున్నాడు.

ఐనా తానా పిలుపులు వినకుండా తప్పించుకోలేడు. "కప్పికొందును కనులు-కప్పగలనా ఎడద!" అదీ కవి నిర్వేదం! తన కా ప్రేమ శాపం చాలునని శమించమని ప్రాధేయపడతాడు కవి. "ఆసలేని ఆసకు ప్రాణాంతమేని" వేచి యుండవలసిందేనా? అది కవి సందేహం. తారకాలోక పంక్తుల మారుతోరు పక్షముల తిరుగాడుచు పవలు రేలు కన్నుమోడుపు మెయివాల్పుగాని లేక" వెర్రి అన్వేషణలో వేగిపోతున్నాడు.

కాల్పనిక సాహిత్యానికి అంకురార్పణ జరుగుతున్న తొల్లిరోజుల భోగట్టా కృష్ణశాస్త్రిగారే వివరించాలి. రెండవదశాబ్దంలో జరిగిన పరిణామస్ఫూర్తి

గురించి ఐదారేళ్ళక్రితం కాకినాడలో వారిచ్చిన వ్రాతపూర్వకోపన్యాసంలో యిలా ఉద్ఘాటించారు. "ప్రబంధపదబంధాలు ఆనాటి వరకూ పాఠకులకూ కవులకూ ఎంతో ప్రభావితంచేశాయి. వాటిపెత్తనం యింతా అంతాకాదు. అనుభూతి ఉంత రించిపోయింది. స్వీయహృదయానుభవం ఎక్కడా లేనే లేదు ఆర్ద్రత అడుగంటి పోయింది కవితాశిల్పం పేరున కృతకత్వం రాజ్యమేలింది. ఔచిత్యానికి, ఉన్నతభావ ప్రకటనకు అవకాశం లేకుండా పోయింది. మన ప్రబంధ కవిత్వంలో రాను రాను ఏర్పడిన స్థితియిది."

ఇంగ్లీషు భాషా వ్యాప్తి ప్రపంచ పరిణామాలను దర్శింప చేసింది. తెలుగు కవి గుండెలో పేరుకొన్న స్తబ్దతను తొలగించింది. మా గురుదేవులు రఘుపతి వెంకటరత్నంనాయుడుగారి శిష్యరికం నాలో ఎన్నో క్రొత్తగుమ్మాలు కిటికీలు తెరచింది. వ్యక్తి స్వాతంత్ర్యేచ్ఛ మా హృదయాలలో పురివిప్పింది" స్వాతంత్ర్యం, సమానత్వం, సహోదరత్వం-అనే మౌలిక ఆశయాలు ప్రాతిపదికగా నవ్యకవితావిర్భావం జరిగింది. అదే కాల్పనిక సాహిత్యం. రవీంద్రుడే దీనికి వైతాళికుడు. ఆయన ప్రభావమే దేశమంతా వ్యాపించింది. ఈ పరిణామ తాత్త్వికానుభవంతోనే కృష్ణపక్షం వెలిసింది:...." అన్నారాయన.

కృష్ణశాస్త్రి కవితాహృదయం- ప్రతిగేహదేహళి పదమాగి, ప్రతిహృదయ ద్వారతోరణ మట్టెత్రోసి, లోనికి జొచ్చి, తనకోవి స్నేహక్షీర మొక్కింత వాక్కింత ఒలకబోసి- అనుగుసోదర మరలిరావా?" అంటూ వెలువడిగి సాగిపోతూనే ఉంది. తెలుగుజాతి చిరస్వప్నజాలాన్ని వెలిగిస్తూనే ఉంది. అదే ఆయన కవితకు ఫలితార్థమూ, పరమార్థమూను:

## లోకవృత్త ప్రదర్శనం: అభ్యుదయ దృక్పథమూ-

కృష్ణశాస్త్రి ఆత్మాశ్రయ కవిత్వంగురించి, స్వాత్మక ప్రేమేతి వృత్తం గురించీ ఎన్నిగ్రంథాలయినా వ్యాఖ్యానించవచ్చు. ఆయన చిరంతన వియోగి, అనంత శోక భీకర తిమిరలోకైకపతి. కంటక కిరీటధారి. ఆవిధంగా కృష్ణశాస్త్రీ సాక్షాత్కారం అజరామరంగా భాసిస్తూనే వుంటుంది.

''స్నీ
కనురెప్ప కొసలనొక
చినుకైన కదలనీ
ప్రళయకాలానంత భయదపాథోరాశి
వలె విశ్వమెల్ల ముంచెత్తు సుమ్మా!''

అంటూ సామాన్యుని గుండె తట్టి ధైర్యం చెప్పడంలో కావి, క్రియాశీలతను ఉత్సేకించడంలోగాని, శాస్త్రి తన కర్తవ్యాన్ని విస్మరించలేదు. సామాన్యుడు జడుడై, విశ్చేతనుడై, మన్నుతిన్న పాములా నిద్రపోతున్నాడు. అతని శక్తి అతనికి తెలియదు. అతనిలో చైతన్యం మేల్కొలేదు. సామాన్యుల మనసుకు ఆత్మజ్ఞానం అబ్బలేదు. అట్టి బానిసని పూవుపెదలో ఒక శోకలవం రేగినా ప్రళయ కాల మహానటుని గళచ్చలిత హాలాహలం ఉద్భుత శక్తితో వెలువడుతుంది. మింటిని మంటిని దహిస్తుంది. ఈ ఆత్మ విశ్వాసాన్ని ప్రేరింపచేయడం అభ్యుదయ కవితకు ప్రధానధాతువు.

సమాజ సామాజానికి నవచైతన్యం కలగాలి. లోకయాథార్థ్యాన్ని పరామర్శించగలగాలి. అప్పుడు జాతి స్వేచ్ఛాపథంలో పయనిస్తుంది. శుభోదయం సాధిస్తుంది. ఆ సమస్త చైతన్య స్ఫూర్తితోనూ కృష్ణశాస్త్రి నలభయ్యేళ్ళ ప్రౌఢ వయస్కులుగా ఉన్నప్పుడే లోకవృత్తాన్ని నిశితంగా అనుశీలించారు. కవితా హృదయంతో మారు పల్కారు. గొంతు కొంత తీవ్రతరమూ అయింది. మరింత స్పష్టత చేకూర్చుకుంది విశ్వమానవీయత అనే రూపరహిత ఆదర్శ వాదం నుంచి విడివడింది. అభ్యుదయ దర్శనను స్వాయత్తం చేసుకోగలిగిందాయన కవితా హృదయం.

ద్వితీయ ప్రపంచ సంగ్రామం ప్రపంచ ప్రజాజీవితాన్ని అతలాకుతలం చేస్తోంది. బ్రిటిష్ సామ్రాజ్య వాదులా యుద్ధాన్ని తమ స్వార్థానికి అనుకూలంగా త్రిప్పుకుందుకు నానా యాతనలు పడుతున్నారు. భారతదేశంలో మానవకృత మహాక్షామం పడగ విప్పుతోంది. అన్నాన్ని సృజిస్తున్న శ్రమజీవికి అన్నం దొరకడం లేదు. ఆ సన్నివేశంలో (1939లో) ఆయన 'ఆకలి' అనే గీతాన్ని విరచించారు. అది మనదేశీయమైన పునాదులను స్పర్శించింది.

"కాల దేవత గుండె ఒరిసి
కాళరాతిరి నెత్రు కురిసి          దగ్గర
రాకాసి మెలుగు          దగ్గర
చీకట్ల మూలుగు          ప్రళయమొచ్చి వినరు
లోన          దగ్గరగ
వన్నెపోయిన రంగు దీపాలు          దగ్గరగ
వెన్నెల్లో ఉన్మత్త నాట్యాలు          చీకట్ల మూలుగు
పిసుగుపుట్టే విడరు          రాకాసి తెలుగు
వీనులుండీ వినరు          పైన

రాకాసి వెలుగు
చీకట్ల మూలుగు
లోన
రెక్కలెగరని నెమలి సింహాసనం
ఎక్కి సిరసందనిది కోటీరం
భారమైనా విడరు
చేరువైన వినరు
బిగ్గరగ
బిగ్గరగ
రాకాసి వెలుగు
చీకట్ల మూలుగు
లోన
రాణిపోయిన రాచనగరులో
పానుపంటని పేణి నిదురలో
మెలకు వచ్చి పీడరు

కాళరాతిరి గుండె పగిలి
కాల సర్పము విషము రగిలి
రాకాసి వెలుగు
చీకట్ల మూలుగు

దేశంలో చీకట్లు మూలుగుతున్నా, ఆకలి రాకాసిలా ఎలుగెత్తుతున్నా రెక్కలెగరని నెమలి సింహాసనాన్ని ఆక్రమించుకొన్న స్వార్థపరులు వినిపించుకోరు. తలకు బరువైన కిరీటాన్ని విడువలేరు. దేశాన్ని మూలుగుల వరకూ పీడిస్తున్న పాలకు లెట్టివారు: "తమకు అమృత ముంచుకొన్నారు. తమ మధువు వింపుకొన్నారు. మాకు ఆకలి విచ్చారు." మాకు సహజంగానే రోషం హెచ్చింది. "మందాకిని ఝురులు మరు గర్భమందించువరకు" మా దేశాన్ని తపింపచేస్తున్నారు. "తమ సొగసు వాడిపోదంట." తమ సుఖము వీడిపోదంట." మాకు మాత్రం నాశనం యిచ్చారు. మాలో ద్వేషాగ్ని హెచ్చిపోతుంది. మందార తరులు హేమంత మసనమ్మందు వరకూ మాలో అగ్ని ప్రజ్వరిల్లుతుంది. తమ ఘనత కృతయుగము దైతే తమ ప్రభుత బ్రహ్మాయువైతే మాకు వారిచ్చినవి మాత్రం సంకెళ్ళు. మాకు మానం వొచ్చింది. మఘవ కోటీరమే మంటి కౌగిలి వంచే వరకూ మేం విజృంభిస్తాం. అంటూ మరో

గీతంలో ఆక్రోశిస్తారు. దేశీయ హృదయార్తి శిల్పమూర్తి మంతనంగా అభివ్యక్తం చేయడం యిందులో ప్రధానం.

"నీ చరణ తరుణ లక్షచిత్రితములమ్మ నీసుతుల జీవితములు నాతల్లి నిరుపేద జీవితములు." అనే పల్లవిగల గీతం మరొకటి. జాతీయ స్వాతంత్ర్య పిపాసను ఎలుగెత్తి చాటుతుంది. "ఈ బ్రతుకులే తెరచి ఎగయు మా కోరికలే సాగు సందెహోరంగులో, నా తల్లి రేగు పొడుపు వెలుంగులో" మా బ్రతుకులు నేర్పిన పాఠమే మాలో ఉదయకాంతులను కలిగిస్తున్నాయట. మన్నూ మిన్నూ అలమికొని మనలే ఆమె వన్నెలు హిమాలయ మకుట ఘృణులను వెలార్చుతూ, సాగరమణి సముచ్చయాన్ని మెరిపిస్తున్నది. మూడులోకాలవారులందు వ్యాపించిన ఆమె రాగాలు గానాలూ దేవతల హృదయాలలో కూడా నిలుస్తాయి. రాక్షసుల గుండెల్ని కలచి వేస్తాయి. భారతీయ చిరంతన దీప్తి ఎల్లలోకాలవారూ ఎరుగుదురు, ఆమె అడుగుల పారాణిని పోల్చుకుని ఆమెను లోకపు రాణిగా గ్రహించగలరు. ఆమె పాదముల కొసలలో ఆమె కరుణ ప్రకాశిస్తుంది. లోకవాసులంతా తమతలలను కుసుమాళిగా ఆమెపాదాలకు పూజిస్తారు. తమ హృదయాలను నీరాజన మిస్తారు. పైకి భావగీతంలాగో ప్రార్థనలాగో కనిపించే ఈ గీతంలో ఈ దేశవాసులు తమ పౌరుషమయ క్రియా శీలతతో స్వాతంత్ర్యాన్ని సాధిస్తారని భారతికి స్వేచ్ఛ ప్రసాదిస్తారని, ఎల్లలోకమూ సహకరించగలదన్న ధ్వని మన ఎదలో మ్రోగుతుంది.

ఈ అంతర్జాతీయ దృక్పథంతోనే ఆయన కవితా హృదయం వెనుకకో, ప్రక్కలకో నడిచే పీత నడకలను అధిక్షేపించింది మందికృత మహాయుగం అనే గీతం ప్రశస్తమైంది.

| | |
|---|---|
| మందికృత మహాయ్యుగం | కనుకను జరర కలికాలం |
| ముందున్న ముందున్నది | వెనుక నడక కులీరం |
| ముందున్నది మందే, మరి | పీతలాంటి భూతం మన |
| మందే యువ మహాయుగం | తాతద్దీ తండ్రిద్దీ |
| కలికాలం ముసలి ముసలి | రోత రోత రోత మంది |
| చలికాలం మసిలి మసలి | ప్రీతకుజ్వాలాకాశం |
| కొండ చిలువలాగ, పెద్ద | భావిమందిరావాసం |
| బండలాగ దొర్లిపోయె | ప్రాతరున్నతావాసః |

సర్వథా యిది కలికాలమని, మంచే అంతా గతంలోనే వెళ్ళిపోయిందనీ విశ్వసిస్తున్న దేశంలో మనది కృతమహాయుగమని చాటడమే ఒక కొత్త జేగంట

మోగ్రయించడం. అంధ విశ్వాసాల నెన్నుదుట ఒక తాగ్రపు తన్నడం వంటిదే. కలికాలం ముసలిదై చనిపోయిందని గుర్తిస్తారు. కొండచిలువలా దొర్లిపోయింది. పీతలాంటి భూతకాలం పెనుభూతం వంటి భూతలమూ మన తాతల్ది తండ్రులదీని మనదో పాత్రిత రజ్వలాకాశం. భావి మందిరావాసం. పాత్రితరున్నతావాసం. మనమో "స్ఫీతచలత్ ద్యోతలసత్ చేతనులం, నూతనులం" కనక మనకేమీ కొరత లేదు. ఇదీ శాస్త్రి యుగీన కవితా స్ఫురణతో వినిపించిన సందేశం. ఈ నవ యుగంతో గొంతు విచ్చిన వారైనా చాలామంది కవులు వెనక్కి వెనక్కి నడచివెళ్ళిపోయారు ఎక్కడో ఆగిపోయారు. చరిత్రకందని వేదకాలాలలో తలదూర్చి వేదన పడుతున్నారు కాని శాస్త్రి దృష్టి ముమ్మందుకే పయనించింది. నిత్య యౌవన శ్రీని సంతరించుకుంది. అప్పటికాయన శరీరానికి ఏబదేళ్ళ పౌగ్రఢ నిర్భర వయః పరిపాకం (1945 సెప్టెంబరు ప్రతిభలో ఈ కవిత ప్రచు రితమైంది) చేకూరిన హృదయానికి మాత్రం యౌవనపు మిసిమి తరగలేదు.

కృష్ణశాస్త్రి కాకినాడలో నివసిస్తున్న 1940ల తొలిరోజులకే నవీన దృష్టి ప్రబలంగా ఆయన హృదయాన్ని తొందరపెడుతోంది అభ్యుదయ రచయితల సంఘం నిర్మాణమైన నాటికి మరింత తీక్షణత నలవర్చుకుంది. రాజమండ్రి మహా సభ నాటికి అభ్యుదయ సాహిత్యోద్యమంతో మమేక స్ఫూర్తిని సంతరించుకుంది. సనాతనత్వానికీ, దోపిడీ విధానానికీ వ్యక్తిగతంగా ఆయన ప్రబల విరోధిగా స్పందించారు

కృష్ణశాస్త్రి మానవతా దృష్టి బహుముఖాలమైంది. పదిమందిని పస్తులతో మాడ్చి ఒకడు ధనాఢ్యుడయ్యే సాంఘిక వ్యవస్థకు ఆయన శత్రువు. కనుకనే ఆయన చిరంతనంగా అభ్యుదయవాదిగానే మిగిలారు. యౌవనారంభంనుంచి జీవి తాంతం కులవ్యవస్థను ఆయన తృణీకరించారు. ఆయన గృహం కులాతీతమైన అతిథిశాల వారి గృహిణి శ్రీమతి రాజహంసగారు అతిథి ఆదరణలో అన్న పూర్ణమ్మకు సైదోడు క్షమయాధరిత్రి అనేది ఆమె విషయంలో సాధారణోక్తి "వారి గృహం అందరికీ మందిరం. ఎవరు వెళ్ళినా ఎంత ఆదరణ! ఆప్యాయత! గుణములేవి వానిదేకులమైతేనేమి!" అనేది ఆచరణలో వారు ధ్రువపరచుకున్న తాత్త్విక కిరణం!

కృష్ణశాస్త్రి హృదయం నిత్యం యౌవనశీలం. తిరోగమశీలురైన కుశీ రాల్ని ఆయన అవిరళంగా ఖండించారు. వర్ణాశ్రమ ధర్మాలను పునర్నిర్మించేవారిని సహించలేదాయన మత వైషమ్యాల్నీ, కులతత్త్వాన్నీ తృణీకరించారు. ఆయన హృదయం ఆధునిక యోచనా ధురంధరులకు కాణాచి.

1941లో స్టూడెంట్సు ఫెడరేషన్ అధ్వర్యంలో జరిగిన విద్యార్థి మహా సభకు అప్పటి విద్యార్థినాయకుడు శ్రీ పి. ఎస్. శర్మ అభ్యర్థనపై సక్కవి ఉద్యమ ప్రబోధ గీతాన్ని రచించారు. అదే యిది:

ఆకాశము నొసటపొడుచు అరుణారుణతార
ఏకాకి నిశీధినాడుచు తరుణకాంతి ధార
జయపతాక యువపతాక వియద్దాపగ వెడలు నౌక...
యుగయుగాల పీడకలలు సాగయచేయు సంకెలలు
తెగనివి కావోయి, మ్రోల ధగధగా స్వతంత్ర
విభాతాకాశము నొసటపొడుచు అరుణారుణతార!

అంతులేని ద్వేషము, విరోషము, స్వార్థము మోసము
పంతగించి నిలువవు అవంతమేని శాంత విభా
తాకాశము నొసటపొడుచు అరుణారుణతార

ముందుకలదు మన జాతికి ముక్తి, అమరజీవరక్తి
క్రిందు వెనుక గనక నడువుడందరు అభ్యుదయ
విభాతాకాశము నొసటపొడుచు అరుణారుణతార!

ఈ గేయం ఆనాటి విద్యార్థి ఉద్యమ కార్యకర్తలకెంత ఉద్దీపన కలిగించిందో అస్మదాదులెందరో ప్రత్యక్ష సాక్షులు. ఈ ఒక్క కవితలోనూ 1940లలో విస్ఫారితమైన సకల చైతన్యమూ ప్రతిబింబించింది. మన దేశానికి స్వాతంత్ర్యం రాకపూర్వం, ద్వితీయ ప్రపంచ యుద్ధం యింకా సమయని కాలంలో ఆయనీ గీతం ద్వారా ఇంత ముందుచూపు ప్రదర్శించారు. మనిషిని పీడకలలలో సాగయ చేసే సంకెలలు తెగనివి కావని హెచ్చరించారు. జాతి ఆ సంకెలల తెంపి ముందు కురకాలని ధ్వని. మనిషి కలలలో ధగధగమని మెరుస్తున్న స్వతంత్ర విభాతాన్ని పరిశీలించమంటున్నారు పంతగించినంత మాత్రాన ద్వేషమూ, విషరోషమూ, స్వార్థమూ మోసము కలకాలం నిలిచి ఉండవనీ విశ్వాసం తెలిపారు. మానవ జాతికి ముక్తి మునుముందే ఉన్నది. అప్పుడు అమరజీవరక్తి యింటింటికీ తోరణమై ప్రేలుతుంది.

స్వాతంత్రేచ్ఛతో ప్రజలు కావించే పురోగతి "ప్రజారథం" అనే మరొక కవితలో ఎంతో హృద్యంగా వర్ణితమైంది. "ప్రజారథం తరలింది, ప్రపంచ పథం పొరలింది. కనక పదవోయివద!" అంటూ హెచ్చరిస్తుందా గీతం. తుదివిజయం మనదేనని చాటుతుంది. భవిష్యత్తులో ఇంక యుద్ధోన్మాద జ్వాలలు అలముకోవడ మంటూ ఉండదని, "రాగలదిక శాంతియుగ" మేనని, రాగలదిక అభ్యుదయ పథమేనని కంఠోక్తిగా చాటుతుంది గీతం. ముదిలోకం తప్పక నశించిపోతుంది. యువ హృదయం పదునువాలి ముందుకు సాగుతుంది. యువలోకానికి ఎదురైన

సమభావ, చోదకశక్తిగా ముందుకు నడుపుతుంది. అదే ఈ యుగ వైలక్షణ్యం. ఇక స్వార్థపరుల మదిలోభం మాసిపోతుంది. ప్రతి జాతికీ స్వాతంత్ర్యం సమకూరుతుంది. పరపీడనా రాహిత్యంతో కూడిన స్వాతంత్ర్య భానూదయమది: వికసించే నూత్న రాజకీయ విధానంలో మకుటధారి సామాన్య మానవుడే: ధనాఢ్య వర్గాలు కావు. రారాజులూ భూస్వాములూ కారు. ఆ నూత్న విధానం తప్పక వికసిస్తుంది. ఇదీ కృష్ణశాస్త్రి ఆశావాదం. ఇదే వారి కవితా స్వప్నం: అది అప్పుడే కొన్ని ప్రపంచదేశాలలో యథార్థమై భువికి దిగివచ్చింది:

కృష్ణశాస్త్రి ఈ జడామయ జాతికి ఆత్మవిశ్వాసం అందించారు. క్షణ క్షణ నైరాశ్యావృతుడయ్యే మానవుని హృదయంలో చైతన్య దీప్తులెగ చిమ్మడంకన్న కవిత్వంనుంచి మరే ఉత్తమ ప్రయోజనాన్ని ఆశించగలం? : కవిత్వమే సర్వశక్తిమంత మనుకుంటూ అదే చరమాయుధంగా సర్వ సమస్యల్నీ పరిష్కరించగలదనుకోవడం ఆత్మవంచనా పూరిత భ్రమ తప్ప అన్యం కాదుకదా: కృష్ణశాస్త్రి గీతోద్ఘోష ఎంత యథార్థోక్తుల నందుకొన్నా కళాస్పర్శను ఆత్మపదార్థంగా గుప్తం చేసుకుంటుంది. ధనుర్ఘోషగా ఆలోచనల మేల్కొల్పుతుంది. ఆయనకు 1943లో రాజమహేంద్రవరంలో గొప్ప సన్మానం జరిగింది. ఆ సందర్భంలో "నవభారతి" పక్షాన "నిశ్రేణి" అనే చిన్న కవితాసంపుటి ప్రచురితమైంది. రాశిలో చిన్నదే కాని రస ప్రాతినిధ్యంలో మిన్నయైనది. ఆయన కవితా హృదయంపై ప్రభావం కలిగించిన సర్వ కవితా ఉద్యమాల ప్రతిబింబాలూ ప్రచలితమయ్యాయి. ఆయన కవిగా నిత్య హరిత వరుడు. యౌవన శీలంతో జాతి అందుకొన్న సర్వ ఉద్యమాలనూ ఆలింగనం చేసుకున్నాడు. కవితకు యితివృత్తాలుగా మలుచుకొన్నాడు. అందువల్లనే ఆయన కవితా హృదయం విలువెత్తు సజీవమూర్తిగా మన కన్నుల ముందు ఆవిష్కృతమవుతుంది.

అరవైయేళ్ళపాటు మన కలలను ఆయన కవితా హృదయం పండించింది. సాహిత్య చరిత్రలో పొడసూపిన సమస్త కవితా ధోరణులకూ ఆయన ప్రయోక్తగానే కాక, ప్రతినిధిగానే కాక, ప్రవక్తగానే నిలిచారనేది వెలిసిపోని సత్యం: ఆయన హృదయం త్రివేణీ సంగమం: పవిత్ర ప్రయాగ క్షేత్రం::

# ఐదో ప్రకరణం

## అజ్ఞాత భావికాలాలకు పయనించే కవితాలహరి

క్రౌర్య కౌటిల్య కల్పిత కఠిన దాస్య
శృంఖలములు తమంతనే చెదరిపోవ
గగనతలము మార్మ్రోగగ కంఠమెత్తి
జగమునిండ స్వేచ్ఛాగాన ఝురులనింతు!

అనే అగర్వ ప్రతిజ్ఞతో అవతరించింది కృష్ణశాస్త్రి కవిత్వం. తావికన్నా మృదులతరమైన మనసు ఏండా దృఢ సంకల్పాలు నింపుకుంది. ఆ స్వేచ్ఛా గానానికి సంకెళ్ళు తెగిపోవడమొక్కటే సద్యః స్ఫూర్తి కాదు. ఈ మోడు మొకవంటి బ్రతుకంతా చివురులెత్తి మురువు చూపాలి. జనచిత్తము లానందమయ దీధితి సోలిపోవాలి సర్వం ఆనందమయంగా భావించాలి. యుగ యుగాలుగా ఈశ్వర యోధులై నిలచిన స్వాతంత్ర్య సమరయోధుల తపఃఫలం ధన్యత పొందాలి. మనిషి నిర్భయంగా బ్రతకాలి. కష్టాతపాలు సమసిపోవాలి. వంతల చీకట్లు వైదొలగిపోవాలి. అలాంటి స్వేచ్ఛకోసం తన కవిత్వం గానం చేస్తుంది.

కృష్ణశాస్త్రి స్వేచ్ఛాగానం మౌలికంగా పంచశీలాన్వితం ఆ గానం ఉత్త గానమేనా? కాదు, అది ఎంత పరువమైనదో అంత పరిమళభరితమైనది. ప్రతి పదము అమృత జీవప్రతిభతో పులకిస్తుంది. కొత్త బలంతో చలంతో పలకరిస్తుంది. పవలు రేలు అనే తేడా ఎరుగక విజన మార్గాల పడి నడిచిపోతుంది. "అజ్ఞాతభావి కాల యుగాలకు" పయనిస్తుంది, ఈ మాట వట్టినే కవితావేశంతో అన్నది కాదు. తీవ్రాభినివేశంతో స్థిర సంకల్పంతో అన్నది. అలాగే పయనించింది. ఒక ఆవృత్తాన్ని ముగించుకుంది. భారతీయకాలమానంలో అరవైయేళ్ళు ఒక ఆవృత్తం:

"మలయ సమీరణోర్మికల మాలికలన్ ప్రణయార్ద్రగీతికల్ మలచుతూ కృష్ణశాస్త్రి గీతం అనంతంగా సాగింది, నన్నయ్యగారి నుంచి చిన్నయ్యగారి

వరకూ ప్రతి కవీ పద్యాలు రాసినవాడే. అదృష్టవశాత్తు రాసిన పద్యాలన్నీ కవిత్వం కాకుండా పోవడమే చమత్కారం. "నానన నాననా నన నాననన" అనుకుంటూ అక్షరాలు పేర్చుకుంటూ పోతే ఉత్పలమాలా వృత్తమై తీరుతుంది. గణ బద్ధ ఛందంలో సంగీతం స్వయం సమృద్ధంగా చిప్పిలుతుంది. ఆ సంగీతం కవిత్వమేమోనన్న భ్రమా కలిగిస్తూ వుంటుంది. ఆ ధార వుంటే చాలు పద్యం రూపొందుతుంది. పద్యం రూపొందుతే చాలు కవిత్వమైపోయిందన్న భ్రమ కలిగిస్తుంది. కాని పద్య నిర్మాణ శిల్పం ఎందరికి తెలుసు? పద్యంలో ప్రతి పదాంతర్గత భావనా సౌందర్యం ఆవిష్కృతమవుతూ గణ తంత్ర బంధం మళ్ళించే డొంకతిరుగుళ్ళు తట్టుకుంటూ కవితామయంగా పద్యాన్ని సాగించడం గొప్పసిద్ధి. అలాంటి కవితా సౌందర్యసిద్ధుడు కృష్ణశాస్త్రి. దీనికి ఉదాహరణగ కృష్ణ పక్షములోని తేటివలపునే ప్రథమోపహారంగా అందించవచ్చు. ఈ ఖండ కావ్యం ఆతడు తన ఇరవయ్యవ జన్మదినంనాడు రచించానని ఒకసారి నాతో చెప్పారు. అలాగే పద్య కవితా శిల్పానికి వారి "అన్వేషణ" పరాకాష్ఠ. కృష్ణశాస్త్రి పద్యాలన్నీ ఒక్కొక్కటిగా ఉదహరించుకొని, అందలి కోమలగుణ రామణీయకతలను వింగడించుకోవాలన్న తీవ్రాభినివేశం సహృదయులందరికీ కలుగుతుంది.

1935 మే-జూన్, ద్వైమాస సంచిక ఉదయినిలో మాత్రమే ప్రచురితమై యింతవరకూ ఎక్కడా ఈ శీర్షికతో గ్రంథస్థంకాని "మధూదయం" అనే ఖండ కావ్యం-పద్యంలో భావావిష్కరణ కళకు అద్దం పడుతుంది. ఆపద్యాలు సంఖ్యకు ఐదే, గుణానికి అపార స్ఫురణగలవి:

> రేయి కొసన్ పసిండి నును రేకులు ప్రాకకమున్నె పైన
> మైపోయెడు
> మూగవీ వలుల పుంతలవల్లన నేగుదెంచి నే
> నెయెలుగెత్తి, నీ విలయు విస్మరణమ్మున నిల్చిపిల్తు "నా
> ప్రేయసి, ప్రేయసీ!" యని చలింపగ యుష్మదుప
> స్సుషుప్తులే!

> పిలుపెడ్డ బాటు వేసటనో వేకువ సోకుటనో మరేమొ జీ
> రలుపడిపోయెనో, పలుకరాక వెరంగిడెనాకె, తోచ కో
> మల కర్ణునాలసమ్ముగ తమ స్వమయాస్తమయాన నేలోయు
> ల్లలితము గద్గదమ్ముగ నగు ప్రత్యూషసీ హిమకంఠరావమై!

నీయిలు మోసలన్ ముసరుసింబకె హాయ శలాటువాసనలె
మోయుగ లేని పర్యోదల మూలుగో నిశ్వసన స్వన
మ్మోయే
మోయుని మేలుకో వలపవో సకియా, దరమీలితమ్ములౌ
నీ యెద రేపులన్ బాదువు నీడలుతోడనె మూగిపోవగా!
ఈ యెద సారె సారె కిసిరింతలు వాఱును నీతు సంకెలల్
వాయెగ నీ మధూత్సవ విభాత శుభోదయ వేళ ప్రేయసిన్
డాయగ తెక్కలార్చి గగనమ్మున చేరు కరంగి పాటలో
తీయనిపాటగాగ కయి తీయని పూవుల తేనె యూటగా!
పాడఱు వెల్లులో కోండువాడెడు కోర్కెలో
మోడుటాపలో
పోడిమిపీడు సౌఖ్యములో పోయెను పోయిన వేవు యీయాయకే
జాడలు, నిత్యనూతన వసంతములో యువ జీవకాంతులో
వాడని నందన ప్రసవవాటికలో మనకింక ప్రేయసీ!
(కృష్ణ శాస్త్రి పుట 123)

ఉదయిని సంపాదకుడు కీ.శే. కొంపెల్ల జనార్దనరావు—"కృష్ణశాస్త్రిగారు వివిధ సంప్రదాయాలూ తమ శిల్పనైపుణిలో పాడించి సాఫల్యము చూపుతున్నారు" అన్నాడు. "శిధిలాలయమ్మలో శివుడు లేడోయి అనే గేయం వారికి మంచి అభిజ్ఞానాలలో ఒకటి" అనిన్నీ ప్రస్తుతించాడు. పద్య శిల్పవిన్నాణాన్ని కృష్ణశాస్త్రి పద్యాలన్నీ పుణికి పుచ్చుకున్నవే. ధనుర్దాసు అనే శ్రవ్యనాటికలలోని పద్యాలన్నీ ఈ కోవకు చెందినవే. ఈ పద్యాలన్నీ ధనుర్దాసు శ్రవ్యనాటికలులోనూ పల్లకీపద్య-కవితా సంపుటిలోనూ సంకలితమై చదువరుల కందుతున్నాయి. ధనుర్దాసు నుంచి మచ్చుకు ఒక్కటే పద్యం—"ఒక కను గ్రీష్మ భీష్మ కుతపోగ్రతరార్యమ మండలమ్ము; కార్తిక శశిశాంశు బింబము గదే యొకనేత్రము; లోక లోక శాసకుడవు నీవు; నావలచు చల్లని సామివి నీవు; అకియుగ్మక మొకసారిగా విరియగా వెరగా యిక రంగనాయకా!"

అనే పద్యంలోని చివరిపాదం చదువుతూంటే నాస్తిక హృదయంలో సైతం భక్తి భావం వెంపెసలారుతుంది.

పొదుపుమలపై బంగరు ముగ్గులుంచడమూ, సంజ మబ్బులకు ఉంగరాలు పొదగడమూ, సుమలతల కపోలములలో సాను పాండుర వర్ణాలు పోల్చుకోవడమూ, పీలిపీదారాల తాళాలతాంత మాల అల్లడమూ వేయేళ్ళ తెలుగు కవిత్వ

చరిత్రలో కృష్ణశాస్త్రికి తప్ప మరెవ్వరికీ తెలియలేదు. ఐనా ఆ కవితా గంధర్వ కుమారుడు ..."కౌర్యకౌటిల్య పంకంబువలన మలినమైన హృదయ ధామం" లోనే నివసించవలసి వచ్చింది. నవసుమ మృదులమైన ఆ కవి మనస్సు విరహ బాధతోనే వేగి పోవలసివచ్చింది. "ఏడ జనిన మనోహారి జాడలరసి" గళగి పోవలసి వచ్చింది. కనులు మూసినా తెరచినా లోక మోహన మనోజ్ఞమూర్తి చిరునవ్వు చిలుకుతూ మ్రోల నిలిచేది. ఆ విరహాగ్నిచ్ఛటల క్రాగి ఉదయ నాళం తెగింది తన హృదయ ధనం తొలగిపోయింది. జీవిత ఫలం స్రుక్కి నేల పడింది. "శ్రావణ శ్యామ క్రూర జలదపటలిలో సౌదామనీ ప్రియ" మాయమై పోయింది. "ఎడపను లేక- బ్రతుకీడ్వను లేక ఓడిన ఎదలహత్తి, వాడిన ఎలుంగెత్తి, నాడు విడనాడిపోయిన దేవి కోసమై" అలా వేగిపోయే కవికి లోక మంతా ఏకోన్ముఖంగా హృదయ దళన దారుణ మహోగ్రకార్యం తలపెట్టినట్లు స్ఫురించడంలో అబ్బురం లేదు. అది కేవలం సంకుచిత స్వాత్మక భావన కాదు. వ్యక్తి పరకగాని, ఐకాంతిక విషాదంకాని కావు. ఆ నాటి లోకవృత్తం లోనే హార్దిక విషాదహృదయబాహుళ్యం విస్పష్ట దర్శనమిస్తుంది. కనుకనే కృష్ణశాస్త్రి బాధ లోకమంతటికీ బాధగా మ్రోగింది.

ఆ మధుర విషాద నైరాశ్యం నుంచి బయటపడే మార్గం కవికి కనిపించ లేదు. తానూ తన దుఃఖం తోడునీడగా మిగిలారు. తాను అనంత శోక భీకర తిమిరలోకైక పతిగా మారిపోయాడు.

ప్రతిమాటలోని పరువాన్నీ, పరిమళాన్నీ, మృదుత్వాన్ని కొలవడంలోనూ, పదం ప్రక్కనదాన్ని సుదతి పలువరసలా పోహళించడంలోనూ, నేర్పు కృష్ణ శాస్త్రికే తెలుసు ఒక పద్య పాదంలోని పదాలన్నీ కలిసి సమశ్రుతిలో మేళ వించబడిన సంగీత వాద్య సమాహారమై మొరస్తే గంధర్వ విద్య ఆయనకి పుట్టుక తోనే అబ్బినదా అనిపిస్తుంది. ఆ శాబ్దిక సముచ్చయమంతా కలసి పాఠకుని గుండెలలో సజీవ స్వరూపాలుగా కదలాడుతాయి. వన పతాకం వలె సురభిళాలు వెదజల్లుతూ నవ వసంతాల నాహ్వానిస్తుంది. చల్లని గాలు లుగా సోకి శరీరాలపై పులకలెత్తిస్తాయి. కృష్ణశాస్త్రి కవిత్వం ఒకే సమ యంలో ఐంద్రియకామతత్వ పరంపరని ఆవిష్కరిస్తూనే ఆంతరిక ఆవేదనల నెన్నిటినో మేలుకొల్పుతుంది.

కంటక కిరీట ధారినై కాళరాత్రి
మధ్యవేళల జీమూత మందిరింపు
గొలుసు కూటాల నేకాంతగోష్ఠి దీర్చి
దారుణవిబాంధరోదన ధ్వనుల శ్రుతుల

పొంగి ఉప్పొంగి....అర్ధరాత్రి గర్భంలోంచా విలాప నిబిడ గీతికావళిని వింపాడు. అలాంటి ఏకాంతసమయంలో కూడ తన్నెవరో క్రీగంట చూస్తున్నారు నోళ్ళుచప్పరిస్తున్నారు శుష్కమైన జాలి ప్రదర్శిస్తున్నారు. కవి అహం దెబ్బతింది. నన్నుగని ఏరు జాలి చెందంగ వలదు. నాకు నిశ్వాశ తాళవృంతాలూ, కన్నీటి సరుల దొంతరులూ కలవు. అవి గొంతెత్తి ప్రకటిస్తాయి. ఏదో ఒక ఆత్మ విశ్వాసం పొడమింది. నిబ్బరం చెప్పుకొన్నారు అలా ఏకాంత యవనికాభ్యంతరాన వెక్కి వెక్కి రోదించారు.

కృష్ణశాస్త్రి జీవితాంతమూ ముసలితనాన్ని ద్వేషించారు. కల్మషాన్ని ద్వేషించారు. దుర్గంధాన్ని ద్వేషించారు నిర్లక్ష్యంగా మృత్యువుని తృణీకరించారు. ఆ మనోభావాలను అనేక పర్యాయాలు కంఠోక్తిగా ప్రకటించారు కూడ. "నాకు మరణమ్ము వలదనినాను" అని. దానికేమిటి వివరణం? కారణం వారే చెప్పుకున్నారు. మరణమంటే భయంవల్లకాదు, దాని పేరెత్తితేనే ఒణుకు పుట్టేది కాదు మరి? "అసువులే తొలగిపోవ నా దుఃఖం వీడిపోవునేమో అను వెరపు వలన నాకు మరణమ్ము వలదని నాను" అని పూర్తిచేశారు.

కృష్ణశాస్త్రి ఒక సమాహార కావ్యం ప్రారంభ యౌవనపు భావ సంకీర్ణతకు కూడా ప్రాతినిధ్యం లభించకపోలేదు. అనే కాంశాలపై యౌవన హృదయాశ్చర్యమూ, కవితావేశమూ కేంద్రీకృతమైంది. తత్కాలికమైన వెడగుతలపులూ వింత ఉద్రేకాలూ సైతం చోటు చేసుకోకపోలేదు. సంస్కారబలం వల్ల ప్రౌఢనిర్భర వాక్య విన్యాసమూ అపారంగానే దర్శనమిస్తుంది అపూర్వ భావనాలోకమూ అడుగడుగునా ఆవిష్కృతమవుతుంది. కాని తనదిగా వచ్చే తెలుగు కవిత్వమంతా తన పక్షంగా నిలుస్తుందని కృష్ణపక్ష కవి ఆత్మ విశ్వాసం ప్రకటించుకున్నాడు. అది అలిఖిత సుహృత్ శాసనము. దానికే మది చెదిరిన శుక్లపక్షాల కొక్కిరాయిలు వెక్కిరింపులకు గురిచేశారు. అక్కిరాజు కాకా మరులు కొక్కిరించారు. ఈ ప్రతికూల ఋతుపవనాలు పరోక్షంగా కవిని శాశ్వతీకరించడానికే దోహదం చేశాయి. విమర్శల వెర్రిగాలి వచ్చినట్లే వెళ్ళిపోయింది. కృష్ణశాస్త్రి కవితా కంఠం నిర్నిద్రంగా మ్రోగుతూ నిలచింది

''ఈనాడు మన నవ స్వాతంత్ర్య వాసంత
నందనములోన స్వచ్ఛంద భారత కవిని
నిలిచి నిర్నిద్ర గళనిస్రుత సుధావిరళ
ఝురుల కురిపించి దెసదెసల పరపింపజేను''

అంటారు కృష్ణశాస్త్రి. నిజమే కవి భట్టుకాదు, ఊరికే దుర్మార్గులందరినీ పొగడడానికి, కవి ఉలూతమూ కాదు. పగటివేళ వెలుగుల సత్య సందర్శనం నుంచి

తప్పించుకుందుకు. అతడు ఆరిపోని తరుణ విస్ఫులింగం అంటూ మహోద్రేకంగా తరువాతి కాలంలో తెలిపిన స్వచ్ఛంద భారత కవి వాణికి పసితనంలోనే పెగలని పునాదులు వేసుకున్నారు. కృష్ణశాస్త్రి ( మా పల్లకి పు. 56 నుండి 58. ఆగస్టు 15)

తెలుగు పలుకుబడి వున్నంతకాలమూ, తెలుగు రసనకు రసజ్ఞత జీవించి నంత కాలమూ కృష్ణశాస్త్రి కవితా కంఠం అజరామరంగా నిలచేవుంటుంది.

## ప్రవాసమూ : ఊర్వశి

ఈ రెండూ మహత్తర కవితా సుమనికుంజాలు. విరిపోయెదలు, మేలిమి కడావి నిగ్గు మెరుపులు. ప్రతి పద్యమూ అనుభవ సారళ్యంతో నిశితమై అమరింది. అనుభూతి సాంద్రతతో పరిమళ భరితమైంది. శుష్క చమత్కారం కోసమో, పోడిపోడిగా నామడులు పేర్చటం కోసమో కృష్ణశాస్త్రి మాట పోగు లెక్కడా పేంపరు. కవి ప్రేయసి సుధామయూఖరేఖ. ఆమె అడుగుల సందడులు అఖాతాల ఏకాంతాలలో మొరపి మెల్లగా మాయమయ్యాయి. అవి కవి ఎదద్రోవల పడినడచినట్లు భ్రమకొల్పాయి. పోనీ అక్కడా ఆగవు. నదిలేని నడిరేయి పడిపోయినట్టి ఆమె కడియాల రవళులూ చిరుగాజు మ్రోతలూ తనకు వ్రేలెత్తి చూపు జీవిత పథాలుగా మారిపోయాయి. ఆ శూన్యం దుఃఖ కారకమై పోయింది కవికి. అప్పుడు గొంతెత్తి ఏడ్చాడు. ఎవడు మాత్రం అంతకన్నా ఏం చేస్తాడు. ఒరులు నవ్విపోదురుగాక. తనకేటి సిగ్గు. తన స్వేచ్ఛ నెప్పుడో ప్రకటించుకున్నాడు.

కవి దుఃఖాన్ని కాంచగానోపలేని తారకలు కన్నులట్టిబెట్టి ఆర్పుకున్నాయి. మొయిళ్ళు నల్లని కట్టూర్పు భారాలై పోయాయి. ఇంకా ప్రకృతి పరిసరాలలో ఎలా సాక్షాత్కరించింది? అప్పుడు తుంచుకొని, కుంచుకొని కుహూ కుహూరవాటలను తొలగి, దవ్వుదవ్వుల చనికిరాలు వాల్చుకొనినవి, తిమిరాలు భయవశాన. గాలి వసిపాపవలె రిచ్చపడిపోయింది. రాక రాక తనగళ తమః పథమ్ముల రేగిరేగి రోదనోచ్ఛలిత ఉచ్ఛగీతా దురంత దుస్సహోర్పులు వెడలి" రానారంభించి నాయి. ఆ సమయంలో సర్వమూ శూన్యంగా కవికి కనిపించడంలో అసహజత లేదు. ఇపుడు ప్రళయమ్ము క్రమ్మినదేమో కాక, దొరకదో విల్వ పీడ నా చిరుత పాటకు? అంతటి నైరాశ్య గాంభీర్యం ఆవహించింది. ఈ మహానంత విశ్వమే అలముకొన్న చీకటులతో యిరుకై పోయింది. ఎటు చూసినా సంకుల విషాద జల దరచ్ఛాయలే దర్శనమిస్తాయి. పొంచివున్న బాష్పాంబువిధులు ఘోషించాయి.

తనపాటలా రెక్కలు తెగిపోయినపులుగులు, లోకేశుని ఎడద నిండా ఏడుపు వెక్కిళ్ళ వెగ ఊర్పులూ-సందడులూ, ఏర్చు పొగలూ, బయల్వెడలే వగల పొగలు షష్టి జననీ పురాణ గర్భకుహరం—ఎరుపు మంటల మూలుగులను విదళిస్తూంది. బ్రతుకు పాడిల్లుగా మారిపోయింది నిజానికిది ఆనాటి కృష్ణశాస్త్రి ఆత్మస్థితి మాత్రమే అనుకోనక్కరలేదు. దేశమాత హృదయమే పాడిల్లుగా కుమిలిపోతోంది. నిత్యమూ కరువులూ వెరపులూ వైదేశికపాలకుల నిరంకుశస్వైరవిహారమూ—దేశాన్ని నాకేస్తోంది.

ఆ విభావరీవేలా శాలలలో ఊర్వశి మృదుపవనాంచలాల గుసగుసలు వినరాకపోయినా ఆ కడలేని రాత్రిలో అనంతయాత్ర సాగించాడా కవి పగ లెరుగని ప్రవాసంలో వేకువ రేకులు విరుస్తాయేమోనని ఎక్కడో ఒక సన్నని ఆశ. నిజమేమరి తాను గంధర్వలోకం నుంచి జారిపడినవాడు. ఈ దరిద్ర హేమంతంలో చైత్ర శుభోత్సవ విధాత కళ్యాణం చిగురిస్తుందేమోనని కవి ఎద లోపలి ఎదలో ఒకచిన్న వెలుగురేఖ కిన్నరీరమ్య కంఠసీమలో శ్రావణాంబుదాశ్లేష పాళిలో విరహగీతి పగిది, విహరించాడు. అప్పుడే శిరసులెత్తిన పూలు కవిని చూస్తూనే ఉన్నాయి. పొల్చుకుంటున్నాయి. పిలుస్తున్నాయి.

# ఆరో ప్రకరణం

## చలివేళ పొలిమేర ఆమని పొడిచె

ఇరవయ్యో శతాబ్దంలో మూడు నాలుగు దశాబ్దాలు తెలుగు కవిత్వానికి మహోజ్వల కాంతి రేఖల వెలార్చాయి. ఆంధ్రదేశం నాలుగు మూలలా కవిత్వమే.... కవిత్వమే. ఒక వినూత్న మలయ పవనోర్మిక ప్రసరించింది. ఊరూరా నాటా నవ్య కవులు ప్రజలలో విపరీత సంచలనం కలిగించారు. కవులంటే ప్రజల కెంతో మోజు కవులూ, కవిత్వమూ నాగరిక పౌరులందరికీ ఆరాధ్యమైంది. సాహిత్యం సామాన్యులకు ప్రధాన భాగదేయమైంది. నిత్యనైమిత్తికావసరమైంది. ఈ మూలనుంచి ఆమూలవరకూ తెలుగునేల అంతటా నవ్యకవిత కోసం ఎత్తిన చలువ పందిళ్ళు. ఈ స్థితి అంతకు ముందెన్నడూ లేదు.

నేటి సినితారలంటే నవయౌవనులు ప్రదర్శించే వెర్రిమోజువంటిది, ఆనాడు కవులపట్ల కేంద్రీకృతమయ్యేది. అలాంటి కొత్త కెరటాలను ప్రేరేపించిన భావకవితాయుగానికి కృష్ణశాస్త్రి మణివిరాజిత కళ్యాణ మకుటధారి। ఆకలా, దాహమా, చింతలా, వంతలా ఏమీ ఎరుగని వెర్రి ఉద్రేకం। అది కవులకూ, ప్రజలకూ ఆనాటి సామాన్య జీవలక్షణం. వెర్రిగా ఏకతము తిరుగాడుతూ అడవులలోను, కోనలలోను దాగిపోదామనుకునే విర్హేతుకోత్సేకం।

కృష్ణశాస్త్రి భావుకవుల్లోనే భావకవి. చుక్కల్లో చందమామ। ఆయన ముఖాననే భావ కవితా ప్రభావం పొడిచింది. ఆయన భావకవితా మహోద్యమం కోసమే పుట్టాడు. దానికి విశిష్ట రూపురేఖలు సంతరించాడు. తెలుగు కవితా శారదకు శరీరమే కాని హృదయం రసపుష్టితో పెంపొందలేదు. ఆ శరీరమైనా కనిపించకుండా ఎరువు సొమ్ముల బరువులు. కచభార, కుచభార, నీతిభారాలతో వెర్రి శారద క్రుంగిపోతోంది. ఆ కృతకాద్రులన్నిటిని కూల్చిన వాడు కృష్ణశాస్త్రి. తెలుగు శారదకు కొత్త నడక నేర్పాడు. కొత్త సొగసు లమర్చాడు. ఆయన తెచ్చిందంతా కొత్త ఊహ, కొత్త ఇతివృత్తం, కొత్త కవితా శిల్పం మరీ కొత్త।

అవును తత్పూర్వ యుగాలలో తెలుగు కవిత్వమెన్నడూ సమకాలీన సామాజికుల హృదయావేదనలను సంస్పృశించి ఎరుగదు ఎప్పుడూ గతం వైపే దాని చూపు, ఎప్పుడు పితృదేవతల కథలే దాని జీవన వృత్తాలు.

జీవితంలో ఎలాంటి అవినీతిపరుడైనాసరే, కవిత్వ రచన వచ్చేసరికి పెద్ద నీతి ప్రవక్తగా మారిపోయేవాడే; ప్రతి కవీ ఎంత పచ్చి శృంగారంతో కావ్యాన్నంతా నింపినా చివరకు ప్రధాన పాత్రలన్నిటికీ మోక్షాన్ని ప్రసాదించగలిగేవాడే; కన్సర్వేషన్ ఆవ్ కేరక్టర్సు వారి ప్రధానధ్యేయం. ఆనాటి యతివృత్త నిర్వహణ పరిశీలిస్తే ‘‘Nothing is dishonest than stupid moral conviction, nothing more stupid than a pseudomorality’’ అంటూ డిలాన్ ధామస్ వెక్కిరించిన మాటల్లో ఎంతో సత్యం ఉందనిపిస్తుంది. అలాంటి గతానుగతిక సాంప్రదాయాన్ని విచ్ఛేదంచేసి, సమకాలీన సమాజ హృదయాన్ని కళామయంగా ప్రతిబింబించడమే కాక కళాభిరుచిని ప్రోదిచేయడం కూడా తన బాధ్యతగా గుర్తించింది భావకవిత్వం. కవి బ్రతుకుతున్న కాలానికి కవితా హృదయం ప్రతినిధిగా నిలిచిన యుగమది;

## రొమాంటిక్ ప్రభంజనం

పశ్చిమ దేశాలలో వీచిన రొమాంటిక్ ప్రభంజనాల ప్రభావం భారత దేశంలో పరుచుకుంటున్న రోజులవి. రొమాంటిసిజమ్‌కు తెలుగులో కాల్పనిక వాదమనే అనువాదం స్థిరపడింది. కాని అది సమగ్రంగా సమానార్థకం కాదు. ఈ రొమాంటిక్ ఉద్యమ అంతస్సారాన్ని నిర్వరించుకొని, తెలుగులో రొమాంటిక్ కవిత్వం పుట్టింది. జాతీయ పునరుజ్జీవన మహోద్యమంలో ప్రబలతర అంతశ్శాఖగా విస్తరిల్లింది. ఫ్యూడల్ సామాజిక నిర్బంధాలపై సాగిన జైత్రయాత్రలో ఒక భాగంగా హార్దిక జీవనధాతువు లందించింది. బూర్జువా ప్రజాస్వామిక వ్యక్తి చైతన్యం ఈ కవితా శ్రేణిద్వారా ప్రప్రథమంగానూ, ప్రస్ఫుటంగానూ అభివ్యక్తమైంది.

ఇక్ష్వాకుల కాలం నుంచీ ఇంగ్లీషువారి కాలంవరకూ ఫ్యూడలిజమే మన సమాజంపై పెత్తనం చేస్తోంది. తరతరాలుగా ఫ్యూడలిజం స్త్రీని భోగవస్తువుగా మార్చింది. నగల నీతుల కట్టుబాట్లతో బానిసగా మార్చింది. పురుషాహంకారానికి సామాజిక దాష్టీకానికి స్త్రీని నిరంతరాయంగా గురిచేసింది; ఈ పరిస్థితికి వ్యతిరేకంగా పునరుజ్జీవనోద్యమం ఎలుగెత్తింది. స్త్రీ పురుషుల మధ్య అసమానత్వానికీ, కులాల మధ్య అసమానత్వానికీ వ్యతిరేకంగా పోరాడటమే తన జీవిత ధ్యేయంగా ఆ ఉద్యమం స్వీకరించింది. జీవిత మహాయాత్రలో నారీ నరులిరువురూ సమాన భాగస్వాములేనన్న స్ఫురణ నూత్న చైతన్యాన్ని ఆవిష్కరించింది.

వీరిరువురునీ అవిచ్ఛిన్నంగా ఏకం చేయగలిగేది హృదయ ప్రేమ తప్ప అన్యమేది కారాదు. ఈ నూతన భావం ముందుగా కవులకు స్ఫూర్తి నిచ్చింది. ఇది సర్వత్రా వాంఛనీయమూ, ఆమోద యోగ్యమూ అగు నాగరికతా సూత్రంగా మారింది. ప్రజాస్వామిక జీవన సరళిగా అంగీకరించబడింది.

రొమాంటిక్ కవులకు ప్రకృతి ప్రధాన ఆరాధ్యదేవత. కారణం, మరేమీ లేదు. ప్రకృతి యథేచ్ఛా వ్యాపారానికి పరమోత్కృష్టమైన ఆవిష్కార రూపం. ప్రకృతి స్వేచ్ఛా వృత్తిని పరిశీలించినవారికి మానవ సమాజం ఎంత అస్వతంత్రతలో మగ్గుతున్నదీ స్పష్టపడింది. ఆనాటి కవి ఈ వైయక్తిక స్వేచ్ఛాపిపాసతో పురోగమించక తప్పింది కాదు. సామాజిక పరిసరాలతోనూ, రాజకీయ విధానాలతోనూ తలపడకనూ తప్పింది కాదు.

మాతృదేశం బానిసత్వంలో మ్రగ్గుతూన్నదన్న స్పృహ ఆంగ్ల విద్యాభ్యాసం వల్లనే ప్రేరణ పొందింది. ఆంగ్ల భాషాధ్యయనం ద్వారా దేశ దేశాల రాజకీయ సామాజిక స్థితిగతుల పరిశీలనకు అవకాశమేర్పడింది. తద్వారా వారి హృదయాలలో దేశాభిమానం పొంగులువారింది. దేశ స్వాతంత్ర్య వాంఛ కవితా హృదయానికి బాసటగా నిలిచింది. జగంనిండా స్వేచ్ఛాగాన ఝరులు నింపే అపూర్వ యత్నంలో కవితా హృదయం కదలిపోనారంభించింది. వారి స్వేచ్ఛాప్రియతకు నిర్దిష్ట నిర్వచనం లేకపోవచ్చు. స్వాతంత్ర్య స్వరూపం గురించిన అవగాహన కూడా సమగ్రం కాకపోవచ్చు. వారాశించే స్వేచ్ఛకు సిద్ధాంత పరంగా ఆధారసూత్రమూ లేకపోవచ్చు; కాని ఆ స్వేచ్ఛారాధనమే వారి హృదయాలకు నూతనోజస్సులందించింది. వారి కవితా రీతికి నవీన కాంతి చేకూర్చింది. ఈ భావ పరిణామం మాత్రం నిస్సందేహంగా సాక్షాత్కరిస్తుంది.

## ప్రబంధాల బంధాలనుంచి

దాదాపు ఐదువందల సంవత్సరాలుగా బిగిసిపోయిన ప్రబంధాల పదబంధాలలో తెలుగు కవిత్వం కృశించిపోయింది. నిలవ నీరుగా మారి గబ్బుకొడుతోంది. పాడిందే పాటగా మారి పాచికంపు కొట్టింది. కవులలో ప్రయోగ దక్షత లోపించింది. నవనవోన్మేషశాలీ ప్రతిభామతా అనే అలంకారిక మతానికి కాలదోషం పట్టింది. పర ప్రత్యయనేయ బుద్ధులుగా మారారు కవులు. అట్టి సుడిగుండాలలోంచి జగన్మోహినివలె లేచివచ్చిన నవ్య కవిత్వం నావ్యతా దర్శనీయ రస మార్గాలను అన్వేషించింది. నిమాత్మ భావుకత్వాన్ని వెలార్చుకుంది. అపూర్వ శైలీ విన్యాసాన్ని సంతరించుకుంది. సంవిధానంలో అనవద్యతను సముపార్జించుకుంది.

ఆత్మాశ్రయ ఇతివృత్తం స్వీకృతం కావడంతో పాటు కవుల వైయక్తిక అహమిక ప్రవేశించింది. తాదృశమైన మనోభావాలూ, పరిదేవనలూ అనుభవాలూ కలిగిన సమాజ శ్రేణికి—అంటే మధ్యతరగతి మేధావి వర్గానికీ అహమిక ప్రాతినిధ్యం వహించింది. అంటే కవి హృదయావిష్కరణలోనే సమాజ హృదయం భాసించనారంభించింది.

ఈ విధంగా కవితాభివ్యక్తిలో ఏర్పడిన సమగ్రమైన మార్పు సామాజిక చైతన్యాన్ని ప్రోది చేసింది. సామాజికుల అంతరాత్మలు పరిసరాల నిర్బంధాలలో పంజర బంధితమై ఉన్న సత్యం ఆలోచనాపరుల కవగతమైంది. ఇదే చైతన్యానికి ప్రేరణ. అట్టి పరిసరాలతో నిరంతరాయంగా వ్యక్తి సంఘర్షించడం తప్పనిసరి. ఈ ప్రతిఘటనకే ప్రథమతః భావకవిత్వం అక్షర రూపమిచ్చింది. అలతి అలతి పదాల సౌకుమార్యంతో ఈ ఆక్రోశాన్నే ఆవేశింపచేసింది. అచ్చమైన హృదయ సంబంధి కళాస్పర్శకు పట్టాభిషేక మొనర్చింది.

లఘ్వక్షర సంయోగంవల్ల పూర్వ ఛందస్సులలో ఆవేశం నిబిడీకృత కాకపోలేదు. ఈ ఆవేగమే మూలాధారంగా వృత్త ఛందస్సు లన్నింటా బహుళంగా ప్రయోక్తమైంది. ఆ ఆవేగం నవీనయుగ ధర్మానికి తలబరువు కాకతప్పలేదు. సుహృత్ సమ్మితంగా హృదయ ప్రేరణ కలిగించడానికి కవిత్వంలో గేయగుణం అవసరమైంది. రొమాంటిక్ ఉద్యమానికి కవితావాహకం లిరిక్ (Lyric) దానికనుగుణంగానే జానపద గేయ రీతులు పునరాదరణతో అగ్రపీఠికెక్కాయి. ఈ ప్రాణావసర స్వరూపాన్ని అప్పటికే గురజాడ సంసిద్ధం చేశారు. పిట్ట చిన్నదే కావచ్చు, కాని దాని విహాయస గమనశక్తి అపారం. దాని కల నాదం అపూర్వం: అది కలిగించే ధ్వని తరంగాలూ అగణితాలే:

## పాటల పేటి

అంతవరకూ తెలుగు కవిత్వం సాధించిన సర్వఛందోరీతులనూ కృష్ణశాస్త్రి అవలీలగా ప్రయోక్తం చేయగలవారే. కాని వారి కవిత్వమంటేనే భావగీతం. గురజాడ అడుగుజాడలలోనే గమనంసాగిస్తూ భావగీతాన్ని తన ఉచ్ఛ్వాస నిశ్వాసంగా మార్చుకోగలిగిన బసవరాజు అప్పారావు కృష్ణశాస్త్రి అగ్రేసరుడే కారు. ఆదర్శప్రాయుడూను. జానపద కవితారీతికి సభాగౌరవం కలిగించిన నండూరి సుబ్బారావు కృష్ణశాస్త్రితో భుజం భుజం రాసుకున్నవాడు. ఆత్మ పరతకు కవితా ప్రాధాన్యత కలిగించిన కవులలో కృష్ణశాస్త్రి ఆద్యులు కాకపోవచ్చు. కాని నిస్సందేహంగా ప్రథమారాధ్యులయ్యారు దీనికి కారణం లేకపోలేదు.

చైతన్యపూరితమైనవారి అవగాహన ఈ పరిణామగతికొక సిద్ధాంతాన్ని రూపొందించింది. ఉత్తమమైన ఆత్మపరమైన కావ్యంలో ఉన్నంత లావణ్యం

మరొక కావ్యంలో ఉండదు. ఊపినచోట అది వూపినంత మరొకటి ఊపదు" వారన్నారు. దీనిని బట్టి—వారి విశ్వాసము స్పష్టపడుతుంది. కవిత్వానికి లావణ్యత ప్రధానంగా అమరాలి. రెండోది-గుండెల్ని ఊపే శక్తి దానికి అలవడాలి. ఈ అవగాహన ఆనాటి కవిత్వానికొక స్థితిని ఏర్పరచింది.

కవితా భావుకతలో స్వేచ్ఛ, ఆలోచనా రీతిలో స్వేచ్ఛ కవితా నిర్మాణంలో స్వేచ్ఛ అనే త్రిగుణాత్మకతకు విస్తృత ప్రాముఖ్యత లభించింది. దీనిని మున్నెన్నడూ తెలుగు కవిత్వం ఎరగనే ఎరగదు. పైన తెలుపబడిన త్రిగుణాత్మక స్వేచ్ఛకు కవిత్వ పరిభాషలో ఆయన యిలా నిర్వచించారు.

తిమిరలత తారకా కుసుమములు దాల్చ
కర్కశ శిలయు నవజీవ కళల దేర
మోడు మోక నివురులెత్తి మురువు చూప
(జగమునిండ స్వేచ్ఛాగాన ఝుకులనింతు.)

అదీ వారి ప్రతిజ్ఞ. ఇందులో ఈ మూడు స్థాయిలూ స్పష్టంగా దర్శనమిస్తాయి. అవి వరుసగా యివి:

1. అంతవరకూ ఉన్న లోకం ఒక "తిమిరలత" వంటిది. కంటికేమీ కానరాదు. నిస్తేజమైన చీకటి. అట్టి చీకటి పొదరింట తారకాకుసుమాలు విరిసే రీతిగా తన స్వేచ్ఛాగానం సాగుతుంది. దిగంతాల నింపుతుంది.

2. అంతవరకూ ఉన్న సమాజం కర్కశ శిలా సదృశంగా పడివుంది. కదలదు, మెదలదు. తాను శిల్పి. ఆ శిలపై తన పోగారు కదలించి రాగాలు పలికిస్తాడు. ఉలితో తాటించి వలపులూరిస్తాడు. సుత్తితో సుతిమెత్తని తాళాలు మోయిస్తాడు. అప్పుడది జీవకళల తేరుతుంది. అంటే సామాజిక స్వరూపం మనోహర జీవశిల్పంగా మారిపోతుంది. తన గానానికి మారు పలుకుతుంది.

3. అంతవరకూ సామాజిక జీవితం మోడు మోకలా నిర్జీవంగా నిలచి ఉంది. దానికొక మురువులేదు మురిపెమూ లేదు. తాను స్వేచ్ఛాగాన ఝుఝులు నింపడానికే ఉదయించాడు తన గాన తరంగాల తాకిడికి ఆ మోడు మోకకు దోహదక్రియ జరుగుతుంది. చివురులెత్తుతుంది. తన ఇంద్రజాలిక శక్తితో సమూలంగా మారిపోతుంది. పునఃప్రాణవంతమవుతుంది సకల శాపాల పాశాలనుండీ విముక్తమవుతుంది. సామాజిక విషమనీతుల నిర్బంధాలు తొలగిపోతాయి. సామాజికుడు కట్టుబానిసగా మారిపోయి వున్నాడు. కర్కశ శిలగా ఘనీభవించి పోయాడు. అతడికి స్వేచ్ఛ లభించి తీరుతుంది.

పైన వివరించినట్లే కాక సాధారణార్థాలలోనికి ఆ త్రిగుణాత్మక స్వేచ్ఛని మదించితే యిలా వుంటుంది. సామాజికంగా స్వేచ్ఛ, రాజకీయంగా బానిసత్వం నుంచి స్వేచ్ఛ, సకల నిర్బంధాలనుంచీ స్వేచ్ఛ: ఇదీ ఆరాధ్యం:

## గాలి ఈత: వెలుగు మేత

భావకవిత్వం సమాజభూతలాన్ని విడిచిపెట్టిందనీ, కేవలం గాలి ఈతగా, వెలుగు మేతగా మారిపోయిందనీ ఈ దేశంలో అపార్థం చేసుకోబడింది. విపరీత నిందకూ గురైంది దానికి వారి చూపే ఉదాహరణలు లేకపోలేదు కృష్ణశాస్త్రి, ఒక మానసిక పరిక్లేశంలో రచించిన ఒక వాక్యాన్ని సందర్భంనుంచి, పూర్వాపరాలనుంచి విడదీసి వారు చూపుతూ ఉంటారు. "దిగిరాను దిగిరాను దివినుండి భువికి, నా యిచ్ఛయే గాక నాకేటి వెరపు" అనేది. కవి ఆశించే స్వేచ్ఛకిది పతాక సన్నిభమే తప్ప, దివితోనే తప్ప అతనికి భువితో సంబంధమే లేదనే అపార్థమునకు తావులేదు.

భావకవిత్వపు ప్రధాన జీవలక్షణం ఆత్మాశ్రయత్వమే తప్ప దానికి సమకాలిక సమాజంతో ప్రమేయమిసుమంతయినా కానరాదనీ మరో తీవ్ర నిందారోపణ చేసినవారూ ఉన్నారు. ఆ అవగాహనతోనే కాబోలు-చలంగారు సైతం కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ అన్నారు. నిజానికిది సరికాదు. సత్యాన్ని తలక్రిందుగా చూడటమే:

అనాటి సమాజం అప్పుడప్పుడే నిద్రనుంచి మేలుకొంటోంది అదీ సామాన్య నిద్రకాదు. దీర్ఘనిద్ర. అలసాసంగా కన్నులెత్తుతోంది లోకం. పూర్తిగా కన్నులు తెరచి నలుముకొని తేరిపార జూచే సత్తువా దానికబ్బలేదు. నిద్రమత్తులో మునిగిన కన్నులకు విస్పష్టంగా కనిపించదు జగత్తు. ఏది సత్యమో, ఏది అసత్యమో, స్పష్టంగా తేలడంలేదు ఇంకా....ఏది స్వతంత్రమో, ఏది పరతంత్రమో సందేహం వదలలేదు. సంధియుగపు బరువులు తొలగలేదు. జాతి పాత బంధాలలో మూలుగుతోంది. ఆ చారిత్రక సంఘర్షంలో చైతన్య విలసితమైన భావకవి హృదయంలో ఉప్పెనలా పొంగివచ్చింది, స్వేచ్ఛా ప్రియత్వం. అట్టిదాన్ని కేవల ఆత్మాశ్రయత్వమేనని తిరస్కరించబూనడం న్యాయం కాదు. భవిష్యత్తుకు మేలూ చేయదు. భావకత్వంలోని ఆత్మాశ్రయత్వంలో సమాజ శ్రేయం ధ్వనింపబడుతూనే వుంది. మూగ సమాజం ప్రతిబింబిస్తూనే ఉంటుంది. ఈ క్రింది పద్యభాగాలు పరిశీలిస్తే మరింత స్పష్టంగా సాక్ష్యాధారాలు లభించగలవు.

1. పక్షివలె నాకాశ నిర్మల
పథ విహార స్వేచ్ఛ గోరితి

పక్షములు లేవంచెరుగక
పాగ్రికులాడుచు పాగిలిలిన్. పు. ౧౦. కృష్ణపక్షం.

2. ఏను మీవలెనే కంఠమెత్తి పాడ
నెంత యుబలాటపడి సవరింతు గొంతు
ఏను మీవలెనే నవాసూన గాన
విస్మృత వ్యోమ యానాల వెడలి వెడలి
భావలో కాంచలమ్ముల వాలవలతు పు. 71

పైవానిలో రెండవ ఉదాహరణలోని 'ఏను మీ వలెనే' అన్న దానిలోని "మీరు" స్వేచ్ఛా జీవితం అనుభవిస్తున్న జాతులుగా మనం అన్వయించుకుంటే, కవి స్వేచ్ఛా ప్రియత్వం నిరాధారమైనదిగా పొడగట్టదు. సామాజిక హృదయంలో సైతం యిదే ఆవేశం ప్రబలితమవుతున్నదె: దానినే కవి వ్యక్తిపరంగా పలుకు తున్నాడు. అంటే కవి హృదయం సమాజప్రతినిధిగా మారి పలుకుతోందనే అర్థం. ఈ ఆక్రోశం శూన్య ఆక్రోశం కాదనీ, ఈ ఘోష ఉత్త అరణ్య ఘోష కాదని అర్థం చేసుకోవాలి.

## కృష్ణశాస్త్రి శోకం:

"నన్ను మనసారగా ఏడ్వనీరు మీరు" అనే వాక్యాన్ని ఉల్లేఖించి, సందర్భాన్నీ, కవిమనస్థితినీ (mood), బుద్ధిపూర్వకంగా విడిచిపెట్టి-విపరీత వ్యాఖ్యానంతో వెక్కిరించారు కొందరు. అలాంటి విమర్శకులు కవిని సహృదయతతో అవగాహన చేసుకుందుకే తిరస్కరించిన వారుగా కనిపిస్తూనే ఉంటుంది. కృష్ణశాస్త్రికి ఏడుపే వాంఛనీయమనీ, అదే నిరంతరం ఉపాదేయమనీ వ్యాఖ్యానించిన వారున్నారు. విమర్శకులు తమ వ్యక్తిగత భ్రాంతిని కవికి ఆపాదించడమే అవుతుంది. కవి తెలిసిన శోక సంకేతాన్ని మనమెలా అవగాహన చేసుకోవాలి?

సమాజం నికృష్టస్థితిలో తల మునిగి ఉంది. ఆంగ్ల విద్యాభ్యాసంతో ప్రపంచజ్ఞానం అలవడిన మేధావి లోకాలన్నీ చుట్టు చూపుతో కలబరిగాడు. ఇతర జాతుల సమాజాలతో తులనాత్మక పరిశీలన జరుపుతున్నాడు. తన సమాజం ఎంత హీనంగా ఉన్నదీ తెలిసింది. కులాల అంతరాలతో సంకులమై పోయింది. అస్పృశ్యతతో అమానుషమైఉంది. స్త్రీని-తన చెల్లిని, తల్లిని, ఇల్లాలిని బానిసగా రూపొందించింది. సమాజం సకల విధ కాలుష్యాలతో కృశిస్తోంది. ఈ బాహ్యస్థితిగతుల స్వరూప సందర్శనమే కవికి ఆంతరిక చైతన్యవిస్ఫూర్తికి

ఉద్రేకతకమైంది. కవి ఈ సంకుల సమస్యలను తానుగా పరిష్కరించలేదు. నిస్సహాయస్థితిలో అతనికి ఆక్రోశమే మిగిలింది.

ఈ దుర్భర పరిస్థితులను పరిమార్చడం కోసం చేయగల కర్తవ్యమేదో ఆనాటి కవికి అవగాహన కాకపోవడంలో ఆశ్చర్యంలేదు.

నేటికీ సైతం ఎందరో మేధావులు కర్తవ్యతావిమూఢులై సీసాలలోనికి తలలు దూరుస్తూనే వున్నారు. ఆ దుస్సహ పరిస్థితులను కవి శపించదలచాడు. ఆ శాపం అభివ్యక్తిగానే గొంతెత్తి ఏడవదలచారు. కాని శోకం అమంగళకరమని లోకం అతన్ని వారిస్తోంది ఏడవనీయదు. స్వేచ్ఛాభివ్యక్తిగా పంచుతున్న ఏడుపుకు సైతం అవకాశం లేని పరిస్థితి. అతని అభీష్టం పరిసరాలతో ఘర్షిస్తోంది అంతే; భావకవిగా కృష్ణశాస్త్రికి ఏడుపే చరమ వాంఛితం కాదు.

లోకం కట్లు సహజాలంకారాలనుకుంటోంది. వాటినే పూజిస్తోంది. స్వేచ్ఛాకుమారుడైన కవిని సైతం-కట్లకే అంకితం చేయసంకల్పిస్తోంది. దాని కిష్టపడక కవి గొంతెత్తి విలపిస్తాడు. "నన్ను విడువుడు, ఒకసారి నన్ను విడిచి నంత నేనేకాంతయవని కాళ్యంతరాన వెక్కివెక్కి రోదింతును;" అంటూ ప్రాధేయపడతాడు. లోకానికి విజ్ఞాపనం చేస్తాడు.

తన చుట్టూగల లోకం అనంత శోకభీకర తిమిరంలో కొట్లాడుతోంది. దాని కతడు పతిమాత్రమే. అంటే వాగ్విలసనం ప్రసరించగల సశక్తి ప్రతినిధి మాత్రమే: తన కెదురైన లోకం ఎలాఉంది? నిశీథిమధ్యంలో తారట్లాడుతోంది. తనదరికి చేరిన వారినందరినీ "హృదయ దళన దారుణ మహోగ్ర కార్యంబు దలచి" పీడిస్తోంది. ఆ లోకం ప్రణయమధురిమ నెరుగదు. పాపమనీలేదు. "పక్షములు దూల్చి, బంధింతు పంజరాన: వెర్రి లోకమ: హృదయ స్వేచ్ఛ నెటుల పంజరంబున బంధింతె?" అంటూ కవి సవాలు చేస్తాడు.

ఘోర కాంతార కుటిల కఠోరవీధులందు-నిద్ర పోతోంది లోకం. తాను మాత్రం—"కుటిల కఠోర వీధుల"లో తిరుగాడుతున్నాడు. ఎందుకు తిరుగు తున్నాడో, తనవలెనే వేరెవరైనా మేలుకొన్న నరమానవులున్నారేమోనని వెదుకు తున్నాడు. ప్రావృతంబోదరస్వామి ఎదురయ్యాడు. "నీవు కూడ నా వలెనె జాలి వాడవు వాపోవుచుంటివా?" అని అడుగుతాడు. మారు పలకక వైదొలగుతుంది. సంధ్యా సమీకరణమూ తారపిల్లుతుంది.

''నీదు నునులేత రెక్కల మీద వడిగ
నెత్తుకొని పోవరాదె నన్నిచటికేని
నిత్య తేజోమయానంద నిలయమునకు''

అని ప్రార్థిస్తాడు. నిత్యం తేజోమయంగానూ ఆనందమయంగానూ ఉండే నిలయమే అతనుకోరుకొనే ఆవాసభూమి: కాని కవి ప్రార్థనఫలించలేదు. ఇక మిగిలిందేమిటి? తన దుఃఖమేతోడు పీడగాగ నిశలు గడుపుతున్నాడు.

"ఎద కరుగునట్లు సన్నని ఎలుగుతోడ
నల్బి తలలెత్తి, పాటకూ కొట్టు చేడ్చు
గౌతమీ వీచికాళి సగంబు నిదుర..."

లో జోగుతూ ఎదురైంది. తానా ఏకైక ప్రవాసి అప్పుడు గొంతెత్తి ఏడ్చినాడు. అంతటి దుఃఖాకవిత మనస్థితిని తారకలు సైతం చూడలేకపోయాయి.

"అప్పుడు నన్ను గాంచగానోపగా లేక
కన్నులట్టె యార్చినవి తారకలు..."

## స్త్రీ రా గ మ యి:

అమృతోపమానమైన ప్రకృతి ప్రదర్శించే అనంత సౌందర్యానికి, స్త్రీ ప్రతిబింబం. ఆమె ప్రణయైక స్వరూపిణి. సౌందర్యాధి దేవత. ప్రకృతి సౌందర్యానికి వివశుడవుతూన్న భావకుడైన కవికి స్త్రీ రాగమయమూర్తిగా దర్శనమిచ్చింది. ఆమె కిలకిల నవ్వే పువ్వు. అంచులలో మెరుపు లందగించుకొన్న మబ్బుతునక. మధుర స్వరాల వినిపించే-చిన్ని పులుగు. "ప్రసవకోమల రమణీయ పథముబట్టి—" పోతున్న లావణ్యమూర్తి ఆట్టి మనోహరమూర్తిని అతిలోక రమణీయ కవితాహృదయుడైన కవి ప్రేమించడం—పుష్పవ్రజం సౌరభాలు విరజిమ్మడ మంత సహజం. చందమామ వెన్నెలలు వెదజల్లడ మంత అనివార్యం. ప్రవహించడమే ధర్మంగా గల సలిలంలాగ రాగసీమలు ప్రసరించడం తన హృదయానికెంతో నైసర్గికం. వినరే లక్షణం గల గాడ్పులకు మల్లేనే—తనహృదయానికీ ప్రణయ వీచులు సహజసిద్ధాలు. కనక వెనుక చూపు లోకం తనను తప్పుపట్టే అవసరం లేదు. సహజత్వాన్ని కోల్పోయిందది. కృతక ధర్మాల బరువుల క్రింద నలిగిపోతున్న బావిస. దానికి కవి వినిపించే మృదు మంజులోక్తులు వినిపించవు.

కృష్ణశాస్త్రి, పాటలు—నునుమబ్బు లేదునుక కొనలపై పోనలు.... నెల వంక చిరునవ్వు చలువ పాటలు.... ఉష స్వపీ స్వచ్ఛశీతల మలయానిలాలు.... తొలిప్రొద్దు పొడుపు రేకులపైడి దారుల పరులా మంచుకన్నీటి పాటలు.... జడ మయంగా, విద్యావివశంగా పడివున్న లోకానికి ఎలా అర్థమవుతాయవి?

భావకవితా వనప్రియ:

భావ కవితోద్యాన వనంలో సుషమ మంజుల సుషిలా వగల వెలయించిన కవి కృష్ణశాస్త్రి, కవితా కుసుమాలు గుత్తులుగుత్తులుగా వెలయించిన తరుణ శృంగార మధుర మాధవుడు నిజంగా ఆయనే. చిర నిద్రలపాగిలిన చలివేళలు పొలిమేరకు చేరగా ఆమనిలా పొడుచుకుంటూ వచ్చిన మధుమూర్తి॥

కలికి పాటల కోయిల కులంలో పుట్టిన వనప్రియ కృష్ణశాస్త్రి, రాజ రాజేశ్వరీ కిరీట రాజఘటిత రత్న మాణిక్య కాంతి విరాజనార్చితాంఘ్రి, పిరేజ యుగళుడై గళమెత్తి ....శప కవితావాణిని లావణ్యతేజగా నిలిపినవాడు. కవితా పదధ్వనుల నటరాజ స్వరూప మందుకున్నవాడు;

ఎట్లూహాసేయుటో ఎరుగలేక
వంగి వంగి శిరము వొంచి కుంగిపోడు''

అనుకుంటూ నమ్రమస్తకుడైన కలధ్వనుడాయన. తన కన్నీటి చుక్కకు పరమ పావన జాహ్నవీ ప్రతిభ వెలార్చుకున్నాడు. మధుర గేయమంజరులతో భారతిని అందగించాడు. మధుర గేయచుంబిత సుందర చరణారవిందగా ప్రియభారత జన యాత్రిని కొల్చుకున్నవాడు కృష్ణశాస్త్రి. ఒక్కొక్క శోకగీతంలో అమృతతరంగా శోకాన్ని ఉప్పొంగించిన ఇంద్రజాలికుడు కృష్ణశాస్త్రి.

# ఏడవ ప్రకరణం

## భావ కవిత్వపు మొదలు

ఇరవయ్యో శతాబ్దపు తొలి దశకంలో సెలయేటి పిలగాలిలా ప్రారంభమైంది భావకవిత్వం. రెండు, మూడు దశాబ్దాలలో మహోద్యమ రూపం పొందింది. 1915 తర్వాత సమగ్ర ప్రాభవాన్ని సంతరించుకుంది. తెలుగు వాకిళ్ళ అనూచానంగా మార్మోగే పాటల సంప్రదాయాన్ని పునర్మించడానికి గురజాడ అప్పారాయకవి దీక్ష వహించడం ఒక మహోద్యమానికి అంకురార్పణే. దానితోనే రీతిలోనూ, వస్తువులోనూ సర్వంకష పరిణామ స్వరూపం విస్పష్టంగా ఏర్పడింది. తెలుగు రచనలపై ప్రవర్ధిల్లిన గేయ రీతులెన్నో వివిధ రూపాలుగా వంతన మొనర్పబడ్డాయి.

గురజాడ తర్వాత బసవరాజు అప్పారావు, చింతా దీక్షితులూ గేయకవితా రీతిలో మరిన్ని కొత్త ప్రయోగాలు చేయనారంభించారు మరింత ప్రతిభ ప్రదర్శించారు బసవరాజు అచ్చమైన లిరిక్ స్వభావాన్ని సాధించారు. గేయానికి ఆత్మాశ్రయ సురభిళాలనద్దారు, దైవిక జీవితానికిబాసటగా కవిత్వాన్ని నిలిపారు. రెండోవారు తెలుగుజాతిపసితనాన్ని గుర్తెరిగి కథన గేయాలు వంటి బాలకవితను వెలార్చారు.

దాదాపు యిదే సమయంలో నండూరి సుబ్బారావు ఎంకి–నాయుడు బావ అనే భూగంధ సౌందర్యంగల ఊహాత్మక పాత్రలను బాసటగా నిలుపుకొని ఆత్మాశ్రయ రీతిలోనే యెంకి పాటలు రచించారు. 1921 నాటికి కృష్ణశాస్త్రి కొత్త కవిగా ప్రఖ్యాతుడయ్యాడు. కొత్త కవిత్వానికి భాష్యకారుడయ్యాడు. వెంకట పార్వతీశ్వర కవులు రచించిన ఆత్మాశ్రయ కావ్యం ఏకాంతసేవకు గొప్ప ఉపోద్ఘాతం రచించి భావకవిత్వానికి మేనిఫెస్టో ప్రకటించారు. గేయానికి సన్నిహితమైన సంప్రదాయ ఛందోరీతులన్నీ స్వీకరించబడ్డాయి. తేటగీతి, ఆట వెలది, మంజరీ ద్విపద, రగడ వంటి లిరిక్‌కి సన్నిహితంగా ఉన్న రూపాలుసమాదరింపబడ్డాయి. అప్పటికే రాయప్రోలు సుబ్బారావు తృణకంకణం, స్నేహలత మున్నగు కథనకావ్యాలను గీత మాలికలుగా రచించి వస్త్వాశ్రయ కావ్యాలను

భావకవితాశ్రేణిలో విలిపారు మార్గ కవితారీతిలో లాలిత్యానికి ప్రథమ గౌరవం కలిగించారు. అబ్బూరి, పింగళి, కాటూరి కవులు ఈ మార్గాన్ని అప్పటికే పరిపుష్టం చేస్తున్నారు. వీరంతా మార్గ కవితా స్వరూపాలను స్వీకరించి వాటి అంతస్సత్వంలో విపరీత సంచలనాత్మక పరిణామాన్ని సాధించారు.

అయినా భావగీతికే సింహాసన స్థితి కల్పించబడింది. దీనికి నవీన మానవ మహోద్యమంగా రూపొందిన బ్రాహ్మమత ఉద్యమం దోహదం చేసింది. ప్రార్థనా గీతాల అవసరార్థం కృష్ణశాస్త్రి భావగీతికా రచనకే సూత్న ప్రయోగాలు సల్పారు. ఆనాటి స్థితికి వారలా వ్యాఖ్యాన మందించారు "అసలు నేను హృదయవాదిని. నాకు కవిత్వం ప్రాణం. సంగీతం మరీని. అన్నిటికన్న నాకు కావలసింది మనిషి, నాకు మతాలూ, వాటి రహస్యాలూ, బ్రహ్మజిజ్ఞాస యోగం—పరోక్షం అపరోక్షం వగైరా లేమీ తెలియవు. మనిషే నా మతం....అలాగే సాహిత్య రూపాలు సిద్ధాంతాలూ, ధ్వనీ, వక్రోక్తి, రసం—ఎగ్గెలా వగైరా పెద్దలంటారే అవేమీ తెలియవు. కవిత్వం తెలుసుకొని అనుభవించడం తెలుసు. అట్టినాకు ఆ సమావేశాల్లో ప్రాణం లేచిరాదా?...." అలాలేచి వచ్చిన ప్రాణం కొత్త పాటల రెక్కలతో ఆకాశలోకాలన్నీ చుట్టివచ్చింది.

గేయం నవ్య కవితకు ప్రధాన వాహకమైనపుడు దాని పూర్వ స్వరూపం ఏమిటనే పరిశీలన సహజమే. జానపద గేయకవిత్వాన్ని పరిశీలించడం మన కీర్తనా సాహిత్యాన్ని అవలోకించడం ఆనాటి కొత్త కవిత్వాన్ని ప్రపంచిస్తున్న వారికి తప్పని సరే అయింది. అందలి రసపుష్కలతనీ, అనుభూతుల అభివ్యక్తిలో గల ప్రసాదగుణాన్ని భావకవిత తన వారసత్వంగా స్వీకరించింది. దీనికీ గురజాడయే మార్గదర్శక చైతన్యం కలిగించారు. మిగిలినవారు ముందుకు సాగడంలో స్థిరచిత్తాన్ని ప్రదర్శించారు. ఈ దశలో అంటే 1916-25లలో ముమ్మూర్తులా భావకవిత్వానికి, నవీన కవితా ధర్మానికి, ప్రాణప్రతిష్ఠ చేసినవారు కృష్ణశాస్త్రి. కవిత్వానికేగాక భావకవికి సైతం నవీన రూపురేఖలను నిర్వచించిన వారాయనే. కృష్ణశాస్త్రివలె వేషభాషల నలంకరించుకున్న వాడే భావకవి, అలా రాసినవాడే భావకవి అనే ఒక అలిఖిత శాసనానికి కారణభూతుడాయనే। తెలుగు భాషలో గల కవిత్వ యోగ్యమైన నుడికారాన్ని సువిశితం చేసిన వారాయనే. కవితాభాషను పరమ నాగరికంచేసిందీ, తెలుగు పదాలపోహాళింపులో శిల్ప విన్నాణాన్ని ప్రదర్శించింది ఆయనే। కవిత్వం గొట్టుపదాలను, అర్థ గాంభీర్యంలేని శబ్దశపటాటోపంతో మ్రోగే సుదీర్ఘ సమాసాలనూ వైదొలగించింది ఆయనే। సుకుమార సుందర వాక్య సందోహంతో హృదయార్తిని, అనుభూతి పారమ్యతనీ అభివ్యక్తం చేయడంలో కవితకు కొత్త షోకులెన్నో తైపేసిన వారాయనే। ఈ విధంగా నవ్య కవితను సంపన్నమయంచేశారు కృష్ణశాస్త్రి. భావకవితగా దానికి సమకాలీన మానవ హృదయ సింహాసనంపై అధివసింప చేశారు.

గేయగుణవిరహితమైన మూరుమూల పద్యాలను నవీన కవిత పరిగ్రహించ నవసరం లేదన్న నిషేధాన్ని అమలు జరిపిన వారాయనే; కవిత్వానికి ఆచ్ఛమైన హృదయానుభవ సారళ్యతే ప్రధానమన్న వింగడింపు ఆచరణలో నిర్ధారణ చేసిందీ ఆయనే. విశ్వనాథవారు ప్రస్తుతించినట్లు కృష్ణశాస్త్రి భావకవితకు ప్రవక్తగాక, నిరంతర ప్రచారకుడు కూడ దానికి ప్రజానుకూలతను సంఘటితం చేశాడు. ఆనాటి భావకవితలలో ఉత్తమమైనవాటిని ఊరూరా హృద్యంగా గానం చేస్తూ సంచరించాడాయన. తెలుగు దేశంనాలుగుమూలలా ప్రచారం చేశాడు.

నవీన భావకవితా లక్షణం గేయగుణ ప్రాధాన్యంగా ఆయన ముఖతావిని తెలుగు జాతి అవగాహన చేసుకుంది మనోహరగానంతోనూ, అంతకన్న ఇంద్ర జాలికశక్తితో శ్రోతలను సమ్మోహపరచే ఉపన్యాస వాగ్ధాటితోనూ నవ్యకవితా వైశిష్ట్యాన్ని ఉగ్గడిస్తూనూ, సాహితీ రసికులను ఆయనే భావకవితకు విబద్ధులుగా మార్చారు. ప్రజలా కవిత్వంతో తాదాత్మ్యస్థితి పొందారు.

ఈ కారణం వల్లనే నవ్య కవితపై సనాతనులు వీచిన గాలి దుమారాలకు ప్రజలు ఖాతరు చేయలేదు. సనాతనాచారపరాయణులు పండితులుగా ఎంత ఉద్దండ పిండాలయినావారు, ప్రచలింపచేసిన పిడుగుల జడిలో ప్రజలు కొట్టుకు పోయివుంటే మన కవితా పురోగతికి మరో అర్ధశతాబ్దిపాటు అవరోధం కలిగేది. ఆ ప్రమాదం నుంచి తెలుగు జాతిని, భాషని కాపాడిన మహావీరుడు కృష్ణశాస్త్రి. ఈ కారణం వల్లనే శాస్త్రి మొదలభావ కవిత్వమనే సూక్తి స్థిరపడింది. కాని నిజానికి భావ కవిత్వపు మొదలనే కృష్ణశాస్త్రి అనడమే సరైన అంచనా అనిపిస్తుంది.

ఆయన స్వయంగా భావకవితను నిలబెట్టడం కోసం కావించిన ప్రచారంలో మరో రెండు ప్రయోజనాలు సిద్ధించాయి. తిరుపతి వేంకటకవుల ప్రభావంతో ఒక ఫ్యాషనుగామారిన జంటకవుల ఆశుకవితా ప్రదర్శన ఒక క్షుద్ర ప్రదర్శనంగా అనాదరణ పొందనారంభించింది. రెండోది కవిత్వమంటే కేవలం పద్యమే కాదని అందరికీ తేటతెల్లమైంది. హృదయాలలో సుప్తమయ్యే అనుభవాన్నీ, అను భూతినీ, ఆవిష్కరించడమే కవిత్వ ధర్మంగా పరిగణింపబడింది. భావ సారళ్య తతో మనసులో మరుగున పడివున్న స్వప్నజాలాన్ని మేలుకొల్పడమే కవిత్వ ధర్మమన్న సిద్ధాంతం సర్వజనామోదకరమైంది.

భావకవితలోని ఒక అంతశ్చైతన్యరేఖ స్వాతంత్ర్యోద్వాహ ప్రకటన. దానికి గురజాడ కవిత్వంలో రేఖామాత్రంగా బీజావాపన జరిగింది. తదుపరి కాలంలో విశిష్టస్ఫూర్తితో నవ్య కవితాంతర్భాగంగా వికసనం పొందింది. దర్శనమ మారినా భారత స్వాతంత్ర్యోత్సాహంతోపాటు తెలుగు జాతీయ వాంఛ స్వరాష్ట్ర

సముపార్జనగా కవి హృదయం ప్రతిధ్వనించింది. 1922లో విశ్వనాథాదుల 'ఆంధ్ర ప్రశస్తి' ప్రభృతి కావ్యాలు ఆవిర్భవించాయి. అసంఖ్యాకంగా కవులు చైతన్యధారలు కురిపించారు.

ఆనాటి సామాజిక చైతన్యమే, కవితా చైతన్యాన్ని నిర్దేశించింది. గత కాలపు ప్రేతాత్మలతో బ్రతకడాన్ని కవిత్వం తిరస్కరించింది. సమకాలీన చైతన్యావిర్భూతికి పరమబాధ్యత వహించింది. సామాజిక చైతన్యం కవుల చైతన్యాన్ని నిర్ధరించినట్లే చక్రనేమిక్రమంలో కవితా చైతన్యం సామాజిక చైతన్యాన్ని ప్రభావితం చేసింది. ఈ పారస్పర్యం అకుంఠితంగా భావకవితా యుగంలోనే ప్రధమశః ప్రస్ఫుటమైంది. సమకాలీన యుగ చైతన్యం భావ కవితలోనే మొదటిసారిగా స్పష్టాకృతిలో ప్రతిబింబాలు నెలకొల్పుకుంది. ఆ చైతన్యం సామూహిక చైతన్యమో, వర్గచైతన్యమో, కాకపోవచ్చు. మధ్య తరగతుల వ్యక్తిగత చైతన్యంగానే పరిమితం కావచ్చు అలాగని అది తప్పు పట్టవలసిన నేరం కాదు. అలా తప్పు పట్టేవారిని చరిత్ర గమనాన్ని పరిగణిం చిన వారు కాదనాలి.

భూస్వామ్య వ్యవస్థపై, దాని సాంఘిక బంధనాలపై వచ్చిన తిరుగుబాటు వ్యక్తి చైతన్యప్రేరకంగానే ఆరంభమవుతుంది. దాని సాహిత్య పాత్రను భావ కవిత్వం నిర్ద్వంద్వంగా నిర్వహించింది. దీనికి కృష్ణశాస్త్రి ఈ క్రింది మాటలలో సాక్ష్యం యిస్తున్నారు. "ఆ Feudal విధానాలలో చాలా బాధపడ్డవాడ్ని గనుక సంస్థానాలు పోయి తీరుతాయనే ఆ నమ్మకం నాకు ఎప్పటి నుంచో ఉంది" అంటారు.

గతానుగతికంగా సాగిపోయిన సాంఘిక దురాచారాలతో పాటు కవిత్వపు కట్టుబాటుతనాన్ని సైతం భావకవిత్వం ఛిన్నాభిన్నంగా చేసింది. వర్తమానం నెత్తి మీదగతాన్ని మోవడమే ఆర్ష సంప్రదాయంగా భావించే మూఢ విశ్వాసాన్ని త్రోసివేసింది. పాఠకుని హృదయ స్పందనకు యిది వరకెన్నడూ ఎరుగని ప్రాముఖ్యతను కల్పించింది. ఈ చారిత్రక ప్రాధాన్యతను గుర్తించకుండా ఆనాటి సర్వ సమస్యలనూ భావకవిత పరిష్కరించలేదని దానిని పలాయనవాద బాధితమనటం దృష్టిదోషమే

ఐతే రానురాను భావకవిత 'ఐకాంతిక హృదయవాదం'గా రూపొంద నారంభించినది కవిని పరిపూర్ణద్రష్టగా పెరగనీయలేదు. లోకహృదయాన్ని సంక్షుభితం చేసే సమస్యలన్నిటినీ తమ సమస్యలుగా భావించే సామాజిక చైతన్యం దిశగా పురోగమింప చేయలేదు. ఈ బలహీనతను కృష్ణశాస్త్రి గ్రహించారు. 1930 తర్వాతకాలంలో ఆయన ప్రజాస్వామ్యవాదిగా, గాంధీవాదిగా రూపొందారు.

అంటరానితనాన్ని వర్ణాశ్రమ ధర్మాల మూఢాచారాలతో కునారిల్లుతున్న హిందూ సమాజ విశ్వాసాలతోనూ ఆయన యౌవనారంభంనుంచి జీవితాంతం పోరాడుతూనే ఉన్నారు. వ్యక్తి ధాష్టీకాన్ని నిరసిస్తూనే ఉన్నారు. జాతి జనులంతా కమ్మగా బ్రతికితేనే గాంధీమతం ప్రదీప్తమవుతుందనీ కొన మనిషివరకూ ప్రతివాడికీ కడుపునిండా తిండి దొరికినపుడే గాంధీవిధానం విజయవంతమవుతుందనీ విశ్వసించారు. సర్వమతాలు ఏకం కావాలనీ, అల్లాయైనా, నారాయణుడైనా దారిద్ర్యాన్ని పోకార్చడానికి ఒక్కరీతిగానే మనిషికి బాసటగా నిలవాలనీ ఆయన ఆకాంక్షించారు. అందుకే ఈ శతాబ్దపు రెండో దశాబ్దంలో కన్నులు తెరచి లోకాన్ని పారచూచిన కృష్ణశాస్త్రి,పరిపూర్ణమానవతావాదిగా జీవితాంతంపరిసరాలతో పోరాడుతూనే బ్రతికారు. మనిషికి అధిష్ఠానమూర్తిగా ప్రేమించి ఆరాధించారు.

# ఎనిమిదో ప్రకరణం

## "గద్యం కవీనాం నికషం వదన్తి"
## చలం — కృష్ణశాస్త్రి

గద్యం కవీనాం నికషం వదన్తి అనేది వామనుడనే అలంకారికుని ఉద్ఘాటన. అతడేముహూర్తాన ఈ మాట అన్నాడోకాని, ప్రతివారూ పరిపాటిగా పునరుక్తం చేస్తూనే ఉంటారు. ఉత్తమ గద్య స్వరూప స్వభావాలెలా ఉండాలో ఏ ఒక్కడూ నిర్వచించడు. ఎలాంటి గద్య కవినాం నికషం కాగలదో వివరించరు.

ముద్రణాయంత్రం ప్రవేశించి అక్షర వాహనంగా రూపొందిన తర్వాత, వాక్ వ్యాపారమంతా ప్రధానంగా వచనంలోనే సాగుతోంది. ప్రజల ప్రధాన సాహిత్య ప్రక్రియ గద్యమే అన్నంత ప్రాచుర్యం వహిస్తోంది. గోంగూర పచ్చడి తయారించే పద్ధతులు లగాయతు గోపుర నిర్మాణ శాస్త్రం వరకూ సర్వమూ శుద్ధ వచనంలోనే రచించబడుతోంది. పెట్టుబడిదారీ యంత్ర నాగరికతకు ప్రధాన ఆవిష్కార రూపం ముద్రణా యంత్రమై స్థిరపడింది.

ఇంత విస్తృతి లభించిన ఈ వచన రూపమంతా వామనాచార్యుడు నుడివిన నికషప్రాయమైన వచనమే కాగలుగుతుందా?

కానేకాదని నిష్కర్షగా చెప్పుకోవచ్చు. ఐతే మరి ఎలాంటిది? ఏ గద్యం కవిత్వ అంతస్సత్వాన్ని సారభూతంగా ధరిస్తుందో ఏగద్యం కవిత్వ ప్రాణధాతువు లన్నిటినీ శ్రద్ధగా తనలో నిబిడీ కృతం చేసుకుంటుందో అలాంటి వచనం మాత్రమే కవి తత్వానికి నికషప్రాయం కాగలదని స్థూలంగా నిర్వచించుకోవచ్చు. అంటే ఉత్తమ వచనం కవితా తేజస్సునీ, సౌరభాన్నీ తన స్వీయలక్షణంగా ఆవిష్కరించుకోవాలన్నమాట.

పై సూత్రాన్ని ప్రచలితం చేసినవారు ఇలాంటి నిర్వచనం చేశారా అంటే చెప్పడం కష్టమే. కాని మన అనుభవ పరిపాకం ఇలాంటి స్పష్టతేఖల్ని స్ఫురిస్తుంది. లేకపోతే ఏ ఉత్తమ శక్తిలేని ఉత్త చప్పిడి వచనాన్ని కవి హృదయం పరీక్షకు నికషంగా ఎలా నిర్ణయించగలుగుతాడా అలంకారికుడు?

ఆంగ్ల భాషలోగల సాహిత్య ప్రక్రియలన్నిటికీ తెలుగులో ప్రతిరూపాలను వెలువర్చినవాడు యుగపురుషుడు కందుకూరి। తదాదిగా మన భాషలో ఎంత వచన మైనా రచింపబడింది. గిడుగు వ్యావహారిక భాషా శంఖారావంతో తెలుగుజాతి మేలుకుంది గురజాడ మహాకవి కన్యాశుల్కంవంటి మహత్తర నాటకాన్ని అందించాడు. దిద్దుబాటువంటి కథానికలూ సమర్పించాడు వ్యావహారిక భాషకు లక్ష్యరేఖలను నిర్ధరించాడు. తదాదిగా వ్యావహారిక భాషలో సైతం టన్నులకొద్ది వచన రచనలు వెలువడ్డాయి. ముద్రణాయంత్రానికి ప్రధాన ఆహారం వచనమే నైవేద్యమైంది.

ఇన్ని వచనరచనలలోనూ కొన్ని ప్రధాన రీతులుగా స్థిరపడ్డాయి. మన ప్రథమ వచన రచయితలలో చిన్నయసూరి దొకదారి, వీరేశలింగంగారిదొకరీతి, పానుగంటి వారిదొక మార్గం. చెళ్ళపిళ్ళదొక బాణీ. వీరంతా ఆధునిక వచన రచనా రీతికి పిత్రుపాదులైన మహనీయులు. రెండో తరంలో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి దొక రీతి, మల్లాది రామకృష్ణశాస్త్రి దొక తీరు, చింతా దీక్షితులుగారి మార్గం మరొకటి, చలంగారి శైలి యిందరికీ భిన్నమైనది. కవులలో కృష్ణశాస్త్రి గారి శైలి హృద్యమైనదైతే విశ్వనాథవారి శైలి తార్కిక నిబద్ధమైనది.

ఇన్ని మార్గాలు సంసిద్ధమై ఎదురు నిలిచిన మనకి ఉత్తమరీతి యేదో యిద మిత్థంగా పోల్చుకోవడం సులువేమీకాదు, కాని అవసరమే। ఏ వచన రచన చదివితే చదువరికి గొప్ప కవిత్వం చదివినట్లు మనోహరానుభూతి కలుగుతోంది? ఓజోవంతమైన జలపాతంలా నిండా మునిగిన దివ్యానుభవంతో హృదయం నిండుతుంది? మన ఆంతరాంతర తమోలోకాలను నిస్సీమితంగా ఏ వచన రచన వెలిగిస్తోంది? ఒక విస్ఫూర్త రసపరిపాకం మన ఆంతరికధాతువుల నద్దుతుంది? ఏతావతా మనలోంచి ఒక విస్ఫూర్త మానవుని ఆవిష్కరించగలిగే గద్య రచన యేది? అవే ప్రశ్నలు మన అన్వేషణకు మార్గదర్శక సూత్రాలవుతాయి. అప్పుడే మనం ఉత్తమ గద్య రచన యేదో పోల్చుకోగలుగుతాం.

సాధారణ పాఠకుని ఆంతరికానుభవం రెండు రకాలుగా ఉంటుంది. జ్ఞాన పరిపాకంతో పూంజీభవించేదొకటి, అనుభూతి పారమ్యతతో పరవశీభూతమయ్యే దొకటీని. సాధారణంగా వచన రచయితల రచనలలో మొదటిదాని పాత్ర విరివిగా కనిపిస్తుంది. అనుభూతి పరంపరలను తెరలించే వచన రచనలకోసం మనం మరో దిక్కుగా మొగం త్రిప్పి వెదుకులాడాలి. అప్పుడు మన పిపాస తీర్చే గద్య రచయితలు ప్రధానంగా యిరువురే మనకు సాక్షాత్కరిస్తారు. వారు చలం—కృష్ణశాస్త్రిన్నీ.

వీరిలో చలం కేవలం వచన రచయితగానే ప్రాముర్భవించాడు. అభ్యాస

సాధనాలతో కృషి సల్పారు. కవి కల్పుడై గద్యాన్ని కవితాస్థాయికి సముచ్చ తీకరించాడు.

కృష్ణశాస్త్రి కవిగా అవతరించినవాడు. చిరంతన కవితాధ్యానంలో ద్రష్టగా పరిణతినందుకొన్నాడు. కేవలం వాగ్వ్యాపారంతోనే తనదైన ఒక శైలిని సంతరించుకున్నవాడు ఆధునిక కాలావసరాల ఒత్తిడితో రచించిన సామాన్య వచనాన్ని సైతం కవితాస్థాయినుంచి పతనం కాకుండా కాపాడుకున్నాడు.

చలం వచనం ప్రియురాలివలె లాలిస్తుంది. గడసరిగా ఆజ్ఞాపిస్తుంది. మిత్రునిగా హితవచనాలందిస్తుంది. ప్రభువు వలె దండిస్తుంది. తద్వారా మన హార్దిక మాలిన్యాలు క్షాళనం చేస్తుంది.

కృష్ణశాస్త్రి వచనం గుండెల దగ్గర పెదవులు చేర్చి నెచ్చెలివలె గుస గుసలాడుతుంది. తల్లిలా చెవులకు దగ్గరగా చల్లగా లాలిపాడుతున్నట్లు మెత్తగా ఏవేవో అనుభవాలను కెరటాలు కెరటాలుగా ఊరిస్తుంది: ఉరికిస్తుంది. నెమ్మదిగా మృదు మంజుళంగా అనుభూతులనెన్నిటినో ఆవిష్కరిస్తూ సాగుతుంది. లోకానుభవాలను అందిస్తూ మన గుండె లోపలి గుండెలో గుడిసుళ్ళు తిరుగుతుంది. ఏ పురా లోకాలా విశృద్ధ సంగీతాలనో వెరలిస్తుంది.

చలంగారి గొప్ప వచనానికి పేర్కొనవలసిన ప్రేమలేఖలు, మ్యూజింగ్స్, నాటకాలలో శశాంక, పురూరవ వంటి వెన్నో ఆధునిక గద్య రచనలకే గోపుర కలశాలుగా మన హృదయాలలో చిరావాసం కల్పించుకుంటాయి. మన అనుభవ పరిధిని విస్తృతం చేస్తాయి. మన మనస్సులను ఉత్తమ సంస్కార తేజః పుంజాలుగా వెలయిస్తాయి. మన రసనను, రసజ్ఞతనూ పెంపొందింపస్తాయి. మనజీవితాన్ని మరింత జీవన యోగ్యంగా మారుస్తాయి.

కృష్ణశాస్త్రి వచన రచనలు మూడు పుస్తకాలే ప్రచురితమయ్యాయి. ఆయన ఉపన్యాసాలు, వ్యాసాలు, ఇష్టాగోష్ఠులూ సంభాషణలూ వంటివింకా ముప్పయిమూడు గ్రంథాలుగా ప్రచురితమవాల్సి వుంది. వచనకావ్యాలనదగిన హృద్యమైన గద్యరచనలు "మా ఊరుపోయింది," "కోవెల కొలను," "మా ఊళ్ళో పేద అరుగు," "బహుకాల దర్శనం," "అప్పుడు పుట్టివుంటే" వంటి వెన్నో!....ఆయన వచనం చల్లగా వీమురుతున్నట్లు సాగుతుంది. తేనెలో మంచు తొరపినట్లు హాయిగా వుంటుంది. తెల్లవారేసరికి ఒక అపూర్వానుభవ పరంపరలోనికి మనల్నెత్తడానికి వేంచేసిన తేజోమయ దివ్య హస్తంవలె భాసిస్తుంది. వీరిరువురి గద్య రచనా సిద్ధిలోనూ గలమౌలిక విశిష్టత ఏమిటీ: అంటే మన అనుభవాన్ని స్మృతిగా జ్ఞానం మార్చుకొని చెప్పాలి!

"Hardly any good poet has written bad prose: and some

poets have been among the greatest of prose writers. Shelley was a great poet and a great prose writer also. Not in his correspondence, but certainly in his defence of poetry. This is not a sign of versatality but of unity."

అంటాడు టి. ఎస్. ఎలియట్ (తన 18వ శతాబ్దపు కవిత్వం అనే వ్యాసంలో). ఒకడు ప్రాథమికంగా కవి అయితే చాలు, వాడి వచన రచన హృద్యంగా ఉంటుంది అనేది అతని పిండితార్థం. ఎలియట్ సూక్తిని సార్వత్రీకరణం చేసుకోదలిస్తే మాత్రం ఆశాభంగమే ఎదురవుతుంది. కారణమేమంటే బాహ్యార్థానికి ఎలియట్ మాటల్లో ఎంతో ఔదార్యం ధ్వనిస్తోంది. అంతరార్థంలో మాత్రం కొందరు గొప్ప కవులే గొప్ప గద్య రచనలు చేయగలరనే అర్థమూ ధ్వనిస్తోంది. మన కాలంలోనే ఎందరో కవులు దుర్భరమైన వచన రచయితలుగా దర్శనమీయడం మనమెరుగనిది కాదు.

ఈ క్రింద ఉదాహృతాలైన కృష్ణశాస్త్రి వాక్యాలు కొన్నే. కాని కవితల మిన్నులు తెగలించేందుకవే చాలు. అల్పాక్షరసంభరితాలైన వాక్యాలే ఐతేనేం మిన్నేటిగల గలలూ, నవ్యార్థాల తళతళలూ సహృదయులకు విందుచేస్తాయి.

1. "ఓహో! ఏ అంగడికి వెళ్ళడం! ఏ పూవులేరుకోవడం! సరసుని మనసు చెదరిపోతుంది, చెదరక, వాసనలు పిలచే వన్నెలు పిలచే పుష్పకానికల కన్నులు పిలిచే....కలికి నవ్వులు పిలిచే!"

2. తుంగభద్ర కాస్త ఒళ్ళు విరుచుకుంటూ కునుకు పట్టి ముందులాగ కూని రాగం తీస్తుంది.

"పంపా సరోవరంనుంచి కాబోలు లేతగాలులు వచ్చి విజయనగరంలో చొరబడుతున్నాయి.

"తుంగభద్రలో దిగి తామ్ర పాత్రలో నీరు నింపుకుంటున్న ఒక యువతిని చూచి, రుద్రయ కవి తూలిపడి కూర్చుంటాడు. కూర్చుని ఆమె వైపు చూసి— పద్యం చదువుతాడు.

3. కోనేటిలో గల గలలాడుతూ పొరలే చిరుకెరటాలు కూడా ఒక్కసారి ఆగి, ఊపిరి బిగబట్టి నివిమతీ కరిగిపోతాయి.

ఆ సమయాన కోవెల గంట పిలుపూ, ఆల అంబారవమూ, దవ్వులనుంచి ఒక్కొక్క మానవ కంఠస్వరమూ, ఒక్కొక్క పక్షికూతా, రెక్కల రెపరెపా, తరగల గలగలా, ఈ ధ్వనులన్నీ కలసి పల్లెలో ప్రతియింటా వినబడి, మరీ నిశ్చల నిశ్శబ్దంతో గ్రామ వాతావరణాన్ని నింపినట్టు అనిపిస్తుంది.

4. కోనేటి నీళ్ళలోకి ఒదిగి నేనెన్నిసార్లో నా ప్రతిబింబమే కాదు, నా హృదయాంతరాళాలు కూడా చూచుకున్నాను. అలాగ చూచుకున్నప్పుడల్లా, కోనేరు

నా సంగతి తెలుసుకొని గలగలమంటుంది. ఉసురుసుంటుంది. నేనప్పుడు కోనేటి కడుపులోనుంచి గోపుర శిఖరమెక్కుతాను.

5. నా మనస్సులో పకుళ వాసనలూ వెన్నెల రేలూ వేణునాదమూ కలసిపోయి పరిమళమూ తీయదనమూ విడదీయలేనట్లుంటాయి. వకుళ వాసన ఎంత మృదువో దాని వన్నె అంత వింత ....

సువాసన పిలుపు వంటిది. పదిమంది నాకర్షిస్తుంది....సౌరభం పక్షివంటిది. దిక్కు దిక్కులో గాలి మీద పరుగెత్తుతుంది....సుగంధం స్మృతి వంటిది. పదే పదే స్ఫురిస్తుంది....పరిమళం పట్టుకుని విడవని బలవంతపు బంధువు కాదు. తరి చూచి దరియవచ్చేనేస్తం....ఆమోదానికి స్వార్థంలేదు, కలిపిగట్టుదనం ఎక్కువ. అందరికీ అనుభవం పంచిపెడుతుంది.

6) అప్పుడయి పోయాను ముసిలిని, ఒంటరిని ...అన్నిఏళ్ళు గడచీ, అంతదవ్వూనడచి ఆఖరున హఠాత్తుగా ఆగిపోయినట్లనిపించింది యాత్ర, కాళ్ళు రెండూలేక కళ్ళు రెండూ ఆరిపోయి, కడపల కూడా లేక, తెరువు కూడా చచ్చిపోయి జరగనట్టు....అమ్మయ్యో! అంతకన్న దుస్థితి మరొకటుండదు

7) రామశాస్త్రి, భారతం పురాణం చెపుతుంటే - ఎదురుగా చీకటిలో ముదుకదుప్పటులు కప్పుకుని ముసుగులు వేసుకునీ, పీడలలాగ గ్రామవాసులు- పైన విశాలాకాశంలో ధగ ధగ మెరిసే నక్షత్రాలు, చచ్చిస్వర్గాన ఉన్న భారత వీరుల్లాగ, ఈ లోకాన్ని కనిపెట్టేవాళ్ళ చూపుల్లాగ....ఎదురుగా కూర్చున్న శ్రోతలనుంచి కూడా అక్కడా అక్కడా చుక్కవంటి చుట్టనిప్పు కనబడుతుంది. ఆ చీకట్లో శాస్త్రిగారి గొంతు ద్వాపరయుగం నుంచి వస్తుంది. ఆయన కంఠరాస పక్షాల మీద శ్రోతల మనస్సులు ఆపికాలాలదాకా ప్రయాణంచేస్తాయి.

పగలుమన కళ్ళు కనబడినంత మేరే చూస్తాయి. రాత్రి రామాయణందాకా చూస్తాయి.

పై ఏడున్నూ కృష్ణశాస్త్రి వచనమహాకావ్యాలలో అలసాలసంగా ఎత్తి రాసిన తునకలు! సప్తస్వరాలూ దేనికది విడివిడిగా- వేరు వేరు వ్యక్తిత్వాలతో తీరు తెన్నులతో కనిపిస్తాయే గాని- అన్నీ కలగల్పిన సంగీతం మహానదిలాంటిది. అంతులేని జలవాహనంలా సాగిపోతుంది. కృష్ణశాస్త్రి వచనం పఠన యోగ్యమైన సుందరానుభవం. ఈ అనుభవం ఏ చీటి రాతో మొదలుకొని సీరియస్ వ్యాసంవరకూ ఒకే సుందర హేమంత ప్రత్యూషంలా చల్లగా మదికి పులకరింతలా సాగుతుంది. ఎన్నో స్మృతులు రేపుతుంది. పూరాగా ఆలోచించడానికి బద్ధకంవల్ల విడిచి పెట్టేసిన మన అనుభవాలకు అక్షరరూపం ఇస్తున్నట్టే మన హృదయంలో చేరి మనకిమంతా పరామర్శిస్తుంది. ఆయనే ఒక చోట అంటారు.

అందరూ అనుకునేదేదో అంటారు. ఎవరూ చెప్పుకోలేనంత అందంగా అంటారు. 'రాత్రి తల్లి....రాత్రి అమ్మవారికి, పగలు సృష్టిలో వస్తువులు అన్నీ దేని దారి దానిది, అన్నీ తొందరగా పనిమీద పోతున్నట్లూ, వొకదానినొకటి పలుకరించడానికే తీరిక లేనట్లు ఉంటాయి. రాత్రి ఒకే ఒక విశ్రాంతి శయ్య మీద, వొకే ఒక విశ్వశాంకం మీద, వొకదాని ఒళ్ళు వొకదానికి తగులుతుంటే, పిల్లలాగ నమ్మకంగా పవ్వళిస్తున్నట్లుంటాయి. కొండా, చెట్లూ, ఇల్లూ, కుర్చీ, మనిషి- అన్నీ, అన్నీనీ' అచ్చంగా ఇలాగే అద్దదిద్దంగా మన స్మృతి భాండా రంలో చెల్లా చెదురుగా విసిరేసుకున్న అనుభూతులన్నీ కృష్ణశాస్త్రి వచనం చదువు తూంటే చేరువవుతాయి. ఒరుసుకుంటాయి. ఆప్యాయంగా లాలించుకుంటాయి. పాటలు పాడుకుంటూ పోతాయి.

కృష్ణశాస్త్రి కవిత్వంలాగనే వచనం కూడా లిరికల్ లక్షణాన్ని విడనాడదు. ఆయనే అన్నట్లు— 'లిరిక్‌లో ప్రతి శబ్దానికీ ప్రత్యేక పరిమళం ఉంటుంది. ప్రత్యేక వర్ణం వుంటుంది- ఆ శబ్దానికి పర్యాయ పదం ఉండదు. విధిగా, ఖచ్చితంగా అదే అక్కడ ఉండాలి. అది (INEVITABLE WORD) అక్కడ అదితప్ప వేరొకమాటనప్పదు. నిజమైన కవికి పర్యాయ పదాలంటూ ఉంటాయా? .... ఇక లిరిక్‌లో ఒక శబ్దానికి మరొక శబ్దం ప్రాణమిత్రం: ఆప్తబంధువు. లయ చెడకుండా స్వరం తప్పకుండా, అపశ్రుతిరాకుండా, ఒకే గొంతులో నూంచిలాగ కలసి పాడాలి అవి: వాటికి ఒకే ఒక బొంది ఒకే ఒక ప్రాణం. లిరిక్ రాగతాళాలతో గేయమే కానక్కరలేదు. పద్యంకావచ్చు. వచనంకూడా కావచ్చు" అంటారు. కృష్ణశాస్త్రి వచనం ఒకలిరిక్కే!

ప్రధానంగా కవులైన ఏ కృష్ణశాస్త్రి వచనమో, ఏ శ్రీ శ్రీ వచనమో- నకృత్తుగా లభించే ఉత్తమ గద్యరచనలు మళ్ళీ మొదటికి వచ్చి- చలం, కృష్ణ శాస్త్రిగార్ల వచన రచనా లక్షణం పరిశీలించుకోదలిస్తే-

చలం వచనం- చీకటిగా దిగులుగా ఉన్న ఊరు చివరి ఒంటరి ఇంట్లో ఎన్నో విద్యుద్దీపాలొక్కసారి వెలిగించినట్లుంటుంది.

కృష్ణశాస్త్రి వచనం- దారితప్పి తనవాళ్ళను వెదుకుతూ పలవిస్తున్న దీనుడికి ఒక్కసారి వినిపించిన దూరపు కేకలా ఆపాదమస్తకం మెరుపు తీగలతో ముంచెత్తుతుంది. కృష్ణశాస్త్రి వచనం హృదయానుభవాలను పలుకు తుంది. జీవితానుభూతులను స్మృతి తలంలో వింపుతుంది.

వీరిరువురూ ఎన్నడూ పాండిత్య ప్రాగల్భ్యాన్ని ప్రదర్శించరు. చూడు నేనెంత గొప్పగా చెప్పానో అని దబాయించరు. నాకెన్ని సంగతులు తెలుసునో

చూశావా? అని కళ్ళు మిటకరించరు. మన చెవుల్లో యిళ్ళు కట్టుకుని పదే పదే భయపెట్టరు. మన అజ్ఞానాన్ని హడలగొట్టరు. ఇరువురూ సుహృత్ సమ్మితంగా చెప్పినవారే: ఎక్కడా గురూపదేశం చేయరు.

వీరిరువురి వచన రచనలకూ కూడ కావ్యావేశం అంతరిక్ష జీవలక్షణంగా భాసిస్తుంది. విజ్ఞాన విస్తృతి జోలికి పోదు, వీరి గద్య ప్రజ్ఞాపాటవాలను ప్రదర్శించి చదువరిని మూర్ధాగ్రస్తుడ్ని చేయదు: వీరిరువురి వచనరచనా శక్తికీ మరో ముఖ్యలక్షణం ఉంది. చదువరి రసపిపాసను ప్రదీప్తం చేయడంలోనూ, అనుభవ సందర్శనా శక్తిని ప్రబుద్ధం చేయడంలోనూ కౌశలాన్ని కేంద్రీకృతం చేస్తాయి.

చలం వచన రచనా శైలి బలపాకంలా ఉరుపేతుంది. కృష్ణశాస్త్రి శైలి సేలయేటి గల గలలతో నిర్మలంగా పారుతుంది. సాధారణ వచన రచయితలు ఏ మెత్తని సన్నివేశం ఎదురైనా దాని కిదైన మెత్తని పదాల ఎంపికకు క్షణ మాగి అన్వేషించరు.

కృష్ణశాస్త్రి వచనం పాఠకులలో ఎంతో రసావేశం గలిగిస్తుందా? ఆయన మాత్రం అంత ఆవేశము పొందరు. రచన సాగించేటపుడు వరద నీటి ఆవేగం ఆయనకి అసలే పడికిరాదు. ఆయన మనసు ప్రతిమాట దగ్గరా ఆగి పోతుంది. అటూ ఇటూ తడిమి, గిల్లిరవ్వంత నోట్లోవేసుకుని, వాసన చూసి, సర్వాంశాలా సంతృప్తి కలిగితే తప్ప ఒక్క పదాన్ని ఆయన ప్రయోగించరు. అందుకే మామూలు వచనంలో వాడిన పదాలైనా సరే కొత్త అందాలతో మన గుండెలపై చిందులు వేస్తాయి. పరిమళాలతో పరవశింప చేస్తాయి. ఆయనే అన్నట్లు ప్రతి పదమూ ఒక గవాక్షం: దానిలో నుంచి విజనాలైన వింతలోకాల వరకూ పరచుకొన్న కడలులకరళ్ళపై మరిగే నురగలూ అవీ కనపడతాయి:

సుప్త సమాజాన్ని భీకరాంకుశంతో నసాళానికి అంటేలా పొడిచి లేవగొట్ట డానికి చలం గద్య ఎన్నడూ సందేహించలేదు ప్రేమతో పాఠకుడ్ని ఆహ్వానించి పన్నీరు జల్లి శైత్యోపచారం చేసి, తాను దర్శించిన దివ్యలోకాన్ని దయతో వివరించడానికి కృష్ణశాస్త్రి వచనం ఎన్నడూ వెనుకంజ వేయలేదు.

వెనకటి తరంలో కవిత్వానికి ప్రాయమైన రచనలు చేసిన వారిద్దరే యిద్దరు....చలం, కృష్ణశాస్త్రీని: ఒకరు పగలూ....ఒకరు రాత్రీ....కృష్ణశాస్త్రి వచనం చంద్రోదయం వంటిది.

# తొమ్మిదో ప్రకరణము

## యుగ యుగాల కలలు పాడిన కవి

"యుగ యుగంబుల కలల్ పాడనా?" అంటారు కృష్ణశాస్త్రి. ఇంకా ఆజ్ఞ కూడా లేదా? గొంతుముడి వీడలేదా శాస్త్రిగారూ? ఊర్వశి దేవత, అయితేనేం వేశ్య! ఆజ్ఞ కూడితేనే గాని గొంతుముడి వీడదవే మీ ధీరవాక్కు చాలదా?".... అన్నారు చలంగారు.

కవిత్వపరమైన నమ్రతకోసం అలా అడిగారే గాని, నిజానికి ఆయన యుగ యుగాల కలలే పాడారు. ఐతే విస్తృతంగా కాదు, సంక్షేపంగా. అసంఖ్యాక గ్రంథ సంచయన ద్వారా కాదు, అమేయ భావరేఖల ద్వారా. ఆయన పదాలు చిర సౌరభాల వెదజల్లే సురలోక పారిజాతాలు.

స్టీఫెన్ స్పెండర్ ఒక మంచిమాట అన్నాడు. The importance of the magic of language- అని అలాంటి శాబ్దిక ఇంద్రజాలం కృష్ణశాస్త్రికి స్వాధీనమైనంత సమగ్రంగా మరెవ్వరికీ కాలేదనడం అతిశయోక్తి కాదు.

ఏ కవీ శబ్దాలను సృష్టించడు. పదాల అంతర్నాదాలను గ్రహిస్తాడు అనుస్యూతంగా తన జాతి అవసరార్థం సృష్టించుకొంటూ వచ్చిన పదజాలంలో తన ఆంతరిక నాదాన్ని అభివ్యక్తం చేయగల పదాలను ఎన్నుకుంటాడు ఈ ఎన్నుకోవడంలోనే ఐంద్రజాలిక శక్తి ఒక కవికి అవసరమవుతుంది. పాత పదాలనే ఆయన ఏర్చి కూర్చేటపుడు ప్రతిదానికీ పదునూ పరువమూ లగించి ప్రయోగిస్తారు. పరిమళమూ వెలుతురూ పరికించి మరీ ప్రయోగిస్తారు. తానుగా తెచ్చుకున్న కొత్తకలలనూ, ఊహలనూ మోయగల కొత్త పక్షులుగా పాతమాటల్ని మంత్రించి వదిలారు. ఎలదేటి చిరుపాటలూ, పెలయేటి కెరటాల పడిలేవు విరికన్నెలు. తొలిప్రొద్దు తెమ్మెరల్రేవలూ, పరువెత్తు కోయిల పాటలూ, కారు రాతిరి కొనలూ, విరహ వీక్షణ భయంకర మాధురులు, చండ మృత్యు గంభీర గర్జారవాలు, ఊగే గాలులు, తూగే తీగలు-వంటి అలనాటి చిత్రోక్తులు మొదలుగా యిటీవల పదిలంగా అల్లుకొన్న పొదరిళ్లూ, తొందరపడే కోకిలలూ, కెరటాల పెదవులూ జాబిలికూనలూ వరకూ ఎక్కడ వారి కవితను స్పర్శించినా పూచిన పొగడ కొమ్మ మాదిరిగా సువాసనలు జల జల రాల్తాయి.

పాత మాటలనే సహజంగా ఆయన స్వీకరించారు. అయితే వాటి ఉనికి పట్లు మార్చి కునికిపాట్లు విడిల్చారు. కొత్త రూపకాలుగా మార్చారు. కొత్త ఓజస్సు అందించారు. దానితో అనవద్య సౌందర్యం అవిష్కృతమై భాసించింది ఆ ఓజస్సే చలం అంతటివారినే పరవశీభూతులు కావించింది. మాదకత్వపు లోచూపు లకు దింపింది. పైవాక్యం కృష్ణశాస్త్రి ఊర్వశి కావ్యంలోనిది, ఆ కావ్యం యిలా సాగుతుంది.

ఎదలోపలి ఎదలో నె
మ్మదిలో జీవిత రహస్య మార్గమ్ములలో
వదలని కోరికనై నా
బ్రదుకు బరువు లెల్ల పాట పాడింతు సఖీ!

అనే కంద పద్యంతో ప్రారంభమవుతుంది ఖండిక. తన బ్రదుకు బరువు లనే కన్నీటిపాటలుగా పాడిస్తున్నసఖి, ఊర్వశి తన ఎదలోపలిఎదలో, మదిలోపలి మదిలో వదలని కోరికవలె మెరుస్తుంది. జీవిత రహస్య మార్గాలలో అంతర్వా హినిగా ప్రవహిస్తున్న జీవనరేఖ! జనజనాంతరాలనుంచీ ఆమె తన హృదయాన్ని వెంటాడుతోంది వేటాడుతోంది!

తర తరాలుగా వస్తున్న ప్రాచీన ఛందస్సులనే ఆయన స్వీకరించారు, ఐతే సంప్రదాయ విధేయతతోగాదు, ప్రయోగ శాలితతో; వాటి శరీరాలపై గల పాత వాసనలను పూర్తిగా క్షాళనం చేశారు. కొత్త జిలుగూ, కొత్త వెలుగూ వాటి ఒళ్ళకు పూశారు నవీన స్వరూపాలుగా మలచారు. ఆ నవీన లేపన చర్చతో ఎంత ఎత్తుకైనా ఎగరగల శక్తి వాటికి వచ్చింది. దానికి పై కందం వంటివే ఉదాహరణ ప్రాయాలు!

చలువ పిపాళి గాలి నును చక్కిలిగింతల కౌగిలింతలన్
విలువున పాటగా కరగ నేర్చునొ నిరవవేణు వీధి
వలపు తలంపు సోకిననె, ప్రాణసఖీ! బ్రతుకెల్ల కోటి
గొంతులవిడి సోనలై
పొరలు నూతన గీత సుధా పథాలలోన్!

ఆయన రచించిన పద్యాలన్నీ నూతన గీతికలుగా మారాయి. సుధాపథా లుగా సాగాయి. పారవశ్యంతో పొర్లాయి.

నిశ్శబ్దవేణు నికుంజాల వీధిలో ప్రసరించే ఊసిపోని గాలిసైతం ఆమె కౌగిలిలో రవంత సేదతీరేసరికి—విలువునా పాటగా కరిగిపోతుంది. ఆమె వలపు

తలపు ఎదకు సోకినంత మాత్రంలోనే—బ్రతుకంతా కోటి గొంతులుగా విడిపోతుంది.

కృష్ణశాస్త్రి పద్యాల రజోరశ్మి హృదయాలకు సురభిళ పీచికలా సోకుతుంది. స్మృతులను మేల్కొల్పుతుంది. భావాలను పలకరిస్తుంది. నేరుగా గుండెలను స్పందిస్తుంది. అనుభూతులతో నింపుతుంది. ఆయన పద్యాలకు పరిమళ ధుంధుభులు రెక్కలుగా తొడిగారు. ఏ ప్రాచీన కవి పద్యాన్నైనా, అదెంత రమణీయమైనదైనా, ఆయన పద్యంతో పోల్చినపుడు దాని తాలూకు ముసలితనం ఏదో చప్పున మన యింద్రియాలకు స్ఫురిస్తుంది:

''పూని సఖీమణుల్ కుసుమ పూజిగిపావడ కీలుకొల్పి, ఇం పైన మీరి
బల్ పిరుదునందు ఘటించిన జిల్గు చల్వ సెల్లా నెరిమించ చెంగలువలంగల
పుప్పొడి కప్పుకొన్న జాం బూనద సైకతంబుపయి పున్నమ వెన్నెలకాయు కైవడిన్!''

అనే ప్రాచీన పద్యంకూడ—నిరంతర సుందర సామగ్రితోనే చేయబడింది. పూజిగిపావడ, జిలుగుచలువసెల్లా, చెంగలువలపుప్పొడి, కాసే పున్నమ వెన్నెల వంటివన్నీ అన్ని కాలాలకూ అవసరమైన దినుసులే. నవ్య కవులు సైతం ఇలాంటి పదార్థాలను నిషేధించలేదు.

ఐతే పైరెండు పద్యాలకూ నిర్మాణంలో గల విశిష్టతలో విభేదం కనిపిస్తుంది. ప్రాణపదార్థంలో చెప్పలేని తేడా ఏదో మన హృదయాలకు తాకుతుంది. పై పద్యంలో ప్రాచీన కవి తన అంతర్యాన్ని దూరంగ పెట్టి, చూసిన దృశ్యాన్ని చూచినట్లే వర్ణిస్తాడు. అందుకై కొన్ని మాటలను పొదుగుతాడు. మమేకత కనిపించదు. ఆయన ఐకాంతిక యింద్రియానుభూతుల్ని, విశ్వాసాల్ని కలమెదపి అందిస్తాడు. మొదటి పద్యం చదివేటపుడు కవి అనుభూతిని పాఠకుడు ప్రత్యక్షంగా అనుభవిస్తాడు. తన బ్రతుకే కోటి గొంతులతో తనతో మొర పెట్టుకుంటున్నట్టు ఒక నిర్వేదం అనుభవిస్తాడు. రెండో పద్యం చదువుతున్నపుడు తాను దూరంగా ఉండిపోతాడు. ఒక అందమైన దృశ్యాన్ని నిర్లిప్తంగా Detached గా అవలోకిస్తున్న అను భావం పొందుతాడు.

''నీ యాజ్ఞ కూడెనా, గొంతుముడి వీడెనా
హాయిగా యుగ యుగంబుల కలల్ పాడనా

చిరగాథ నిద్ర మేల్కొలిపి సందేశాల
బరపనా దిక్కు దిక్కులకు చుక్కలకు!''

అంటూ బరువుగా ముగిసిపోతుందా అందిక, తన ప్రేయసి ఆజ్ఞ తనకు లభించి నపుడు తన గొంతుముడి తనంతతానే విప్పుకుంటుంది. చిరగాథ విద్రలను మేల్కొలుపుతుంది. సందేశాలను దశదిశలకూ అందింపచేస్తుంది. తన గొంతు చుక్కలవరకూ ప్రసరిస్తుంది.

అదీ చలంగారు పేర్కొన్న ధీరవాక్కు ఐహిక పరిభాషలో—దివ్య లోక పారమ్యతలను అభివ్యక్తం చేయడానికి ఆ ధీరవాక్కు ప్రయత్నించింది. ఆ ప్రయత్నం సత్ఫలితాలనీయకపోవడం నుంచే పరిదేవనాగీతం ప్రాదుర్భవించింది. రెయినర్ మేరియా రిల్కే మహాకవి చెప్పినట్లు "The hopelessness of the poets in striving to express the Beyond in terms of Hope' becomes poetry." ఇలాంటి ఆశాభంగ భంగమాలికలే కృష్ణశాస్త్రి గొంతు నుంచి గీతికా తరంగాలై ఉరికాయి.

## సీ స ర చ నా శి ల్పం

ప్రాచీన ఛందాలలో సీసమొక గొప్ప గాన యోగ్యమైన కవితా వాహకం' భావనిర్భరత్వంలో బరువుగా సాగుతూనే ఎన్ని ఒయ్యారాలనైనా పోగలదీ ఎల నాగ! సీసరచనా మహత్వంలో అపార శక్తిని ప్రదర్శించిన అద్వితీయుడు శ్రీనాథుడు. తదాదిగా ఎందరో—కాదు, అందరూ సీసపద్యంలో ఎన్నో శ్లోకులు సంతరించారు కాని ఆయన సీసాలు భూమిమీద చిందులు త్రొక్కవు. గాలిలో పల్లటీలు కొడతాయి. పోతన్నగారి మందార మకరందాలు సైతం అందుకోలేని ఔన్నత్యాల కెగిరిపోతాయి. కాసుల పురుషోత్తంగారి సీసాలవలె భజనమట్లతో చిడతలు మ్రోయిస్తూ అడుగులు వేయవు కృష్ణశాస్త్రి సీసాలు. కృష్ణశాస్త్రి సీసంలో శ్రవణ సుభగత ఒక్కటే ప్రధాన లక్షణం కాదు. ప్రతి పద వార్థవత్వంతో ప్రతి గుండెనూ దొల్చుకుంటూ లో లో తు ల కు పోగల అనుభూతి పారమ్యత వాటికమర్చబడింది. శ్రోత హృదయాన్ని సంవేదనా పరాకాష్ఠతో ఊపిరి సలపనీయవు. సద్యఃస్ఫూర్తి వాటి ఆంతరిక లక్షణమైనా బాహ్యార్థాల దగ్గరే ఆపవు. చెప్పబడిన శబ్దార్థ సంపుటినుంచి - చెప్పబడని భావనామయ వేదన ఏదో విస్పష్టంగా పాఠకుని చిత్తంలో ఆశీనమవుతుంది. పరిదేవన సమృద్ధిగా గర్భీకృతం చేసుకుంటాయి కృష్ణశాస్త్రి సీసాలు. ఇందుకై వారి సీసాలన్నీ ఉదహరించవలసిందే: 1. ఎండటి చిరుపాట, 2. నన్నుని ఎలుగెత్తి, 3. జిలిబిలి పట్టు రేకుల వెన్క- ఇలాంటివన్నీ విశ్లేషించుకోవలసినవే: ఆ పని సహృదయ పాఠకులది. ఇక్కడ ఒక్క సీసం పరామర్శ చాలు. అదిన్నీ ఊర్వశి కావ్యం లోనిదే.

నును మబ్బు లేచున్క కొసలపై సోనలా
నెలవంక చిరునవ్వు వెలువ పాట
తొలిపొద్దు పొడుపు రేకులపైడి దారుల
ఏరులా మంచుకన్నీరు పాట.
పావురా యుయ్యాల పతాల యంచుల
జాలులా గాలిగీలాల పాట
పిరిజాబెకన్న నిద్దుర కన్ను రెప్పల
కాల్వలా నెత్తావికలల పాట
కలసి, నీ గొంతు తోవల సెలలుగట్టి
అలలనుపొంగి నా హృదయాంచలముల
బారి, దాహాన బీటలు వారి ఎండు
ఈ బ్రతుకునిండ నిండి పోయినవి — చెలియ!

నాలుగు బాహ్యేంద్రియానుభవాల సమ్మేళనంతో రసనేంద్రియానుభవం పరిపుష్ట మవుతుంది. అంతరిక అనుభవంగా మారి రసపుష్టినందిస్తుంది. అతీంద్రియానుభవంగా మారిపోతుంది. ఆమె పాట హృదయాంచలాల ప్రవహిస్తుంది. తన హృదయం దాహంతో బీటలు వారి పోయివుంది. అట్టిదాని నా పాట తడిపింది.

## ఉన్మత్త భావశాలి:

తననితాను ఉన్మత్త భావశాలినని గోముగా పిల్చుకుంటారు కృష్ణశాస్త్రి. జ్ఞాపకాయన భావన పిచ్చిగాలి విసరు కానేకాదు. పాఠకుడు తనకు దారిలో ఎదురైన ఒక గేయ శకలాన్ని ఏదైనా తుంపి రసనపై దాల్చినా అతని హృదయం పారవశ్యంలో మునిగిపోతుంది. రసజ్ఞాని భావనాతీత ముప్పిరిగొంటుంది. ఏవో అందీ అందని జ్ఞాపకాలు తనచుట్టూ పరిభ్రమిస్తాయి. పూచిన ప్రతి కొమ్మ దగ్గరా గుండెలాగి దీనంగా ప్రార్థిస్తాయి

"ఏడ జనిన మనోహారి జాడలరసి,
కలగు హృదయంబు, నెమ్మది చలనమొందు
కనులు మూసిన లోకమోహాన మనోజ్ఞ
మూర్తి చిరునవ్వు చిలుకుచు మోల నిలచు!"

ఆ అనుభవం కృష్ణశాస్త్రిదే కాదు. పాఠకునిది కూడ! కవి ఆత్మీయ భావన రసజ్ఞశ్రోతడిగా పద్యాః స్ఫురణతో మారిపోతుంది. ఆయన కవిత వసంతవిటపివని....ఏ మూల తిరిగినా మనోహరి జాడలే పొడగడతాయి. గుండె కలగుండుపడుతుంది. విపరీత సంచలనంతో ఆర్ద్రల్లాడి పోతుంది హృదయం. కనులు మూసికొని ఒక్కసారి అంతర్ముఖుడయ్యాడా లోకమోహన మనోజ్ఞ మూర్తి దర్శనం కలుగుతుంది. కృష్ణశాస్త్రి కవితలో ఏ రెమ్మతాకినా తళతళ లాడే కొత్త పోకులే తారసిల్లుతాయి. ఆ మనోహర మూర్తి చిరునవ్వుల వెలుగుల్లో కళిపించని రంగే లేదు. అలరించని రుచేమిగలదు. పరవసింపచేయని వాసనే కానరాదు ప్రేయసి మృదుపాణి పల్లవ పాళవలె గుండెలను చల్లగా నిమురుతుంది. మేల్కొల్పుతుంది. సేదతీరుస్తుంది ఓదారుస్తుంది.

"తారకాపూర్ణ చంద్రమార్తాండ బింబ
మండి తమ్ము మహాకాశ మండపమ్ము
నందె కాదె పాణి గ్రహణమ్ము దొరకు
పతిత నెట్లౌదు? నేనెట్లు పక్షినౌదు!

తారకలూ పూర్ణచంద్రుడూ మార్తాండ బింబమూ నిరంతరం ప్రకాశించే మహాకాశ మండపంలో పాణిగ్రహణం లభిస్తుంది. అట్టి తన ప్రేయసి ఆకాశ లోకాలనుంచి పతిత ఎలా అవుతుంది? ఆ సమున్నత పథాలనందు కొందుకు తాను పక్షిగా ఎలా మారగలడు? కృష్ణపక్షాల మడుకు రెక్కల జోడు తనకు లేక కాదు. కాని అవి, దుర్భరశోక విషమగీతుల విసరు పక్షాలు మాత్రమే!

"చూడగలిగే చూపు కవికి ఉండాలేగాని- లోపలా వెలుపలా అంతా కవిత్వంగా నే దర్శనమిస్తుంది" అన్నారు చలంగారు. కృష్ణశాస్త్రి విషయంలో ఆ మాటలు ప్రత్యక్షర సత్యాలే! ఆయన కవిత్వంపిండా కవిత్వం తప్ప వేరొకటి కనిపించదు ఆ మహత్త్వ పూర్ణకవితామృతకలశాబ్ధిలో తెలుగుజాతి ఆరు దశాబ్దాలుగా ఓలలాడింది.

ప్రతి కరుణామయ చిత్రం వెనుకా ఒక ఆత్మపరిదేవన వినిపిస్తుంది. ఒక కన్నీటి కోన సాక్షాత్కరిస్తుంది. శ్రీ కృష్ణసాక్షాత్కారమంటే ఆత్మావేదనా పరిపూర్ణసాక్షాత్కారం! మానవతా సమున్మీలనం! "అవర్ సారోస్ బిగిన్ టు ఫారమ్ ది బ్లాక్ షాడోస్ ఆన్ ది కౌన్‌టినెన్స్ ఆఫ్ అవర్ జనరేషన్" అని రెయినర్ మేరియా రిల్కే అంటాడు. నిజమే! కృష్ణశాస్త్రి, శోకగీతాలు మనతరం ముఖరేఖలుగా సాక్షాత్కరించాయి!

తేటగీతులుగాని, ఆటవెలదులుగాని కృష్ణశాస్త్రి చేతిలో ఎన్ని ఒయ్యారాలైనా పొందాయి. అపూర్వ రూపురేఖలతో అవతరించాయి. ఆయన కవిత్వంలో

ఆబాల్యాదిగా గీతికారీతి సౌందర్యం ఆవిష్కృతమవుతూనే ఉంది. "స్వాదు సంగీత కలనాల సద్విపంచి కరమునందుంచి జీవిత భారమువాయ పాడుకొమ్మంటి తియ్యని ప్రణయగీతి తంత్రులనుద్రెంచి మెట్లు విదల్చి స్వామి ఎటులపాడుమ నీబ్రతుకెటు బ్రతుకు?" ఇలాంటికాంతుల గుత్తులెన్నో: తేటగీతికి నవ్యకవిత్వంలో అగ్రాసనాధిపత్యం కల్పించింది కృష్ణశాస్త్రి. అలాగే ఆటవెలదికిన్నీ. ఆటవెలది వేమన ఋషిచేతుల్లో పరిపూర్ణంగా కొల్లగొట్టబడింది. ఇంకే కొత్త సౌందర్యాలందులో సంతరించగల రెవ్వరైనా అనే సంశయం మిగులుతుంది. అట్టిదానినే రసభరితగాంధర్వంగా మలచారు కృష్ణశాస్త్రి.

మరక మసకసందె, ఉసురుసురను గాలి
గంగజాలి మ్రోత బెంగవలన
డిల్లపడిన పడవ అల్లననిలుచుండు
నా గుహుండు పదియు నాలుగేండ్లు

ఇలాంటి హృదయంగమమైన ఆటవెలదులు అసంఖ్యాకాలు. కృష్ణశాస్త్రి "వేమన పద్యాలు లోక వృత్తప్రదర్శకాలేగాక, సుస్మిత హాస్యరస ప్రేరకాలే గాక మనోహర రసపోషకాలు కూడా. (వాటిని గురించి ముందు ప్రకరణంలో చర్చించుకోగలం.)

తెలుగు కవిత్వంలో అనూచానంగా పరిఢవిల్లుతూ వస్తున్న గేయసుగుణాన్నంతా కృష్ణశాస్త్రి పుణికి పుచ్చుకున్నారు. రకరకాల రగడలు, ఏలపాటలు, వంటి వెన్నో కొత్త రూపు తొడుక్కున్నాయి. గురజాడ ప్రోక్తమైన ముత్యాల సరాలు సరేసరి. మచ్చుకు కొన్ని రగడలు పరిశీలిద్దాం.

'నానోట నీ మాట గాన మయ్యే వేళ
నా గుండె నీవుండి మోగింపవా వీణ
రాగమెరుగని వీణ, రక్తమెరుగని వీణ
తీగ పైని చేయితీయకే గడియేని!'

ఏదో ఆధ్యాత్మికాభావంలో కనక యిది యింత మాధుర్య గుణంలో సాగిందని భావించేవారికి యథార్థలోక జీవన ప్రదర్శనంలో సైతం యింతే మాధుర్యగుణంతో భాసింపడం కృష్ణశాస్త్రి కవిత్వం నుంచి ఉదహరించడం కష్టతరమేమీ కాదు.

కోరియూ రణమ్మనుచు మలయూవ్రణమ్మనుచు
కురిసి రణాస్త్రి భీకర పరంపరయునుచు

దరియూ సంగ్రామమని, వరదలని, వరపులని
కరవు కాటకములని మరణమని, మసనమని—

ప్రపంచాన్ని అనునిత్యం భయపెడుతున్న విషాదాంత విషయ విష్కంభా లను ఎంత తొందరగా మన కనుల ముందుకు తెచ్చారో దీనిలో చూడగలం! పూర్వకవులు శార్దూల విక్రీడితాన్ని కొండొక భీభత్స రసప్రధానంగా ప్రయో గించిన వారనేకులున్నారు. అనంత వేదనవీ గ్లానినీ ఆవిష్కరించినవారూ ఉన్నారు. శృంగారాత్మక లలిత భావబంధురంగా ఉపయోగించిన వారూ ఉన్నారు. "నీ కంఠార్పిత కాల పాశము శిరోవిర్థాత పాశమ్మువంటి భాస్కర రామాయణకారుని పద్యంలో భీభత్సవీర రసాలు చక్కగా పరిపోషింపబడితే-"గంగా సంగమ మిచ్చగించునె మఱిన్ కావేరి దేవేరిగా అంగీకారమొనర్చునే" అనే తెనాలి రామ కృష్ణుని పద్యంలో లలిత శృంగారం ఆవిష్కరింపబడింది. కృష్ణశాస్త్రి అదే శార్దూలంలో కరుణ రసాన్ని ఎలా ఆవిష్కరిస్తారో ఈక్రింది పద్యం చదివితే తెలుస్తుంది ఈలోకపు దైన్యస్థితి తెరచుకుంటుంది

ఈ లోకమ్ము దరిద్రతాకృపణతా హింసారిరంసారువో
ద్వేలోల్లోలములన్ మునింగి విలయాభీల స్థలకిన్ మాయునే
మో లేకున్న సహోదరాస్థి పలలమ్ముల్ తిందురే ఎందు? తత్
కీలాలసవపానలాలస మదాంధీభూతులై మానవుల్

ఈ విధంగా ఆతడు ఏ పూర్వ ఛందస్సుల్ని తీసుకున్నా-దాని నిర్మాణంలో నవీనగుణాల్ని ఆపాదిస్తూ భాషావిష్కరణలోని పద నిర్మాణంలోగాని అపూర్వ ఓజస్సును సంతరించడమే కనిపిస్తుంది. కృష్ణశాస్త్రి కవిత్వం బాహ్యేంద్రియా లకు మాత్రమే పరిమితమైందికాదు అంత శ్చైతన్యాల్ని రసపుష్కలం చేయ డమే ధ్యేయంగా స్వీకరిస్తుంది.

## ఆధునికుల అభియోగాలు:

కృష్ణశాస్త్రి కవిత్వంపై సంప్రదాయవాదుల అభియోగాలను అంతగా పరిగణించనవసరం లేదు. కారణమేమంటే విన్నవలెనే నేడు కూడా ఏ మార్పూ లేకుండా ఉండాలను కొనేవారి నిరర్థక స్వప్నరాశి దానంతటదే వ్యర్థమైపోతుంది. కాని ఆధునికుల అభియోగాలను విచారించవలసిఉంది. అవి సాధారణంగా రెండు. 1 ఆయన నిరాశావాద కవిత్వం రాశారని, 2 కవిగా కృష్ణశాస్త్రి పలాయన వాది ఎస్కేపిస్ట్ అని.

నా దృష్టిలో ఈ రెండు అభియోగాలూ నిరాధారమైనవే! అవిచారిత మనస్కులు తొందరపడి అన్నమాటలుగానే కనిపిస్తాయి నాకు. యాతాదృశమైన కవులు గెథేగాని, పుష్కిన్‌గాని, బైరన్, షెల్లీలుగాని, మార్క్స్ ఏంగెల్సు వంటి సిద్ధాంత వేత్తలనుంచి పైతం అలాంటి అభియోగాలందుకోలేదు సోషలిష్టు విప్లవం జరిగి, సోవియట్ యూనియన్ సర్వరంగాలలోనూ విజయవంతంగా ముందంజవేస్తున్న యిన్నాళ్ళకయినా అలెగ్జాండర్ పుష్కిన్ మహాకవి కవిత్వం అధ్యయనం చేయబడుతునే ఉన్నాడు మన భాషలో చెబితే ఆయన భావకవే! ఎవడి కవిత్వం చదివితే పతనోత్తరకాలంలో పాఠకుని హృదయం తనను చూపితేనే సిగ్గుతో క్రుంగిపోతుందో, తన చుట్టూగల లోకాన్ని చూసి కుమిలిపోతుందో, అదీ నైరాశ్యవాదకవిత్వమంటే జీవితం జీవించవలసింది కాదనీ, మరణమే వాంఛనీయ నిర్వికల్పమనీ భ్రమగుడిసుళ్లలో కునారిల్లిపోతుందో అట్టి భ్రాంతికి కారణమైనదే నిరాశావాద కవిత్వం. కృష్ణశాస్త్రి కావ్యాలేవి చదివినా పాఠకుడికి అలాంటి భావం కలుగదు. పైగా దానికి భిన్నంగా జీవితం అత్యంత మనోజ్ఞమైనదిగా దర్శనమిస్తుంది. కవితానుభవ పారమ్యత ఎంత సుందరస్థితిని కల్పించాలో అంత ప్రగాఢంగానూ సిద్ధింపచేస్తుంది. ఇలాంటి ఉత్తమ కవితానుభవం కోసమైనా కనీసం ఈ బ్రతుకు బ్రతకాల్సిందేననే ధీమా కలుగుతుంది. కనుక పిండితార్థంగా చెప్పాలంటే కృష్ణశాస్త్రి కవిత్వం నైరాశ్యవాద కవిత్వం ఎంత మాత్రం కాదు. ఆ అభియోగానికి ఆధారమే లేదు.

పోతే అది ఎంత వరకూ పలాయన వాద సంబంధో పరిశీలిద్దాం. కృష్ణశాస్త్రి కవిత్వం బాహ్యవాస్తవికతా జన్యమైన లౌకిక సమస్యల పరిష్కారానికి ప్రేరణ కలిగించకపోవచ్చు. అంత మాత్రంలో జాటిల్యం నుంచి తప్పించుకు పారిపోదామన్న అలసత్వమూ కలిగించదు. ఆయన కవిత్వం పదేపదే అధ్యయనం చేస్తూ జీవితాన్ని సాగిస్తూ వచ్చిన వారెందరో మా తరంలో ఉన్నారు. వారెవరూ నిత్యజీవితం కల్పించే విధులను నెరవేర్చకుండా పారుబోతులు కాలేదు. పిచ్చివాళ్ళో, బైరాగులో, బికారులో అయ్యారనే సాక్ష్యం ఒకటైనా కనిపించదు. పైగా జీవన పోరాటంలో సమ వయస్కులందరి కన్నా మిన్నగా పాల్గొన్నవాతే అధిక సంఖ్యాకులు. ఎదురైన సకల కశ్మల స్వరూపాలతోనూ తలపడి కలహించిన వారే! నిత్యజీవితంలో కంటక కిరీటాన్ని ధరించినవారే! అంటే కృష్ణశాస్త్రి కవిత్వం పాఠకులెవరినీ పలాయనవాదులుగా మార్చలేదనే అర్థం. పైగా కార్యోత్సాహాన్ని పెంపేపలార్చింది.

నిజమే కృష్ణశాస్త్రి కవిత్వం కంఠోక్తిగా క్రియాశీలతను ప్రేరేపించదు. కర్తవ్యాన్ని ఉపదేశించదు. 'కొట్టు-చంపు' అని గావుకేకలు పెడుతూసాగిన ఎన్నివందల రచనలు కవితాస్పర్శను నామమాత్రంగానైనా పొందకుండా మన

కన్నులముందే కాలగర్భంలో కలిసిపోలేదు కృష్ణశాస్త్రి కవిత్వం అక్షరాలా కవిత్వ ధర్మాలను నెరవేరుస్తుంది అంతకన్నా అతీతంగా దానినుంచి ఏమాశించినా ఆశాభంగమే.

ఆయన కవిత్వంలో హైస్కూలు విద్యార్థులకు కాంపోజిషన్లకు మార్గదర్శక సూత్రాలు లభించకపోవచ్చు. మొక్కజొన్న హల్వా తయారీ పద్ధతులు లభించకపోవచ్చు. ఇంకా యిలాంటివే సమాలక్ష దినవారీ కిరణా సరుకులు లభించడం లేదని దాన్ని పలాయనవాదమని తిరస్కరించడం జీవన సౌందర్యాన్ని కోల్పోవడమే.

ఈ సందర్భంలో శ్రీ తుమ్మల సీతారామమూర్తిగారి మాటలు జ్ఞాపకం చేసుకోవడం ఎంతైనా అవసరమే.

"కరుణ కలదు ప్రేమకల దీపి కలదాత్మ
కలదు కృష్ణశాస్త్రి కవితయందు
టన్ను బరువు దాని కున్న దాయనినోస
లెత్తియడుగు వాని కేటికోళ్ళు!"

ఏటికోళ్ళే కాదు, కోటికోళ్ళు బలియిచ్చినా మన జాతిలో పేరుకొన్న మూర్ఖవాదనా మహమ్మారి శాంతించదు.

కృష్ణశాస్త్రి జీవితంలో ఎంత ఆశాజీవో అదంతా ఆయన రచించిన కవిత్వమంతటిలోనూ ప్రతిబింబించలేదని బాధపడేవారు—తమ అవసరాలన్నీ కవి తీర్చాలనే గొంతెమ్మ కోరికలతో అర్రులు సాచేవారే; ఆయన కవిత్వంలో పారదర్శకంగా కనిపించే అనంత కాంతుల జోలికి పోలేనివారే. మనది కృతమహాయుగమని ఎలుగెత్తిన గతాన్ని కాని, ఆకాశము నొసట పొడుచు అరుణారుణ తారల సముజ్వలకాంతిని కీర్తించిన గతాన్ని కాని బుద్ధి పూర్వకంగా విస్మరిస్తున్న వారే.

ఆయన ప్రసంగాలలో, ఉపన్యాసాలలో, గోష్ఠులలో పాల్గొని ఆయన్ని సన్నిహితంగా పరిశీలించిన వారెవరూ కృష్ణశాస్త్రి, నిరాశావాది అంటే మతరామూ అంగీకరించరు.

"ఎవరేమన్నా భావకవిత్వమనే దానికి రూపమిచ్చి పెంపొందించిన వాడు కృష్ణశాస్త్రి.

"తక్కినవాళ్ళు ఒక అడుగు అక్కడా ఒక అడుగు ఇక్కడా వేశారు. కృష్ణశాస్త్రి అచ్చంగా భావకవిత్వమే వ్రాస్తాడు. అదే అతని వైశిష్ట్యం. భావ

కవిత్వమనేది అర్థమయ్యే విషయం కాదు. హృదయానికి అవగతమయ్యే విషయం." నీ హృదిలో ఏదో తారాడుతుంది. అది బాధగా ఉంటుంది. ఆ బాధలో ఒక సుఖం వుంటుంది. అది జీవుణ్ని కదిలిస్తుంది. ఇదమిత్థమని మనం చెప్పలేంది; అదే భావకవిత్వమంటే. అది వ్రాయగలవాడొక్కడే. అతని పేరే కృష్ణశాస్త్రి. అతని ననుసరించి చాలామంది వ్రాస్తారు. ఎవరూ అతని నందుకోలేరు. అతనికొంతే ఈ బోధమంతా వ్యాపించి ఉంది" అంటూ విశ్వనాథ సత్యనారాయణ గారొకనాడు ఉద్ఘాటించారు. ఘంటాపథంగా వ్రోగిన వారి ఈ వాక్యాలలో ఎంత పారవశ్యభావం వుందో అంత సాంద్రంగానూ చిత్తశుద్ధి అభివ్యక్తమవుతుంది.

"భావకవిత్వం ఒక అనుభవం. దీన్ని ఒకడు మరొకడికి బోధపరచడానికి వీల్లేదు. పరిమళం ఇలా ఉంటుందని ఏమి చెప్పగలం?" అన్నాడు శ్రీశ్రీ.

కృష్ణశాస్త్రి కవిత్వం పరిమళభరిత కాంతిరుచిః స్వాప్నికానుభవ రుచింరుచిః

# పదవ ప్రకరణం

## ఋతురంగశాల

''పోయెనా కోయిలల కారు
పోయెను నవ మల్లికల వేళ
శ్రావణమ్మా శరత్తు
మూలమూలల ఈ పర్ణశాలనేన
హిమపదాంకము లే తలలెత్తి పిలుచు

అన్నారేగాని కృష్ణశాస్త్రి కవితా ఋతురంగశాలకోయిల పాటల కారుగా అనార్తవ సౌరభాలు వెదజల్లుతూనే వుంటుంది. వారి పాటల పాదాంకాలలో నవ మల్లికలు తలలెత్తుతూనే ఉంటాయి.

జాన్ క్రౌరేన్‌సమ్ అనే అమెరికన్ కవి, విమర్శకుడూ ఒక చక్కని మాట అంటాడు "The recent critics remark in effect that some poetry deals with things, while some other poetry deals with ideas.

" The two poetries will differ from each other as radically as a thing differs from an idea" [John Crowe Ransom. Poetry: a note in Ontology. From Modern Poets on Modern Poetry Page 82)

ఈ సింగడింపు స్పష్టంగా ఒక యధార్థాన్ని చాటుతోంది. కృష్ణశాస్త్రి కవిత్వం వస్తుప్రధానమైంది కాదు. భావ ప్రధానమైనది. అతడి కవితలలో.... అది పాటగాని, నాటికగాని, పద్యంగాని చివరికి వచనమైనా కాని దేనిని పరిశీలించినా ఈ సత్యం దర్శనమిస్తుంది.

వస్తు ప్రధానమైన కవిత భౌతిక కవిత Physical Poetry అని రేన్‌సమ్ మహాశయుడు పేర్కొన్నాడు. ఈ రెండో బాపతు ఆత్మ పరభావ కవితకు ఈ క్రింది ఉదాహరణ యిచ్చి తన వివరణ కొనసాగించాడు. ఆ పద్యం సరిగా పైన పేర్కొన్న కృ. శా. పద్యంలాగే ఉంటుంది.

"The years at the spring.
And days at the morn,
Mornings at seven
The hill-side's due-pearled
The lark's on the wing;
The snail's on the thorn;
God's on his heaven
All's right with the world;" (Page 89)

వస్తు ప్రధాన కవితకు మనం జాషువాను ఉదాహరణగా స్వీకరింపవచ్చు.

"సున్నితంబైన నీచేతి సుత్తెనుండి
బయట పడెనెన్ని యెన్ని దేవస్థలములు
సార్థకముగాని యెన్ని పాషాణములకు
కలిగె నీనాడు పసుపు కుంకుమల పూజ!

.... .... .... ....

జాల నిద్రించు ప్రతిమల మేలు కొలిపి
ఉలిని సోకించి బయటికి పిలచినావు
వెలికి రానేర్చి, నీ పేరు నిలుపకున్న
శాశ్వతుడ వోయి నీవు నిశ్చయముగ...

ఈ పద్యాలలోని వస్తువులన్నీ కవి ఆజ్ఞానుసారం ఒక క్రమ శిక్షణతో మెలగుతాయి. అయితే అవి ఈ పద్యాల కూర్పులో తప్ప విడివిడిగా మన అభిరుచిని చూరగొనకపోవచ్చు. కాని పద్య గత నిర్మాణంలో ఒక విన్యాసానికి లోబడి శోభిస్తాయి. భౌతిక ప్రపంచంలోని ఈ వస్తువుల ఉనికిపట్లు సాధారణమైనవే కావచ్చు కాని పద్యగతంగా ఆ వస్తుసముదాయం మన అభిలాషను చూరగొంటుంది. ఆనందాన్ని ప్రోది చేస్తుంది.

కాని కృష్ణశాస్త్రి కవిత్వంలోని ప్రధానాంశాలను భావాలు అనుభవ పారమ్యతతో మాత్రమే ప్రాణస్పందన పొందుతాయి. అనుభూతి Feeling పారవశ్యాన్ని మన హృదయాలలో ఆయత్తం చేస్తాయి. కవితలో అభౌతిక భావనా సముదాయాన్ని ప్రధాన ఆధార భూమిగా రూపొందించుకోవడంలో కృష్ణశాస్త్రి తమ నాన్నగారు తమ్మన్నశాస్త్రి గారిని (దేవులపల్లి వెంకట కృష్ణశాస్త్రి అనేదే వారి పేరన్నా. దేవులపల్లి సోదర కవులుగా ప్రసిద్ధులైన పిఠాపుర సంస్థాన విద్వత్కవులలో రెండవవారు. వారు రచించిన "నయనోల్లాసం" అనే విశిష్ట ప్రబంధంలోని ఈ పద్యం.) కొంత పోలినట్లు కనిపిస్తుంది.

విరికిన్ మేల్వాలపుల్ గుబులొక్కనిన కీవి.క్, విద్యుతున్
సుప్రసిద్ధ రహింభాటిల్లునట్లు,
ధీకృతికిన్ నీతి స్ఫూర్తి ప్రాపంచినట్లు లక్ష్మీ
కరలక్షణ స్ఫురణతో నొప్పాను, కన్యాకృశో
దరినెమ్మేనికి జవ్వనం బొదవె సౌందర్యైక ధుర్యంబుగన్
(ప్రథమాశ్వాసం, పద్యం సంఖ్య 110, పు. 26)

ఈ పద్యంలో అమ్మాయి యౌవనవతి అయిందన్న భౌతికాంశాన్ని తెల్పడానికి కవి అభౌతికాంశాలను ఉపమలుగా ప్రయోగించాడు కేవల మనోగోచర విషయాలకే ప్రాధాన్యత కలిగించాడు. ఒక్క ఘ్రాణేంద్రియానికి అవగతమయ్యే "విరికిన్ మేల్వలపుల్ గుబులొక్కను" అనేది మాత్రమే ప్రయోగించాడు. భౌతిక అధి భౌతిక అంశాల సంలీనత ద్వారా తన వర్ణనీయ వస్తువును ఓజస్వంతం చేయగలిగాడు.

కృష్ణశాస్త్రి కవిత్వంలో ప్రధాన గుణం భావమైతే ద్వితీయ లక్షణం సంగీతం. ఆయన ప్రయోగించే ప్రతిమాటా సంగీత స్థాయికెదుగుతుంది. లగువు బిగువుల నందుకుంటుంది. భావానుభవ పారమ్యత నందిస్తుంది. అదే వారి విశిష్టత. ఈ స్వీయ ముద్రతోనే ఆయన కవిత్వం అవితర సామాన్యంగా భావిస్తూ వుంటుంది.

కృష్ణశాస్త్రి కవితా జీవితం పాటల కవిగానే ప్రారంభమైంది. ఆయన అచ్చమైన లిరిసిస్టుగానే ఆవిర్భవించారు. హృదయానుభవాలలోతులను, అందు కొని నివేదించడంలోనే ఆయన కవిత్వ అంతస్సత్వం ఆవిష్కరణ పొందింది. 1939 నాటికే ఆయన పాటలు నాగరీకుల వాకిట్లలో మ్రోగే మంగళ తూర్యారవాలయ్యాయి. అలాంటి అసంఖ్యాక గీతాలలో—"మధూదయం" అనేదొకటి.

''మధూదయంలో—మంచి ముహూర్తం
మాధవీలతకు పెండ్లి...
మాధవి పెండ్లికి మల్లెమాలతి
మందారం పేరంటాళ్ళు ॥మధూదయంలో॥
కొమ్మ కొమ్మ కొక సన్నాయీ
రెమ్మ రెమ్మ కొక గవ్వాయీ
కొమ్మా రెమ్మా కలసీ మాఘింటే
గుబురంతా ఒక టే పాటాయె! ॥మధూదయం॥

ఆకసమంత పందిరి అయితే
మధువనమంతా మండపమైతే
మాధవ దేవుడు మాధవీలతకు
మంగళసూత్రం కడతాడూ . . .
మధూదయంలో మంచి ముహూర్తం
మాధవీ లతకు పెళ్ళి . . .

అనే ఈ చక్కని పాటలోని ప్రతి పదచిత్రమూ ఒక సీరియస్‌నెస్‌నీ, ఒక వైవాహికకోద్వేగాన్నీ మనసుల్లో పెంపొందింప చేయడానికే సహకరిస్తాయి. ఇదే పాటలోని ఈ పద చిత్రాలే మరో పదేళ్ళకు రచించిన మల్లీశ్వరి చిత్రంలోని కోతీబావకు పెళ్ళంట అనే పాటలోనికి చేరి, హాస్య చతురోక్తులుగా పరివర్తనం పొందుతాయి. రసస్వరూపం మారినా భావనా ప్రాధాన్యతలో మార్పులేదు.

"కోతీ బావకు పెళ్ళంట . . . కోవెలతోటా విడిదంట
మల్లీ మాలతి వస్తారా . . . మాలికలన్నీ తెస్తారా . . .
బంతీ జాజీ చామంతీ, బంతులు కట్టీ తెస్తారా!

అంటూ మల్లీశ్వరి తన బావ నాగరాజును ఆటపట్టిస్తుంది. ఇలాంటి అధి భౌతిక భావనా సౌందర్యం మల్లీశ్వరి పాటలకో చోటు చేసుకోవడం వల్లనే ఒక సినిమా అసామాన్య కావ్యస్థాయినందుకోగలిగింది.

మల్లీశ్వరి చిత్రంలోని ప్రతిపాటా, ప్రతిమాటా, సజీవ చైతన్యంతో శ్రోత హృదయంలో ప్రవేశిస్తాయి. మరో పాట పరుగులు తీయాలి అనే దానిలో

"నల్లని మబ్బుల గుంపులు గుంపులు
తెల్లని కొంగలు బారులు బారులు"

అనే రెండు వాక్యాలలో ఆకాశమంత కేన్వాసుపై అద్భుతావహమూ, చిరస్మరణీయమూ అగు చిత్రాన్ని వేసి చూపుతారు. అవి శ్రోత భావుకవి సామగ్రిలో చేరిపోతాయి. స్వీయానుభవం కలిగినపుడల్లా ఏదో అనుభూతిని స్పందింపచేస్తాయి

కృష్ణశాస్త్రి మదికారంపై తాళ్ళపాక అన్నమయ్య అలవోకగా కురిపించే తెలుగు పలుకుబడుల ప్రభావం అతిపేలంగా కనిపిస్తుంది. ఆయన పాటలలో తెలుగుపదాలను సమపంపచేసి ఒక అపూర్వ లావణ్యాన్ని సాధిస్తారు. అలాగే ఆయన రచించిన జావళీలపై క్షేత్రయ్య పదాల ప్రభావమూ ద్యోతకమవుతుంది. మాటకీ మాటకీ నడుమగల శూన్యంలో లలిత శృంగార రసానుభవాన్ని చిప్పిల

చేస్తాడు. ఈ శక్తినే ఆయన తన సంప్రదాయ భూమికగా గ్రహించారు. ఫల పుష్పభరిత వసంత ద్రుమంగా ఎదిగి సర్వాత్మనా మెరిసిపోతారు.

పాతకాలపు జావళీలా ధ్వనించే-పిలిచిన బిగువటరా-అనే మల్లీశ్వరి పాడిన జావళీలో శారీరకతలంలో నిలిచే శృంగారస్థాయి కనిపించదు. భావనా స్థాయికే సముద్ధరించడం కనిపిస్తుంది.

''గాలుల తేలెను గాటపు మమతలు
నీలపు మబ్బుల నీడలు కదలెను
అందెల రవళుల సందడి మరి మరి
అందగాడ యిటు తొందర చేయగ
పిలచిన బిగువటరా!

సౌందర్యవతిని మెరపుతీగగా భావించిన కవులెందరో ఉన్నారు ఆయన మెరుపు తీగనే ఆసరాగా తెచ్చుకున్నారు. కాని ఇతరులెవరూ భావించని రీతిగా పలికారు. పద్యంలోనైనా పాటలోనైనా వారి ముద్ర స్పష్టంగా దర్శనమిస్తుంది.

భళిరా! ఎన్నడు జారె నీ భువికి
రంభారాగిణీ రత్న మేఖలయో?
నిర్జర వల్లభ ప్రియా వధూ కంఠ స్రవత్ దామమో?
మలయా గాగత మారుతో ల్లలిత
పంపావీచికా డోలికాచల దత్ఫుల్ల తేజ మాలికయో
చంచచ్చంచలాతన్వియో!

ఇది కృష్ణదేవరాయని కాలంలో ఒకానొక కవి ఆశువుగా చెప్పినట్లు మల్లీశ్వరి చిత్రంలో ప్రయోక్తమైంది. ఆ పాత్రోచిత భావనా సామగ్రి స్పష్టంగా కనిపిస్తూనే వుంది. ఐతే ప్రాచీనత యిందులో కేవల నటనా మాత్రంగానే కన్పుతున్నదే తప్ప అంతస్సారంలో నవ్యకవితా శ్రేణికి తప్ప సాధ్యం కాని భావావేశమూ బయటపడుతూనే ఉంది.

కృష్ణశాస్త్రి అభినవ కవికుల పతి కాళిదాసు. మేఘ సందేశంలో కాళిదాసు ప్రదర్శించిన భావుక మంజులత్వ మంతా ముద్దకట్టి అందాల ఓ మేఘమాల అనే మల్లీశ్వరీ పాటలో బింబితమైంది. ఐతే మేఘ సందేశం కేవలం యక్షుని స్వగతమే తప్ప అతని ప్రియకాంత విశాలాక్షి హృదయావేదన మనకు ప్రత్యక్షం కాదు. కృష్ణశాస్త్రి మేఘమాలలో ప్రాంత విభేదంలో ప్రేయసీ ప్రియుల విరహ తప్త హృదయాలను ఏకదేశంగా అదే మేఘం ప్రతిబింబిస్తుంది. మల్లీనాగరాజా

లిరువురూ మేఘాలపైనే తమ ఎదల వలపంకలనంటిస్తారు. అవును మరి! మేఘ మాలిక ఆకాశవీధిలో హాయిగా తిరుగుతుంది. దేశదేశాలన్నీ సంచరిస్తుంది. ఎందరో బాధితుల్ని చూస్తుంది బావ ఎక్కడున్నది దానికి తెలుసు. ఆ బావల రసవెల్లి తన హృదయాన్ని నివేదించమంటుంది మల్లి. ....గగన సీమల్లో తేలి పోయె మేఘమాల. తమ ఊరి గుడిమీద మసలి వచ్చేవుంటుంది. సందేహం లేదు. మల్లి మాట ఏదైనా మనసు చల్లగ చెప్పిపోతే బాగుండును అనుకుంటూ మేఘమాలను ప్రార్థిస్తాడు నాగరాజు.

ధూమ సలిల మరుత్తులతో రూపొందించిన శూన్యాకృతి తప్ప మేఘం మరేమీ కాదని తెలియక కాదు. మరెందువల్ల? చేతనా చేతనాల మధ్య విచక్ష విరహ తప్తులకు అందదుమరి! పైగా మేఘమాల ఆర్ద్రహృదయ, మమత లెరిగి నది. తానో ఎన్నాళ్ళుగానో రేవగళ్ళన్నీ దిగుళ్ళతో గడుపుతోంది. కళ్ళు కాయలు కాసిపోతున్నాయి తన దైన్యాన్ని చూసి మేఘమాల తప్పక కనికరించగలదు. అదీ మల్లీశ్వరి విశ్వాసం!

కళ్ళు తెరచినా మూసినా మల్లి రూపే తన హృదయంపై విలసిల్లోంది. ఆమె లేక అతను, బావ లేక మల్లి బ్రతకలేరు. తాను కురుస్తున్న కంటినీరు తన గుండెల్లో దాచుకుంటుంది మేఘమాల; తన బావ ముంగిలి సన్నని వానజల్లుగా కురిసి తన కన్నీటి ఆనవాళ్ళు చూపుతుంది. అదీ మల్లీశ్వరి ప్రార్థన.

ఈ దివ్యమైన గీతాన్ని హృద్యంగా గానంచేసిన శ్రీమతి భానుమతి, అమరగాయకుడు ఘంటసాలా మన రస ప్రపంచంలో శాశ్వత కీర్తి చంద్రికలు వెదజల్లుతూనే ఉంటారు. అజరామరగా జీవిస్తారు. మల్లీశ్వరికి సంగీత దర్శనం చేసిన శ్రీ సాలూరి రాజేశ్వరరావు తన హృదయాన్ని దేవదత్తంగా పలికించి అమృత మయ సంగీతధారలందించాడు. ఇన్ని ఉపజ్ఞలూ సమశ్రుతిగా మేళ వించడంవల్లనే మల్లీశ్వరి అమర కావ్యంగా దీపించింది. విరహాన్నీ ఆర్తినీ ఆవేదననీ మేఘమాల గీతమంత రమణీయంగా ప్రతిబింబించిన పాటే సినిమా ప్రపంచంలో నభూతో నభవిష్యతి అనేసత్కీర్తి పొందింది.

1948 నాటి మల్లీశ్వరి పాటలో కృష్ణశాస్త్రి వాడిన ఒక పదబంధం చిరంతన దీప్తితో వెలిగి, ఇటీవలి వేరొక సినిమాకు శీర్షికగా మారింది. అది "మా యింటి మహాలక్ష్మి" మల్లికి అంపకాలు చెబుతూ మెత్తని మనసుల ముత్తయిదువలు పాడిన పాటలో — మా యింటి దీపంగా. మా యింటి వెలుగుగా, అపరంజి బొమ్మగా ఆమె కీర్తించబడుతుంది

నాటికీ, నేటికీ తరగని యౌవనంతో, రసముద్ర కలిగించే ఇంద్రజాల శక్తి గోపికల బృందగానంలో ప్రచలితమైంది. "ఎవరేపిలిచేరల్లన మెల్లన

పిల్లనగ్రోవిని ప్రియా, ప్రియా!" అనే ఆ పాట సార్వత్రిక ప్రయోజనం గల కవిత వంటిదే; సాధారణంగా సినిమా పాటలు ఒకానొక స్వరఫణితి TUNE ఆసరాగా పదాల పంచడమే జరుగుతుంది. అంటే అవిధాతుమాతు సంయోగ రూపమైన ఆ ఫణితిలో తప్ప రీతిగా ఉచ్చరించడం కుదరదు అర్థస్ఫూర్తిగ అనుభవ పరిపాకాన్ని కలిగించవు. పినీ స్వర ఫణితితో నిమిత్తం లే ని ఒక గేయకృతివలెనే యిది అన్ని సన్ని వేశాలకూ ఉపయుక్తమవుతుంది.

"పొదలో కదిలే వెదురు గోలలే
గాలి ఈలలే ప్రియా—ప్రియా!"
"ఎవరే పరచే రిసుక బయళుల
మల్లెల శయ్యలు ప్రియా—ప్రియా"
"కరగే వెన్నెల పాల తరగలో
మరిగే నురగలే ప్రియా—ప్రియా"
"ఎవరే చెవిలో కొసరి కొసరి ఇటు
గుస గుస మందురే ప్రియా—ప్రియా"
చెదరే నిద్దుర యమున హృదయమున
బెదరే ఊర్పులే ప్రియా—ప్రియా!"

ఈ పాటలో ఎంత స్వచ్ఛస్ఫూర్తి ఉన్నదో అంత ప్రసాద గుణమూ రసిక హృదయాల నావరిస్తుంది. మల్లి పాడిన 'నెలరాజా వెన్నెలరాజా!' అనే విరహ గీతమూ హృద్యమైనదే!" ఊరి గుడిలో రావి కావల నాటి వలపుల మాటలన్నీ నేలపాలై పోయెనే; అని ఆమె గుండెకోత వివరిస్తుంటే—శ్రోతృ హృదయం కక్కటిల్లి పోతుంది. గొంతు పిడచకడుతుంది. "ఆతావి-ఆజావి ఆస్వామి సాక్షిగా ఆనాటి బాసలు అన్నికలలాయెనే....పొగిలి గుండెలు పగిలెనే— తుదకు బాధలు మిగిలెనే" అంటూ పాడిన ఆమె పాట రసజ్ఞుల హృదయంలో చిరవిరహ కీలల నెగసన త్రొస్తుంది,

ఇరువురూ ఎంతో దూరాభారాల ఎడబాటులో ఉండి కూడా ఏకకాలంలోనూ మల్లి నాగరాజులు పొందే విరహం 'విజయోనా బౌరా' అనే మరోపాటలో చక్కగా అభివ్యక్తమైంది. ఆమె మనసులో మరులు గొలిపి కడకు మాయమైపోయింది. రాణి వాసస్త్రీగా మారిపోయింది. ప్రాణమున్న మల్లి మాయమై, తనకొక రాతి బొమ్మ మిగిలింది. ఎప్పటి మల్లీశ్వరి! ఈ వాక్యాలు ఆవిష్కూర్తం చే కన్నులు చెమ్మ గిల్లడం తప్పడంలేదు!

పాపం ఆమె విధివంచిత! తనంత తానుగా తన ప్రియుని మోసం చేసింది కాదు. అందుకే ఆమె గుండె ఒక్కలా మ్రోగుతూనే ఉంది. వాటి కదలన్నీ వ్యర్థమై పోయాయి. వీటిపై అలలై పోయాయి బ్రతుకును బరువుగా ముంచాయి. పగలు లేని రేయిలాగ పలుకరాని రాయిలాగ బరువు బ్రతుకు తనకు మిగిలింది కావా నిజమేనా వలపులన్నీ కలలేనా అంటూ విషాద సాగరంలో మునిగిపోతుంది.

కావ్యశ్రేణి కెగసిన మరోపాటకూడా మల్లీశ్వరిపాడినదే! తెలుగు జాతికి నిత్యమూ వీనుల విందొనరిస్తోంది. మనసున మల్లెల మాలలూగెనే! అనేది. జ్ఞాపకాలు సౌరభాల సమన్వయ రూపాలతో చప్పున మనస్సులో మెరుస్తాయి ఆ జ్ఞాపకాలు విడివిడిగా ఉండవు. మాలలవలె సామూహికత్వాన్ని భజిస్తాయి. మనోతలంలో స్ఫురించే జ్ఞాపకం తాత్కాలికంగానైనా శరీరంలో సర్వత్రా ప్రభావాన్ని చింపుతుంది. అది కన్నుల వెన్నెల తోలలూగిస్తుంది. కొమ్మల్లో గువ్వలు గుసగుసమంటే చాలు — రెమ్మల్లో గాలి రవంత ఉస్సురుస్సురన్నా చాలు, అతడు వచ్చేడనే భావమో భ్రమో ఆ వేగం కలిగిస్తుంది. ఆమె గుండెలనిండా మధుర భావస్రోతస్విని నిండిపోతుంది. అలల కొలనులో గలగల మంటాయి. దవ్వులలో ఏదో వేణు రవం ఎడనెడ వినపడుతుంది. ఆమెకి అతడి పిలుపే వినిపిస్తుంది. "గడియేని యిక విడిచిపోకుమా!" అని బ్రతిమాలుకుంటుంది. ఎగిసిన హృదయం పదులనీకుమా" అని ప్రాధేయపడుతుంది. అవును మరి ఇన్నినాళ్ళకి కదా తన బ్రతుకు పండింది.

పాతకాలపు పదం వంటిది మల్లీశ్వరి చిలుకను సంబోధించి అన్యాపదేశంగా తన ఎదలహోరులు తెలుపుతూ పాడినపాట! "ఎందుకే నీకింత తొందర ఓ చిలుక, నా చిలుక, ఓ రామచిలుకా!" మరపురానిదిది! తొందరెందుకని మల్లి చిలుక నడుగుతుందేకాని తొందరంతా తనదే! అవును మరి ఇన్నాళ్ళ చెరసాల తీరేరేయి చేరువవుతోంది. దానితో బాధలన్నీ పాతగాథలై పోతాయి. కలతలన్నీ దరిచేరిన వెలుగుపుంతలో మాసిపోతాయి. ఎలాగోలా ఆ రేయి గడిచే చాలు. పంజరపు బ్రతుకు మటుమాయమవుతుంది. అప్పుడా తోటలో ఆ తోపులో ఆకుపచ్చని గూడులో హాయిగా బ్రతుకు గడుపుతుంది. చిరుగాలి తరగలా మురిసిపోతుంది. చిన్నారి పడవలా తూగిపోతుంది. పచ్చని రెక్కలు పరచి పరువులు తీస్తుంది. బ్రతుకు పొడుగునా హాయి పొందుతుంది.

తెలుగు సినిమా ప్రపంచానికే ఒక సముమ్నతస్థితిని కలిగించిన చిత్రము మల్లీశ్వరి. నాగరిక వేశాల చిత్రాలస్థాయికి మన చిత్రభూమికను ఉద్ధరించింది. బి. ఎన్. రెడ్డిగారి పెద్యాలాయిడ్ స్వప్నానికి కృ.శా. రాబ్దిక సౌందర్యం అమరింది. దానితోనే ప్రారంభమైన సినిపాటలపేటికగా కృష్ణశాస్త్రి కవితా జీవితం రత్నమంజూషగా మారిపోయింది రెండు అపూర్వవిజయాలను సాధించింది. దేవులుంచే

చాలా, రసించగల అశేష ప్రజానీకానికి కృష్ణశాస్త్రి కవితాహృదయాన్ని చేరదీసింది. అటు సినీమాపాటల రచనలో అంతకు ముందెన్నడూ ఎరుగని సౌకుమార్యానికి దోహదంచేసింది. సినీమా పాట మాధుర్యానికి కృష్ణశాస్త్రి కల్పించిన జలరేఖ చిహ్నం ( watermark ). తక్షణ పరీక్షకు నికషంగా ఉపయుక్తమైంది. కృష్ణశాస్త్రి భావనా సౌకుమార్యం, వర్ణనా సునిశితత్వం సినీ పాటల రచనలలో సైతం దూరంకాకపోగా ....ఆ పాటలకే సుస్మిత కవితానుభూతినీ నాగరకతా లాలిమనీ, కొత్త షోకునీ అందించింది.

## ఈ లోకం నీ యిల్లే-తీయనైన పూలవనం

కృష్ణశాస్త్రి రెండవ విజయం చిత్తూరు నాగయ్యగారి "నాయిల్లు" చిత్ర గీతాలతో సాధింపబడింది. "అదిగదిగో గగనసీమ... " అనే గీతం తెలుగుగుండెల లలో తుల్లిముట్టింది. "నీ కోసమే జగమంతా నిండెనోయి వెన్నెలలు" అనే అవిశ్రాంత విశ్వాసాన్ని సామాన్యుని శ్రమఖిన్న హృదయానికందిస్తుంది. "చిగిరింపదు తిరిగి....వాడి చెడిన పూలవనం। మరువకోయి ఈ సత్యం। అంటూ హెచ్చరిస్తుంది. వర్తమానుడు ఏదో అశ్రద్ధవల్లనో, తీరని ఉదాసీనతవల్లనో తనకు లభించిన ఈ మధుమయ జీవితాన్ని వ్యర్థించుకున్నాడా ఇంకేమీ మిగలదు. తీయనైన ఈ లోకంతో అతనికి పని తీరిపోతుంది. అదీ యీ పాట అందించే పల్లవి సందేశం।

కొలను దోపరికి గొబ్బిళ్ళో
యదుకుల స్వామికిని గొబ్బిళ్ళో—

అనే పల్లవిగల అన్నమయ్యగారి పాటలో తెలుగు భాష ఎంత సొగసరో తెలుస్తుంది. గుండెల్ని లాలిస్తూ ఆపాదమస్తకం మెరిసిపోతుంది. అన్నమయ్యగారు శాస్త్రిగారి పాటలకు ఆది గురువుగా కనిపిస్తుంది. ఇరువురికీ మధ్యగల కాల దూరాలింతగా విస్తరించినా తెలుగు తనంలోని అనుస్యూత మాధుర్య గుణం వీరిరువురినీ పెనవేసింది. "కొలను దోపరి" అనే పదబంధం....ఇంతమంది తెలుగు కవుల్లో అన్నమయ్యే కల్పించగలడు, "తెలియసుక మసకబయళ్ళలో" వంటి తెలుగు పదబంధాలను కృష్ణశాస్త్రే కల్పించగలడు। ఈ ఇద్దరూ యిద్దరే। కొలను వద్ద చీరలను దోపిడీ చేసినవాడు అని ఆ కొలను దోపరికి అర్థం. సంస్కృత సమాసంలో తప్తక్లుప్తత (Brevity) సాధ్యం కాదనుకొనే భ్రమాన్వదులకిదే జవాబు. మోసం చేసేవాడు మోసరి అయినట్లె దోపిడీ చేసేవాడు దోపరి అవుతుందని ఇటీవలి కాలంలో తెలుగు చెవి మరచిపోయింది. అలాంటి వెన్నో మనోహర పదజాలం విస్మృతమైపోయింది. నోరు తిరగని వైదేశిక పదాలు భ్రష్టరూపాలుగా నత్తి మాటలుగా మన గుండెల్ని పాలిస్తున్నాయి.

ఇలాంటి తెలుగు పదబంధాలు ఆయనలో ఎన్నో పునరుద్ధరించబడ్డాయి మాటల నేర్పరిగా పలిపాయి. సంస్కృత సమాసాల సౌందర్యాన్ని కొల్లగొట్టగల కవులో? అట్నే మనకెందరో ఉన్నారు. కృష్ణశాస్త్రి ఎన్నో గొబ్బిళ్ళ పాటలు రచించారు. పద్యాలూ రచించారు. పచ్చని వాకిట చామంతులు, ముంగిట రంగుల ముగ్గులు ముద్దబంతీ మొగ్గలు, ఊగే జనపచేలు, తూగే పెనగపూలు, గాలి దారిలో కంతా లెత్తే కాపుల పిలుపులు, పైరగాలికి పళ్ళికలెత్తి ఎగరబోతల కందించే పరతులు, అల్లుళ్ళ కోరచూపులు, ఇలా తెలుగు గ్రామీణ వాతావరణ మంతా తేట తెలుగు మైపూతలతో ఆయన పాటల్లో సాక్షాత్కరిస్తుంది తెలుగు వాకిళ్ళ వాకిళ్ళు గుబాళిస్తాయి. అలవోకగా ఆయన కలంనుంచి అందాలు జల్లులై కురుస్తాయి.

తల్లి గుండె లెరువు తెమ్ప్పుకుని శాస్త్రిగారు ఎన్నెన్నో లాలిపాటలు మెత్తని జాలినింపుతూ విరచించారు. కలువ రేకులలోన....కలలు మూసేనే.... కంటి రెప్పలతేటి జంటలూగేనే ఏజోలపాడినా ఏల పవళింపవే:" అనే హృద్యమైన గీతం కార్తవరాయని కథలోనిది. అచిత్రం మనకు జ్ఞాపకం రాకపోయినా పాట వెన్నంటుతూనే వుంటుంది. "చాలులే నిదురపో! జాబిలి కూనా! ఆదొంగ కలువరేకుల్లో తుమ్మెదలాడేనా?' అనే పాట ఒక్కసారి విన్నవారెవ్వరికైనా మరచిపోవడం సాధ్యమా? చంటిపాపలను ముద్దించే పాటలలో ఎంత మెత్తని మాటల గుత్తులు పేర్చారో! రతనాల బొమ్మలు. విరిజాజి విరికొమ్మలు, కంటి జాబిల్లి, మందారవల్లి ఇలా ఎన్నిటినో పేర్కొనవచ్చు.

కాలనదివి కదలు నావతేలి ఏమో ఎటకో, ఎవరో వేలు వేలు స్త్రీ పురుషులు వెడలి పోదు రెవరెవరో అన్నదమ్ములు వారు ఆప్తులు నాయన్నవారు ఆవలి రేవు అందగానే ఎవరికెవరో, ఏమౌదురో!"

"సకల బంధముల తెంపిన జగమంతా బంధువులే ప్రతి వాకిలి, ప్రతి హృదయం ఎదురుచూచు నీకోసం.

ఏకాకి బాటసారి....పొమ్ము బయలుదేరి" అనే పాట కూడా (నా ఇల్లు) నైరాశ్యంతో ఆత్మ విశ్వాసాన్ని అందిస్తుంది. బ్రతకవలసిందే యీ బ్రతుకు అనే భరోసా కలిగిస్తుంది....

క్రా రేన్‌సమ్ మరో రెండు చక్కని వాక్యాలు చెప్పాడు.

"It is the dream, the recollection, which compels us to poetry and to deliberate aesthetic experience"
అని పుట 85లో అంటాడు.

"Art is based on second love, not first love. In it we make a return to something which we had wilfully alienated. The child is occupied mostly with things, but it is because he is still

unfurnished with systematic ideas, not because he is a ripe citizen by nature and comes along already traiiing clouds of glory."

అని పుట 86లో వివరిస్తాడు. ఈ సూత్రులు శాస్త్రిగారి విషయంలో అక్షరాలా సరిపోతాయి, ఆయన పాదాలలో పదాలలో ఏనాటి కలలో గుత్తులు గుత్తులుగా పరిమళాలందిస్తాయి. ఆ కలలు కేవలం ఆయన సొంతాలే కావు. ఆయన బ్రతికిన ఒక దీర్ఘకాలానివే.ఆయన ప్రాతినిధ్యంవహించే తరానివే; అంటే మనందరికిలేని; నిప్పు అందరిపీ కాల్చినట్లు-కలలు అందరికీ కన్నీళ్ళు కార్పిస్తాయి.

ఏవో అందీ అందని మనోమయ బింబాలవంటి కలలేకాదు. ఆయన కవిత్వం నేలపై దుమ్ము పూసుకుంటూ నడయాడే పచ్చికలను సైతం నెత్తికెత్తుకుంటుంది. ఆకలినీ, రాపిడినీ, కన్నీటినీ, కాలుష్యాన్నీ కరుణామయంగా కౌగిలించుకుంటుంది. ఈ అంశం "ఆకలి" అనే చిత్రానికాయన రాసిన పాటలలో ద్యోతకమవుతుంది ఆ చిత్రం విశేష ప్రజాదరణ పొందకపోవచ్చు. ఆ లోపం ఆయన లేఖినిది కాదు. కారణమేమంటే ఆ చిత్రంలో ఒక హృదయవిదారక సన్నివేశంలో ఆయన ఒకపాట రాశారు.

పేదరికంతో ఓర్చుకోలేక ఆకలిమంటలకు నిలవలేక ఒక తల్లి పొరపాటు చేస్తుంది. తప్పుదుకాదా ఆమె స్త్రీత్వం దుర్భరమైన గర్భం ధరించింది. పాపను కని ఏ దారి కెలకులుందో జారవిడిచి వెళ్ళిపోయింది. అలాంటి దిక్కుమాలిన పసికందులు తాము చేయని నేరానికి, పాపానికి క్రూర శిక్షలనుభవిస్తారు; కాని ఆ పాపలే ఒకనాడెదిగి కసి తీర్చుకుంటారు. ఈ భరోసా ఆయన తెలిపిందే అదే చిత్రంలో ఒక ధనమదాంధుడు స్వర్గానికెగబడతాడు. తన ధనాఢ్యతో స్వర్గాన్ని సైతం కొనగలనని మురిసిపోతాడు. దేవదూతలు కొందరు వచ్చి వాడు భూలోకంలో చేసిన నేరాలన్నీ ఏకరువు పెడతారు

ఆకలిమంటల కాగలేక అతని వాకిట నిలచిన నిర్భాగ్యుణ్ణి వీడు కరిచాడు. వాకిలి మూస్తూ పో పొమ్మని అరిచాడు. మండుటెండల నిప్పులు చెరగుతూంటే నోరెండిన దీనుడు వచ్చి నీటిచుక్కకోసం అర్థిస్తాడు. వీడో వెచ్చని పాయసం త్రాగుతూ - "దొంగవెధవా పో"మ్మంటాడు. దిక్కుమాలిన రోగిష్టికుక్కలా ఒళ్ళంతా చీముకారుతూ దారి ప్రక్క ఒక దయనీయుడు పడి విలపిస్తూంటే వీడు రక్కపిలా కాలెత్తి తన్నాడు; ఒక అందాలరాశి కొక నిర్భాగ్యుడు భర్తకావడమే నేరమైంది ఆమెను వీడు బలాత్కారంగా మాయంచేశాడు. ఆ నిరుపేద కూడూ గుడ్డా లేక ఏడుస్తుంటే వీడు మిద్దెల్లో కులికాడు. ఒక దీనురాలు పాపం పీలికలైన గుడ్డలతో నిప్పుమడుక్కుంటూంటే పీడామెను లోనికి రమ్మని మానభంగం చేశాడు వీడు రాక్షసుడు—అంటూ ఆ దేవదూతలంతా వాడి నేరాలు

రజావు చేస్తారు. అంతా బృందగానంగా "పోరా పోరా పికాస్వర్గం" అంటూ నర కానికి తరిమేస్తారు.

ఆ చిత్రంలోని ఉపనాటకం అది దీనిద్వారా ధనాఢ్యుల బాధ్యతా రాహిత్యమూ, ధాష్టీకమూ హృద్యంగా చిత్రించబడింది. కృష్ణశాస్త్రి కమ్యూనిష్టు కారు. సత్యాన్ని గ్రహించడం ఒక కమ్యూనిష్టుల కైవసమే కాదు పరస్పర శత్రువర్గ విభాజ్యమైన వర్తమానలోకంలో లేమి ఎప్పుడు అగచాటులనుభవిస్తుందో తెలుసు కొందుకు ఆయనకు ఆబాల్యాదిగా పెంపొందిన మానవతా దృక్పథం ఎంతగానో సహకరించింది మనిషికీ మనిషికీ మధ్య వ్యవస్థ కల్పించిన వేర్పాటు ధోరణు లన్నిటినీ ఆయన దర్శన తృణీకరించింది.

మహిళలు: మధువనకుసుమాలు

"వేసంగి పూసేటి విరిమల్లె వే దేవి
నడిరేయి నడయాడు జాబిల్లి వే
నా ప్రేమ మందార సుమమల్లి వే—దేవి
నాలోన లోలోన నటియింపవే!—
చిరునగవుతో, నడక జిగి బిగువుతో
వలపులొలికేటి కనుచూపు బిడియాలలో
నీ సొగసు నా మనసులో నింపవే—దేవి
ఆనంద రసమందు నను ముంచవే!

కావ్య మర్యాదలతో రచింపబడిన కవితలా భాసిస్తోందే కాని యిదికూడా చిత్రం కోసం రచించినదే. తండ్రి అనే సినిమా అంత ప్రఖ్యాతం కాలేదు.

ఫ్యూడల్ వ్యవస్థలోని స్త్రీ పురుషాహంకారానికి వినిమయ పదార్థంగా పరిగణింపబడింది. పురుష ప్రధాన వ్యవస్థకు బలిపశువుగా మార్చబడింది. ఆ కుటిల నీతిపై తిరుగుబాటుగానే స్త్రీ పురుషుల అర్థాంగ సంబంధాల మర్యాద పున రుద్ధరించబడింది. అలాంటి పరివర్తన దశలో నవీన నాగరికతా వ్యవస్థకు కృష్ణ శాస్త్రి ప్రతినిధిగా నిలిచారు. కనుకనే వారు సహజ సౌరభం గల మధువన కుసు మాలుగా మహిళామణులను సంభావించారు. ఆనాటికిది విప్లవ దృష్టి. ఇది ఆయనలో అపారంగా ఉండటంలో అబ్బురం లేదు.

పై కవితలోని వస్తువు స్త్రీ ఆమెను మనోహర భావ జాలంతో అలంక రించి, కవి కీర్తించినపుడు అతని సంస్కార హృదయం తనంత తానుగా వచ్చి

స్వీయానుభవ ఆవిష్కారంగ పాల్గొంటుంది. కేవలం వస్తుపరనిర్లిప్త వైఖరి అవలంబించదు అలాగని వస్తువుకు అనర్హమైన భావనా హృదయంతో మృషా స్తుతికీ పూనుకోదు. అంటే కవి తన భావ జాలాన్నే తప్ప మూలవస్తువుకు అప్రాధాన్యత కల్పించే ఆత్మ ప్రత్యయ ధోరణికి దిగిపోరు. ఈ నైపుణ్యం ఎలా సాధ్యమవుతుందో రేన్సమ్ మహాశయుడే ఇలా వివరిస్తాడు.

"The ideas will not cover the objects upon which they are imposed, they are too attenuated and thread like. For ideas have extension and objects have intesion, but extension is thin while intension is thick. (Page92 Ibid)

వస్తువు ఆధారంతోనో, లేదా స్వీయానుభూతి ఆధారంతోనో కవి భావుక హృదయం సృజనోత్సవానికై ఆయత్తమవుతుంది. అపూర్వ వుత్సేకంతో పురి విప్పుకుంటుంది. కవి భావన అనుభూతినో వస్తువునో మూట కట్టేసేదిగా రూపొందరాదు. పూలలో యిమిడి అన్నిటినీ అనుసంధించే దారంలాగుండాలి. కృష్ణశాస్త్రి భావనా సౌందర్యం కళాపిపాసను ద్విగుణీకృతం చేసేది మాత్రమే!

సినీమాలకోసమైనా సరే ఆయన కవిత్వం కేవలం భావనా మందారాలు పుష్పించే మాయాలోకంలోనే సంచరించదు. భూగంధ బంధురమైన పీడకలల నెన్నిటినో పట్టియిస్తుంది "కార్మికులం మేమే-కర్షకులం మేమే ఈ లోకం ఇది మాదేనండీ! కామందులమండీ!" అంటూ ఎండనక వాననక పనిచేసి కండలు కరగించి మట్టిలోంచి బంగారం పెకలించే శ్రమ జీవులతో కవి హృదయం మమేకత్వం భజిస్తుంది. వారి హృదయాక్రోశాలు వినిపిస్తుంది.

## మిసమిసలాడే పసిడి లేడి

సీతారాముల జాలికథ విని కన్నీరు కార్చి, హృదయం వెన్నలా కరిగించి ఎన్నెన్నో పాటలు రచించారు శాస్త్రి. సందర్భం వస్తే చాలు పూచిన తంగేడులా పులకించిపోతారాయన! ఆయన సహజంగానే భక్తులు వైష్ణవ ప్రపత్తి సంప్రదాయంలో పెంపొందిన హృదయం మాయనిది. పుట్టుకరీత్యా స్మార్తులూ అద్వైతి కావచ్చుకాక, భక్తి సంప్రదాయంలోనే ఆయన హృదయం ఆవిష్కృతమైంది. సినీమాకోసమే కావచ్చు, రేడియో భక్తిరంజనికోసమే కావచ్చు శ్రవ్యనాటికల కోసమేనా కావచ్చు—ఎక్కడ రామకథ స్మరణకెలపినా విలువునా నీరయి శాస్త్రి హృదయం గంగా స్రవంతిగా ప్రవహిస్తుంది. సీతాపహరణ ఘట్టాన్ని బంగారు పాప సినీమాకోసం హరికథగా రచించిన శకలం ఎంత మనోహరమైందో! శబరి పాత్రకోసం ఆయన ఎన్ని గీతాలు రచించినా ఒక్కలాగే హార్దిక సౌరభం అక్షరాలపై పరచుకొంటుంది. "మిసమిసలాడే పసిడి లేడికై మిథిలానంద వేద

కాని "అనరాదా శ్రీరామయని" అనే పాటకానీ, "ఏమి రామకథ శబరీ, శబరీ—ఏదీ మరియొకసారి! నిన్ను జూచునందాక" అంటూ శబరి హృదయార్తిని వెళ్ళబోసుకునే ఘట్టంలో పాటకాని, బాపు నిర్మించిన సంపూర్ణరామాయణాంతర్గీతాలు కాని—దేనినెక్కడ ముట్టుకున్నా కవితా కాంతి కళకళగా వెలిగిపోతుంది. "అసలే అనదు చూపు—ఆపై ఈ కన్నీరు, తీరా దయచేసిన నీ రూపు తోచదయ్యయ్యో! అంటూ శబరి హృదయాన్ని అజరామర అనుభూతి సాంద్రతతో మెదిపి మరీ మరీ అందిస్తారు శాస్త్రి

"తాధిమిత కధిమితోల్ బొమ్మా" అనే గీతం తాత్త్విక రహస్యాలను ఆత్మీయంగా ఊదుతుంది. బంగారుపాప చిత్రంలో స్వర్గీయ ఎస్వీరంగారావు తన అద్భుత నటనతో ఈ పాట పాడుతూ చిరస్మరణీయం చేశాడు. విపులార్థ సంభరితమైన ఈ గీతం మనో మాలిన్యహరంగా మెరిసిపోతుంది.

నాలుగు దిక్కులనడిమి సంతలో తూలేత్రుళ్ళే
తోల్ బొమ్మా! ఇవరము తెలుసా తోల్ బొమ్మా!

అంటూ శ్రోతను చప్పున ఆకట్టుకొని అంతర్ముఖుని కావిస్తుంది.

"కన్న దేవకి వంతు కన్నీరె కాని—కన్నార నీ లీల కాంచలేదాయె! కృష్ణా!" అంటూ కృష్ణ జనన వృత్తాంతంలోని విషాదాన్ని స్ఫురింపచేస్తుంది. ఐతే కృష్ణశాస్త్రి జీవద్విషాదం నైరాశ్యపు ఉపరితలంలో ఊపిరి పీల్చదు. ఆశావాదపు ఆకాశాలకు రెక్కలు అల్లల్లారుస్తుంది. వీలయినపుడెల్లా—"బ్రతుకే యెలమావి తోట మదిలో మకరందపూ ఊట" అని హెచ్చరిస్తూనే ఉంటుంది. దీపంలేని కోవెలలో దేవుడుండడనీ అనురాగమొలుకు మనసే హరితావాసమనీ సందేశిస్తూనే వుంటుంది. కవిపించే ప్రతిమనిషిలోనూ గుడి వుందనీ, అడుగడుగునా గుడి వుందనీ—నవీన మానవతా మంత్రం వుపదేశిస్తుంది. బ్రతుకులో యెదురయ్యే ప్రతిరాత్రి వసంత రాత్రేననీ అక్కున చేర్చి ఆప్యాయంగా కన్నీరు తుడుస్తుంది ఆయన కవిత్వం!

## కలలదారిలో భాగ్యరేఖలు

''కన్నె ఎంతో సుందరి—సన్నజాజీ పందిరి!''

అనే పాటలోనే కాదు—ఆయన పాటలలో ఎక్కడైనా రూపకాలు ముగ్ధమోహనంగా ప్రత్యక్షమవుతూంటాయి. ఉపమాలంకారంకన్న రూపకమూ, అందునా మూర్తి కల్పనారూపకమూ Personification అనాయాసంగా చిందులు తొక్కుతాయి. "ఆకులతో గాలి ఊసులాడగూడదు. ఏటిలోని అలలు పెదవి విప్పగూడదు...." అనే వాక్యాలు ఒక్కక్షణం అనే పాటలో కలసిన మనసుల అను

రాగ గాఢనభివ్యక్తం చేస్తాయి. వాల్జాపులుయ్యాలలో అనురాగాల పూలమాలై గుబాళిస్తాయి. భక్తుడు ప్రేయసిగా, భగవానుడు ప్రాణేశ్వరునిగా భావన చేయడం—వైష్ణవ భక్తి సంప్రదాయానికి కొత్త కాదు చైతన్య ప్రభువు ఈ భావాన్ని మరింత విస్తృత పర్చాడు. మాధుర్యం తత్త్వాన్ని కొంత అంతర్లీనం చేసుకుని భారతీయ మార్మికవాదం సాహిత్యపరంగా ఎంతో సంపన్నమయ్యింది. ఈ మధుర భక్తి భావం కృష్ణశాస్త్రి ద్వారా చిత్రసీమ గొంతుని కూడా కొంత పునీతం చేయక పోలేదు. "నీవుండేదా కొండపై—నా స్వామీ, నేనుండేదీ నేలపై" అనే పాటలో ఆ స్వామి గుండెలకు మాత్రం చేరువగా నే దిగివస్తాడు. అనివార్యమైన అంతస్థుల విభేదం అడుగడుగునా చిత్రింపబడినా—హార్దికసాన్నిత్యం దూరాలనూ ఎత్తులనూ కుదింపచేస్తుంది. ఆత్మీయతనీ అంతరిక దైన్యాన్నీ కలిపి పెన వేస్తుంది, ఆర్తిని పిలిచి పేరంటం చెబుతుంది. అందరాని శిఖరాలపై ఉండే ప్రాణవల్లభుడు ఏ పూలతో పూజలందుకోవాలో తెమలక-చల్లగా దిగివస్తున్నట్లు హృదయంలో ఒక పరితృప్తి ప్రసరిస్తుంది,

చివరి వరకూ చిత్రగీత రచనా వ్యాసంగంలోనే గడిపిన శాస్త్రిగారు ఎన్నో అపూర్వ విజయాలు సాధించారు. స్వీయముద్రను సృష్టిస్తూ ఎన్నో ప్రతిధ్వనుల కారకమయ్యారు. ఐతే ప్రతి పాటనూ వివరించి విమర్శించుకోవడం ఈ పరిధికి అతీతతమే!

## కావేత్తి కవితా తత్త్వమ్

ఎదురుగా వచ్చి వాలినా ఒక్కో పిట్టను పోల్చుకోలేం. దాని రంగుల రెక్కల అందాలు చూడనూలేము. గొంతెత్తి పలకరించినా సరే, మన మనసంతా ఎక్కడో శూన్యంలో తారట్లాడుతుంది. ఒకోసారి మంచి కవిత్వాన్ని కూడా అంతే! అందాల రెక్కల పిట్టలాగే నిరాదరణ పొందుతూ ఉంటుంది మంచి కవిత్వం. గొప్ప ప్రత్యేకతలతో ఒక కవితా గీతం ఏమైక్‌లనుంచో, ఏ రేడియో నుంచో కృష్ణశాస్త్రి, పాటే అలవోకగా జాలువారుతూంటే ఈ దేశంలో ఎందరు పట్టించుకుంటున్నారో మరి. వాటి కళామాధుర్యంతో ఎన్ని గుండెలు భావుక తరంగాల్లో తేలిపోతున్నాయో!

"అబ్బ! ఎంత బాగుంది!" అంటూ లొట్టలు వేయడమేగాక టి.ఎస్. ఎలియట్ చెప్పినట్లు,

Penetrating far below the conscious levels of thought and feeling అనే పారవశ్య స్థితినో మాదకత్వాన్నో ఎందరు అనుభవిస్తున్నారో ఇదెందా నాకెప్పుడూ తీరని సందేహమే!

'కాం వేత్తి కవితా తత్త్వమ్
ఈశ్వరో వేత్తి వానవా!'

అనేటంత పెద్దమాటలు చెప్పి....సమగ్రకవితా స్వరూపాన్ని అవగాహన చేసుకోవడమంటే, ఈశ్వరస్వరూపాన్ని అవగాహన చేసుకోవడమేనని దబాయించడానికే నేనీమాటలు చెప్పడం లేదు. మంచి కవిత్వంలోని కళామాధుర్యాన్ని కించిత్తయినా అనుభవించని సంస్కారుల హృదయాలు ...జనన మరణాల మధ్యస్థవ్యవధిలో ఏ ఉత్తమానుభవాలను పొందినట్లు?

విజ్ఞానికిది న్యాయమైన సందేహమే; అనుభోక్తల పరంగా కలిగిన ఈ సంశయానికి అవతలి పార్శ్వం కూడా లేకపోలేదు. ఒక కవి సమగ్ర కళాకారుడు కావాలంటే సర్వ సాహితీ ప్రక్రియలలోనూ చిత్తశుద్ధితో కృషి సల్పవలసిందే ననిపిస్తుంది. ఎందుకంటే ఏ ప్రక్రియా విశేషంతో ఏ సంస్కార స్థాయి గల సహృదయత రమిస్తుందో? కాస్త తీయని గాలి పీల్చుకుంటుందో? రవంత ఆనంద పారవశ్యం అనుభవిస్తుందో? తన పండ్లనేదో జీవి తిని తృప్తి పొందడంలోనె చెట్టుకి హాయి; అలాగే అచ్చమైన కవికి తన ఏదో ఒక రచన ఎవరో ఒకరు- అపరిచిత అతిథి అనుభవించి ఆనందిస్తేనె నిజమైన సంతృప్తి.

కృ. శా. తన ప్రఖ్యాత కావ్యాలలో ఎక్కడా హాస్యానికి చోటు కల్పించ లేదు. సినిమాపాటలలో పాత్రగతమైన అవసరాల కోసం అడపా తడపా హాస్యానికి ఆదరణ చూపకపోలేదు. వచన రచనల్లోనూ, రేడియో నాటికలలోనూ చమత్కారమూ హాస్యమూ సముపాళ్ళలోనే రంగరించబడ్డాయి. కరుణ కృ. శా. కవిత్వానికి అంగి రసమే; కాని కృ. శా. కేవలం హాస్యం కోసమే ఒక కావ్యం రాశారంటే చాలా మంది ఆశ్చర్యపడతారు. పోనీ దానిని కావ్యం అనకూడదంటే నా కభ్యంతరం లేదు. దాదాపు అర్థ శతకంగా సాగి, ప్రతి పద్యమనోహరంగా సాగిన దానిని కావ్యం అనడానికి ఇష్టపడని వారి దేశంలో ఇంకా ఉంటే ఎవరమూ ఏమీ చేయలేం

నిత్యం అపహాస్యం పాలవుతున్న లోకవృత్తాన్ని పరిశీలించి, అనేక సన్నివేశాలను అందలి వ్యక్తులనూ చదివి, ఆయా పాత్రల విశిష్టతను తన కుశాగ్ర బుద్ధితో పట్టి లాగి, హాస్యరసోద్భవంగా వేమన శతకం రచించారు శాస్త్రి. ఐతే తన శతకం చదివీ చదవగానె లోకస్థులు తమ అవగుణాలను విసర్జించి, ఆత్మ పరివర్తనం పొంది గుణవంతులై పోగలరనె దురాశతో కాకపోవచ్చు.

'ఎంత చదువు చదివి ఎన్నియో విన్నను
హీను డవగుణంబు మానలేడు:

బొగ్గు పాల గడుగ పోవునా నైల్యంబు
విశ్వదాభిరామ వినుర వేమ!'

అని వేమన యోగి స్వయంగా చెప్పనే చెప్పాడు. ఆ సత్యం శాస్త్రికి తెలియకమా కాదు. ఐతే ఎందుకు మరి లోకవృత్త ప్రదర్శనం....కవి దర్శనకు నైసర్గిక కేవలలక్షణం గనక, అంతే తప్ప, ఎలుక తోలు తెచ్చి ఉదుకుదామనే ప్రయత్నంతో కాదు.

తాను పుట్టి పెరిగిన చోట వెలమ దొరలకి విచిత్ర ప్రవర్తనలు కృ.శా. కి తొలినాటి నుంచీ నవ్వు తెప్పించేవి. అసహ్యమూ కలిగించేవి, తాను పొందిన హాస్యాన్ని మనకీ అందించాలని యిలా అన్నారాయన,

కోడిపుంజు పందెమాడి శ్రీ దొరవారు
అమరపురికి పయనమైరి కాని...
రెండు పనుల కోసముండి పోయారయా

మకుటం వేమనగారిదే గనక వేరుగా రాయనవసరం లేదు. కోడిపుంజుల పందెంలో ఓడిన దొర వారు ఆత్మ త్యాగం చేసుకుందుకే పూనుకున్నారా....కాని వెధవది కోరిక లాగింది. రెండే రెండు పనులు సజావుగా జరిపించడానికే బ్రతకడం మంచిదనుకున్నారు. ఆ రెండు మహాత్కార్యాలూ ఏలాంటివి? శాస్త్రిగారు వివరిస్తారు.

ఒక్క సేరు మాంసమూ దేయగలరయా
ఏటి కొక్క బిడ్డ నిట్టి కందు
రసలు యోధవతులు సిసలైన శ్రీవారు

అదీ దొర వారి పౌరుషం. అంతేనా ఇంకా వుంది.

ప్రొద్దు పోక బాబు బొబ్బిలి కథ విని
గోడ మీది బల్లి మాదలాగి
ఒక్క కేక పెట్టి ఊరుకున్నారయా

బొబ్బిలి కథ వింటే పౌరుషం పెల్లుమని పొంగి పోయింది. తమకుల స్వాముల పౌరుషగాథ కదా; కాని దాని ఫలితార్థమేమిటంటే అది వేరే సంగతి; వారి పౌరుషం యింకా ఎలా అభివ్యక్తమైంది?

దొరలు రాజుగార్లు తొందర పడినారు
ఉరిమి గ్రుడ్లు, తొడలు చరిచినారు
ఖాస లోకరి నొకరు మెలిపెట్టి వేశారు

అవును మరి, పౌరుషం పెంపెసలాడి పోతే ఎలా ఊరుకుంటారు? ఒకరి మీసాలొకరు మెలిపెట్టుకున్నారు.

ఒక్క దొరల జీవితాలేనా వర్ణనాత్మక వస్తువు? ఎక్కడ అపహాస్యపు అస్తవ్యస్తపు బ్రతుకు అనిపించినా శాస్త్రి గళాఘాతం వినకుండా ఊరుకోలేదు.

పంచదారకన్న పంచదార తీయన
రాజుకంటె మోజు రంకు మగడు
వినదాని కంటె కానిది మేలయా

అసలు మానవ నైజంలోనే ఒక వైచిత్రి ఉంది ఉన్నదాని పైకొత లేని దాని పట్ల ఆరాటం ఎక్కువ. అదే పై పద్యంలో చెప్పబడింది. ఇందులో "రాజు" అనే పద ప్రయోగం సార్థకమే దాని వెనక ఒక యదార్థ కథకూడా ఉంది.

కుల బ్రాహ్మణులు ఏయే రీతులుగా దగజారిపోయి బ్రతుకుతున్నారో అందరికీ తెలిసిందే; ఐనా యింకా తాతల నాటి పౌరుషాల కోసం మృషా పవిత్రత నటిస్తూ ఎలా చస్తున్నారో వికృతంగా చీల్చి అరగదతారు.

కత్తి వదలి రాజు కామిని చేపట్టె
గంట మొదిలి మంత్రి గరిటెపట్టె
వేసమునకు మిగిలె మీసాల దుబ్బులు____

అదీ ప్రస్తుత కాలంలో రాజులూ మంత్రులూ బ్రతుకుతున్న స్థితి. ఇక వైదిక బ్రాహ్మణులో-

వేద విద్యనాటి వెలుగె నశియించె
గారె బూరె ప్రావాతు మిగిలె
బుర్ర కరగి కరగి బొర్రగా మారెరా:

ఇక వియోగ ప్రభువులెలా ఉన్నారు?

ఆరు వేల కొంపలంటించె నయనారు
ఆరు వేల వేలె అప్పు కలదు...
అతడు కాక యెవ్వరాలు వేల నియోగి:

మన వేపారి పంతుళ్ళేం తక్కువ వారా?

విసువు పుట్టి ఒక్క వేపారి పంతులు
సాని దాని మంత్రసాని చేసె:
సాని విసుగు పుట్టి సాకాని చేపట్టె...

ఇలా రకరకాల భ్రష్టాచారానికి బ్రాహ్మణజాతి లోనవుతున్నదా పాపకాలపు గొప్పలు చెప్పుకుంటూ ఇంకా ఏదో వెలగ బెట్టాలనుకుంటూనే ఉంది. తాము జపించే మంత్రాలపైనా, చేసే పూజలపైనా తమకే నమ్మకం లేకపోయె; దేవతా ర్చనమంటే పొట్ట నింపుకోవడంగా అర్థం స్థిరపడిపోయింది.

సంధ్య వార్చి వార్చి శాస్త్రికి, విసుగయి
బూబు మీాద మనసు పోయి పోయి
తురక మతము పొంది దూదేకులా యెరా,

అదీ స్థితి. ఇక మన వ్యాపారస్థులెలా ఉన్నారు? యుద్ధమూ, కరువూ వగైరాల ధర్మమా అని వ్యాపారమంతా నల్లరంగు పూసుకుంది. సెట్టిగారికీ నల్లరంగు సహజ శోభనే కలిగించింది. అదీ ఎలాగున్నదీ-

తెల్ల గోడ నలుపు వెల్లుల్లియే నలుపు
పాలు నలుపు కాగి తాలు నలుపు
సెట్టిగారి యింట సెందురుడే నలుపు—.

ఈ విధంగా ప్రతి పద్యం రవోదయంగా సాగిన కృ. శా. వేమన పద్యాలలో చమత్కారమూ, హాస్యమూ కొల్లలుగా దర్శనమిస్తుంది. ఆటవెలది పద్యానికి గల సౌందార్యానకాశాలకన్నిటినీ వేమనయోగి ఏనాడో కొల్లగొట్టాడు. అదే ఛందాన్ని తీసుకుని శహబాష్ అనిపించగలగడం అంత తేలిక కాకుండాపోయింది. కృ. శా. ఆ పద్యాన్నే మరింత హృద్యంగానూ అనవద్యంగానూ సంతరించారు. సమకాలీన సమాజ వాస్తవికతను దానికి భూమికగా గదియించారు. హాస్యరసం మనిషి హృదయంలో మిత్ర వాక్యంలా చేరుతుంది. స్మృతిలో వెలుగుతూ వుంటుంది. కేవలం సాహిత్యంతోనే ఎవరూ ఎవరినీ పూర్తిగా మార్చివేయలేరు. కారణం వేమన్నే వివరించాడు.

తుమ్మ చెట్టు ముళ్ళు తోడనే పుట్టును
ఎత్తులోన నుండి వెడలునట్లు;
మూర్ఖునకును బుద్ధి ముందుగా పుట్టును;' అని

## నాటకాంతం కవిత్వం

అనే ఆర్యోక్తి ఉందేదాన్ని పరిశీలిస్తే అది ఉత్తపాతకాలపు మాట అనే నిజం తేలుతుంది, కవిగా ఒకని పూర్ణ ప్రజ్ఞ ఉత్తమ నాటక రచనానంతరమే తేల గలదనీ కాళిదాసు కాలంలోనో, భవభూతి కాలంలోనో భాసుని కాలంలోనో

విలువకెక్కినట్లు ఆధునిక కాలంలో నికషం కాలేదు. ఈ కాలంలో కవిత్వం దారి కవిత్వానిదీ—నాటకం దారి నాటకానిదీని. భిన్న భిన్న సాహిత్య ప్రక్రియలు భిన్న విభిన్న ఉపజ్ఞలపై ఆధారపడి బ్రతుకుతున్నాయీ కాలంలో। ఐనా సుశిక్షితుడైన కవి నిరంతర సాధకుడైతే ఏ ప్రక్రియనైనా అవలీలగానె సాధించగలుగుతాడు. కారణం మరేమీలేదు. సాహితీ ప్రక్రియలన్నింటిలోకీ కవిత్వసిద్ధి పరాకాష్ఠ వంటిదని నేను కొత్తగా చెప్పే మాటకాదు. అన్ని ప్రక్రియలూ దీనిలో బీజప్రాయంగా నిక్షిప్తమయ్యేలా ఉంటాయి ఒకడి ప్రజ్ఞల్లా వాటిని అంకురింపచేసి బయటకు తెచ్చుకోగలగడమే।

ఈ దేశంలో మద్రాసు రేడియో కేంద్రం స్థాపించబడటమూ....దానిలో శాస్త్రి కవితారాధకులు కార్యనిర్వాహకులు కావడమూ తెలుగు సాహిత్యానికే ఒక అదృష్టరేఖ। శాస్త్రిని ప్రేమించే సర్వశ్రీ ఆచంట జానకిరామ్, బాలాంత్రపు రజనీ కాంతరావు, బుచ్చిబాబు, సూరినారాయణమూర్తి, అయ్యగారి వీరభద్రరావు వంటి విజ్ఞులంతా రేడియో నాటక ప్రయోక్తలై శాస్త్రిని బతిమాలీ బామాలీ ఎన్నో గొప్ప రచనలు చేయించారు. పురుషుడి ప్రేమ ఊటబావి వంటిది....అంటుంది మధురవాణి. "తోడినకొద్దీ వస్తుందట నీరు" సరిగ్గా ప్రతిభావంతుని హృదయమూ అలాంటిదే। తీసిన కొద్దీ జలాలూరిస్తుంది. ఉపజ్ఞ।

కృ. శా. సాహిత్య స్వర్ణోత్సవ సందర్భంగా ప్రచురించబడిన శ్రవ్య నాటికల సంపుటాలు రెండు మనకు లభ్యమవుతున్నాయి: అందులో శర్మిష్ఠ అనే సంపుటికి ప్రశంసా పత్రం రచించారు శ్రీరంజని। "రేడియో అట్టిపెట్టి ఉండకపోతే అందులో మొదట అభిమానులూ స్నేహితులూ కార్యనిర్వాహకులుగా పని చేస్తూ తన చేత బలవంతాన రాయించి ఉండకపోతే తను అసలు నాటకాలు రాసి ఉండనేమో అని అంటూంటారు శాస్త్రిగారే।" అని శ్రీరంజని పలికిన సాక్ష్యం నిజమే। బహిర్ ప్రేరణ సాహిత్యలత చిగిరించడానికీ పుష్పించడానికీ ఎంతో దోహదం చేస్తుంది.

ఇందులోనె శ్రీ రజని, పాటకీ కవితా గేయానికీ మధ్యగల సాంకేతిక విభేదాన్ని ఇలా వివరిస్తారు "గురజాడ వారి ముత్యాల సరాలు, పుత్తడి బొమ్మ వంటి కథా పదాలు (Ballads) నండూరి వారి ఎంకి పాటలు, బసవరాజు అప్పారావుగారి పాటలు, అడివి బాపిరాజుగారి పాటలూ, ఇవన్నీ సంగీతపు ఊపు అంటీ అంటని రచనలు అనిపిస్తాయి శాస్త్రిగారి ఖండకావ్యాలలోని మాత్ర గణ గేయాలలో కూడ సాహిత్య పరుల పాటలే। అంటే వాటిలో కవితా భాగం ఎక్కువ బరువు దానికి పెట్టే సంగీతం, పైగా చేర్చుకొన్న ఒక తొడుగుమాత్రం।అవి

కాక శాస్త్రిగారు ఆ తరువాత రాసిన గేయాలూ నాటికలూ-అనసూయా, సీతలనో, రజనినో, పాలగుమ్మి విశ్వనాథంనో, మల్లికనో దగ్గర కూర్చోబెట్టుకుని, కొన్ని సందర్భాలకు తగిన సంగీతపు వరుసలు పాడిస్తూ ఆ వరసలకు తగిన మాటలు కూరుస్తూ రాసిన వాటిలో గేయానికి కావలసిన సంగీత రచనలోని విశిష్టత సాహిత్య గౌరవమూ ఈ రెండూ ఎలా వుండితీరాలో అలా సమకూడుతూ వచ్చాయి. ఇలాంటి రచనలు రేడియో ప్రారంభమయాక వచ్చినవే." అంటూ రజని పలుకుతున్నారు. కృష్ణశాస్త్రి రచనలతో తనకు గల సంగీతానుబంధం అట్టిది.

స్వర్ణోత్సవ ప్రచురణలలో ధనుర్దాసు, శర్మిష్ఠ అనే సంపుటాలలో ధనుర్దాసు, సాయుజ్యము, గుహుడు, శివక్షేత్రయాత్ర, శర్మిష్ఠ, కృష్ణాష్టమి, యమునా విహారి, ఏడాది పొడుగునా, గౌతమి, వేణుకుంజం అనే పది నాటికలు సంకలిత మయ్యాయి. ఇవన్నీ రేడియో ద్వారా ప్రసారితాలే. సాంకేతికంగా ధ్వని ప్రధాన సంవిధానంతో రచింపబడ్డవే. కనక సాధారణ రంగస్థల నాటకాల మాదిరిగా పాత్రలశీల పరిశీలన సంఘటన నిర్మాణమూ యిత్యాది అంశాలతో చూడడానికి వీలులేనివి. రసభావ సమన్వయ మూర్తులుగా కేవల కంఠధ్వని ప్రత్యేకతలపై పాత్రలరూపకల్పన రూపొందినవిగా మనం గ్రహించాలి. ఈ నాటికలలో నాటకీయతకన్న సహజంగా కవిత్వం పాలు ఎక్కువ అంటే నేరుగా రసావిష్కరణకే అవి ప్రయత్నిస్తాయి. అందువల్ల లిరికల్ ఎలిమెంటు ప్రధానం.

ఈ పదినాటికలూ పది సమగ్ర కావ్యాలుగా మనం స్వీకరించి, సమగ్ర పరిశీలన చేయవలసి వుంది. అంత సర్వంకష పరిశోధనకు యిక్కడ అవకాశం లేదు. కనక వాచవిగా వేణుకుంజం అనే విశిష్ట నాటికను పరిశీలించుకుందాం.... ఊరు పటమటను ఏరుంది ఏటి దరినే మామిడితోట....తోటకూ పుంత బాటకూ నడుమనే పాటలు పాడే వేణుకుంజం. అది కథలు చెబుతుంటే ఏరు చల్లగా ఊం కొడుతుంది. అలాంటి ఒక కథయిది. ఆ ఊరిలో వెంకటేశు భార్యపోగా అల్లారుముద్దుగా కూతుర్ని పెంచి పెద్దచేస్తాడు. ఆమె కార్తీకంలో రెల్లుపొదలా కలకల లాడింది. కందిరీగవంటి నడుమూ. కదురూవంటి ఒళ్ళూ. మందంగా గోవులాగ నడుస్తుంది. పైరు చేనామెను చూచి పరవశమవుతుంది. పైరుగాలి పరదాగా పడుచుబుగ్గ నిమిరేది. కొండయ్య చేనులో పాలేరు గోవయ్య.... వెదురుచువ్వలా నిటారుగా ఉంటాడు. వాడి సోయగమంతా సోగకన్నుల్లో ఉండేది. వాడి పెదవుల కన్న ముందు బుగ్గలు నవ్వేసి, బుగ్గలకన్న ముందు కళ్ళు నవ్వేసి....గోవయ్యకు వీరమ్మ అంటే కొండంత యిష్టం. కళ్ళూ కళ్ళూ కలసి నల్లకలువ మాలలయ్యేవి. నడుమ బయలంతా వెన్నెల తీగలు పాకేవి. గోవయ్య వీరమ్మకోసం ఏడు సముద్రాలు దాటైనా ఏడు రకాల పూవులు తెస్తాడు. పసి వాళ్ళకేం తెలుసు బయళ్ళనిండా కళ్ళే ఉంటాయని. ఊరంతా పొక్కింది.

కొండయ్య దొరకి గుండె గుబగుబలాడింది వాడసలే ఆబోతు. వాడికి దొంకర పళ్ళూ, లాంతరు కళ్ళూను. వాడు వచ్చి వేణుకుంజం వీధలో తైతాయిస్తే దాని గుండె నిట్టూర్చింది ఇంతలో దూరంలో వీరమ్మ మేఘంలో మెరుపల్లే. వాడు ప్రయత్నిస్తాడు. గోపయ్య వస్తాడు. భయపడి ఆ వేళకి విరమించి వెళ్ళిపోతాడు. మరో ప్రయత్నంలో గోపయ్యని పొరుగూరి పేద్యం కాపలాకి పంపి కొండయ్య వీరమ్మని చెరుస్తాడు. వీరమ్మ చనిపోయింది. తండ్రి వెంకటేశు గుండె కుమిలి ఏడుస్తాడు. ఊరంతా ఏడుస్తుంది.

''తుదిదాకా ఆ కన్నియ కథ ఎలాగ చెప్పిందో
వెదురు వెదురు కణుపు కణుపు వెక్కి వెక్కి ఏడ్చెను!
కథ తుది వచ్చేసరికి కరిగిపోయి కరిగిపోయి
పొదను చూసి ఏరెడ్చెను, పొద యేడ్చెను యేరుచూసి

వేణుకుంజం అనే పేరు వినగానే అలనాటి రేపల్లె గొల్లని కథ కాబోలనని అంతా భ్రమ పడతాం. తీరావింటే మన పల్లె పల్లెకీ వినిపించే పాత కథే. దానినే ఒక మహాకావ్య స్థాయిలో కళామయ మొనర్చి అందించారు కృష్ణశాస్త్రి. చరాచర జగత్తంతా సాక్షీభూతం కావడమే కాక ఈ దారుణకథ విప్పడంలో పాత్రధారీ అవుతుంది. ఈ పది నాటికలూ పది మహాకావ్యాలు.

కాని వ్యవధేది? ఇంతలోనే ఎవరో కృష్ణకోకిలస్వామి కవితాగాన మధుశాల నెందుకో మూసివేశారు. మాధ్వీక మందిరద్వారబంధనమేల శుభవేళ? అని ఎవరిని అడగాలి? ఎవరు జవాబిస్తారు? ఎంత మెత్తని యడుగుల నేగుదెంచి నావా? నాకయి నాకుటీరాజిరమున? అంటూ విస్తుపోవడమొక్కటే కవితా రసపిపాసువులకు మిగిలిన నిట్టూర్పు నెత్తావి.

"పిలిపిలి దారాల తారాలతాంత మాలల్లలు" కుంటూ ఆ విశ్వప్రేమికుడు ఎటకో ఎటకో జలదార దాటి వెళ్ళిపోయారు? కాని ఆయన ఊరుపు కెరటాలన్నీ ఊపి ఊపి మనసు నొక్కొక్క వేదన కావ్యమౌను, మరియు గానమౌను, అన్న దాకే ఆశతో ఎల్ల ఎల్లలు కరగగా, ఎల్ల కల్ల లల్ల వల్లన సురసగా, ఎల్ల జనులు చల్లని కుటుంబమయి మన జాలు వరకు కృష్ణశాస్త్రి మధుర కంఠధ్వని కవితా గాన తరంగ ఢమరుకమై మ్రోగుతూనే ఉంటుంది.

కాని ఇంతలో వారే ఏ ప్రాణసఖుడో తన కోసమై పంపిన పల్లకీలో కూర్చుని పూలపల్లకీలో పూలమాలలా పొలిమేరల కావలకు వెళ్ళిపోయారు.

"రేగు కోర్కుల గుత్తి నా గుండెయటు లెర్ర
నెఱ్ఱనై నది మూని యివురు గుబురు

మ్రోగుపాటల పేటి నా గళమ్మటు తీయ
తీయనైనది పుల్గు తెరవగూడు
ననుచు నూహాల తోల నా మనస్సులో పారు
సేరులైనది గాలి మోర మెరక,
ననయము తావుల కోవ నా మనిక యటు సిత
హాసితమైనది మల్లెయలరు తీవ!

అనుకుంటూ కృష్ణశాస్త్రి మధు మాస వనహాసంగా మారిపోయారు.

## కృష్ణ కోకిల స్వామి

నవ్యకవితా వసంతుడై కృష్ణశాస్త్రి ఆగమించే సరికి ఆంధ్ర సరస్వతికి ముసలి తనపు దీర్ఘ శిశిరం దుపికిల్లిపోయింది. ఓసరిల్లివున్న పాతలోగిలి తలుపు ఆమని తోటలోనికి బార్లా తెరచుకుంది. కొత్తగా ఒక పైరగాలి కొసరి కొసరి గుబాళించింది. అలసి సొలసిన హసంతి కానలం నింపాదిగా తట్టి తట్టి తేపింది

"తెరలతో వీచికల తోడ తరులతోడ
విమల డిండీర ఖండ గండములతోడ
మురువు, ఠీవియు నా మోదంబును, జవంబు
వడువు నొప్పంగ గంగమ్మ నడువవమ్మ!"

అని పిలుచుకుంటూ తాను ముందుకు సాగుతూ విశ్వంభరావధూటీ కంఠ తార మౌక్తికహారదామకంబగు కవితా గౌతమిని చేరబిలుస్తూ మన హృదయతలాలలో ప్రవహింప చేశారు కృష్ణశాస్త్రి.

"విరిసి జాబిలి మల్లిరేకగా
దొరిసి తేనియల మువ్వాకగా
కురిసి మా పయిధార ధార ముంచెత్తగా
వేంచేసినావయా కరుణానిధీ!"

అని గొంతులో పాడుకుంటూ వెక్కిళ్ళాపుకుంటూ మన హృదయతోరణం మిగిలిందిక్కడ. మన గుండెలపై బరువుగా పడిన పెను నిద్దుర మడతల తొలగించుకొన్నది. అలా వచ్చి కృష్ణశాస్త్రి నవ్యకవితా కల్పశాఖపై నెలకొన్న కోకిలస్వామివలె వేంచేసి, ఎనభై మూడేళ్ళ పండబారని వయసు వరకూ ఈ మట్టిని చైతన్యరేఖగా మలచిన మహాశక్తి.

కృష్ణశాస్త్రి రాక రాకాశశికి కొత్త రూపురేఖ. ఖావి కాలాల నిశ్శబ్ద పథాల లోనికి పరచుకొన్న చల్లని చూపు. కృత్తాల మేలుకొలిపే గొంతు సారింపు. అమర జీవనపుటంచుల ఆప్యాయంగా, మృదువుగా విమురుతూ వచ్చిందాయన పాట। హేమంత సరోవరంలా కదలబారక కునికిపాట్లుపడుతున్న తెలుగు కవిత వారి రాకతో కొత్త రెక్కల జోడు కేలించుకొన్నది. ఆయన పాట బ్రతుకును తరచి తరచి చుట్టిన సెలయేటి చలువ। ప్రతి గుండెనూ లోలోపల తొలుచుకుంటూ పోయి తీయని చెంగల అఖాతాల తెరచిందా పాట। ఆయన మీటిన పాటలపల్లవి తెలుగుపల్లకిపై వెలుతురు రేకులా గ్రుచ్చుకుంది.

వేయటోవని తలుపును తీయమంటూ పిలిచింది. శిథిలాలయంలో శివుడు లేడని గర్జించింది. తన గళం కోయిలగా, తన మనసే తీయలగా మనుగడ ఎర్రని చివురుల మావికొమ్మ అనుకొన్నదా పాట।....సంప్రదాయ భీరువుల మాన పాలు అలసాలసంగా నిదుర దొరవులపడి కునికి, చీకటి శిలలై పోయిన వేళ వేకువగాలిలా వచ్చింది కృష్ణశాస్త్రి పాట।

ఆనాటి తెలుగు కవిత్వం కఠినశిలా సదృశమై విజనస్థలాల మరుగుతోంది. కృష్ణశాస్త్రి పాదరజోరశ్మి వేకువగాలిలో సోకి, ఇక్షు కోదండంగా నిలిచింది. అనదల గుండెలపై పీడ కలల బరువుల తొలగ ద్రోసింది. ఝుంఝూ ప్రభంజన ప్రాయిలా ఆగమించింది కృష్ణశాస్త్రి కవిత్వం। వస్తూనే నిత్య యౌవన శ్రీల విరమించింది. కొత్త చివురుల కమ్రెప్పలపై వ్రేలాడే అశ్రుబిందువులను జాలిగా తుడిచింది. చెలిమిలా, కలిమిలా పరిమళంలా చనుదెంచింది కృష్ణశాస్త్రి పాట।

పిసినారి ముసలితనం గణాచారమై గుడిసుళ్ళు తిరుగుతున్నపుడు ఉదార స్నేహ సింధువులా వచ్చింది కృష్ణశాస్త్రి గళకాహళి। అనుకోని ఒక నవ్యాతిథి అరుదెంచినట్లు ఆనందం విరయించింది. దరిచేరే ప్రతి పెదవికి నవీన శీధువు లందించే అమనిలా వచ్చింది. అత్తరువు పోసి వెలిగించిన కాగడా దేబూని, తరువు తరువునా పరిమళాలు లగిస్తూ ప్రేమల తోటమాలిలా వచ్చింది.

ఈ జడాజర్జరిత సనాతన ఆరామవాటికలో మృదుపద ధ్వనులు మీటుతూ కొత్త అడుగులు సారిస్తూ కృష్ణశాస్త్రి వచ్చేసరికి, తెలుగు సరస్వతి పరవసించింది. కురిసే పరిమళాలను పోల్చుకుంది. కృష్ణశాస్త్రి అవతారంతో తెలుగు సరస్వతి విపరీతంగా సంబరపడిపోయింది। దారి దొరకని తెలుగు గళద్వార సీమలను పొంగే తరంగహస్తాల పలుపు తొందరచేసింది. ఆనంద తేజోంబునిధులు కోమల గాంధర్వ మాలపించాయి।

తెలుగు కవితకు కృష్ణశాస్త్రి నవ వసంత స్పర్శ।

నట్లు: నిజం కృష్ణశాస్త్రికి మరణం లేదు. ముసలితనం రాదు. రోగం దరిచేరదు. అది నితాంత యౌవన ప్రభా వసంతం: కృష్ణశాస్త్రి గీతం లవలీమృదులతాంత పరిమళం:

"విరిసి జాబిలి మల్లి రేకగా
విరిసి తేనియల మువ్వాకగా
కురిసి మాపయి ధారధార ముంచెత్తగా
వేం చేసినావయ్యా కరుణానిధీ!"

సమాప్తం